# వేమన

సువర్ణ ఘంటాకంకణ బిరుదాంకిత
సంస్కృతాంధ్ర పండిత
మహాకవి

బండ్ల సుబ్రహ్మణ్యం

633/208

 మూల్యము 20-00

# పరిచయము

కవిత్వ మొకరి సొత్తు గాదు. కాదని యొకానొకఁ డన్నను నది గ్రాహ్యము గాదు. కవితాశక్తి వ్యక్తిగత ప్రజ్ఞను వెలార్చు చుండును. ప్రజ్ఞాశాలి యొకపుడు వీలులేక భాషాభాగ్య మబ్బక పోవచ్చును. కాని, యది యతని ప్రజ్ఞనేమాత్రము కప్పిపుచ్చఁ జాలదు. ప్రతిభలేని భాషాపాటవ మంత ప్రశస్య మనిపించుకోదు. చాలమట్టు కీతూక మన్ని యెడలఁ గుదురకున్నది. ఉన్నచో నది వ్రేళ్ళమీఁద లెక్క పెట్టవలసినదే.

ఒకఁ డింత సామగ్రితో నూటలూరు కవిత్వ మల్లును. మఱొకఁ డెంతో సాధన సంపద కలిగియుఁ బులుముడు ప్రారంభించును. అంతైన నంతైన ముకుసూటిగాఁజెప్పు భాగ్యమందఱకు లభింపదు. చెప్పినను నందలి జీవకళమాత్ర ముపజ్ఞామహిత మనక తప్పదు. దీనికి మన వేమనాదులే తార్కాణము.

వేమన భోగయోగము లడుగుమోవఁ జవిచూచిన రస సిద్ధుఁడు. ఆ కాలమున నతఁడు వాకొని యుఁకొట్టింపని లోకమే లేదు. అందుచేఁ దన్ను వశ్యవాక్కని నెత్తిన పెట్టుకొన దగినదీ లోకమే.

ఇందతని జీవిత ముపవర్ణింప లేదు. అది చరిత్రకారుల పని కళాతపస్వి కావాసన గిట్టదు. కట్టు కథల క్రిందికి దిగి "తన జన్మ వసుంధర నిర్ణయింప నాడెందము సమ్మతింప"దని మన కవి ముద్దుముద్దుగాఁ దప్పుకొనుచున్నాఁడు. అయిన నతని జీవిత శకలములు ముసిముట్టక పోలేదు.

నాసాగ్రమున దృష్టి నిలిపి మోకాలి కుటికివంగి బ్రద్దగట్టి వలె నున్న వెట్టివేమన్నను ప్రసాదించిన దీశిల్పిలోకము. ఆ రూపమునే విశ్వమత్తుకొన్నది. దానినే కవి మన గుప్తికిం దెచ్చి నాఁడు.

ఇందలి. యెత్తుగడలోని పొంక మందలి కందుపాటులో నుండునది కాదు. ప్రస్తుత వస్తువున కనుగుణముగా నిందలి ప్రకృతి విశ్వరూపము దాల్చినది. ఒకచోఁ గరుడుగట్టిన కాటుక కాయయై వేరొకచోఁ జిలుకముకు మామిడిపండులాగున గళలు చిందినది. అందుచే నిది సుదూరము నడచినను ఆపాత రమణీయముగానే యున్నది.

అసలు ప్రకృతి సుందరుఁడైన కవికి అంతరికదృష్టి హెచ్చు. తా వనుకొన్న దింత లింతలుగా గీతించును. మన బాహ్యదృష్టి కదొక మైకముగాఁ దోఁపవచ్చును. రసలుబ్ధులైన కవు లీతన్మయత దక్కి రాణింపలేరు. అందుచే వారంతగాఁ గథావస్తువు పొంతఁబోక పద్య మొక ప్రబంధముగా దిద్ది తీర్చుచుందురు. వారి ఛాయ లీప్రకృతిలో నెల్లెడఁ దొంగి చూచినవి.

బ్రహ్మముగారికి సిద్దప్పవలె అభిరామగురుని ద్వారా శివయోగి కితఁడు శిష్యుఁడై - అభిరామునిపే రమరమొనర్చినాఁడు. తెలుఁగు వేదాంతుల కీ వేమనాదు లాదర్శశిఖరాలు. తరువాత వచ్చిన చాగఁటివారు, మొదలగువారు తచ్ఛాయల నూఁది కుల పతులు కాఁ జొచ్చిరి.

వేమన వినా తక్కిన తెగల వారనిబద్ధచ్ఛందమునఁ దత్త్వముల ద్వారా తమ విజ్ఞానప్రసారము సేయఁ జొచ్చిరి. వేమన్న మాత్రము "బ్రహ్మమునుజూచి లోకుల భ్రాంతిఁజూచి" ఆటవెలఁది

నెగవిడిచినాడు. ఆ "విశ్వద" జగ్గు నిగ్గు లిందులోఁ బట్టుకొన్నఁ బరిమళించినవి. ఆ వీణానిక్వణ లీనరాగకళ లిందులో విజ్జిళాలినవి. అందుచేతనే వేమన్న ఆటవెలఁది కింత గిరాకీ హెచ్చినది.

తలపోఁతలో రామ రహీము లొక్కఁడన్న మహాత్ముని నిర్వచనము చక్కఁగా సమర్థింపఁ బడ్డది. ఖయాము, కబీరుల తేడా, బుద్ధభగవానుని త్యాగమహిమ యిందుటంకింపఁబడ్డవి. ఇందుపవర్ణితములైన విషయాలీకవి భావనాశక్తికి వ్యాఖ్యాన ప్రాయాలు,

శ్మశానవాటికలోఁ జిందు నుడుకు నెత్తురు, భర్తృవియోగాగ్ని, పుత్రశోకార్చి, పితృదహనము, మిత్రదుఃఖ జ్వాల లేకమై చితాభస్మవేదికఁ దాండవించినవి. కళలు కన్నీటితో జలాంజలు లొసంగినవి. ఇఁక మిగిలిన దేది? మృత్యుదేవత కోఱలలోని మెఱపు? — ఈ మెఱపులో మన విశ్వసన్న్యాసి కుండలిని జిక్కఁబట్టి అష్టసిద్ధులు లోఁ గొన్నాఁడు. సృష్టివైవిధ్య ముపచరించు బ్రహ్మను నెత్తి చూపినాఁడు.

ఇట్టి రససిద్ధుని కవీంద్రుఁడనకున్న మునిఁగిపోయినదేమి? మఱఁగిపోయిన దేమి? అందతుకుల బొంతలన్నను ననకున్నను నితఁ డమరకవియే యని మన కవి తృప్తుఁడైనాఁడు.

"తిట్టించుకొన్నవాఁడె గట్టిగ నవ్వినపుడు" "నోరు గలుగు తెలుఁగు వారెల్లఁ దన పద్యములు వల్లె వేయుచున్నప్పు" డీశం కరుఁ డావెక్కడిడి? ఎవరే నన్న నది కసివోక కొసిగొట్టుకొను మాట.

పైఁగాఁ గారణ విమర్శనాశక్తి గలిగి సైఁకులు గాఢిక తితో మత్తరించినట్లు గనిపించు కవిత్వము తెలుఁగు వెన్నెల బయళ్ళలో నడయాడుటకు జంకునా? కొంకునా?

నాఁటి పండితులు కబీరు ప్రభృతులకు బలె నీతనిని నూపక పోలేదు. ఊపిన నేమి? "విన్న మీకుఁ గన్న మాకుఁ జర్చ లేమి టయ్యా" యని వారిని జోకొట్టి విడిచినారు. పరుల యున్నతి కుడిక మిడుకు శరాత్ములు కామక తెగులు లేని వేదనపడి తీఱెదరు వారుపేక్ష మాత్రి దండ్యులని యీ కవి మతము. అయినఁ దీయని నోరఁ జెదుమేయు నాపలఁ జెంగనాడిన ఫలమేమి?

తమిళ కన్నడములలో వేమనార్యున కుజ్జియైన వారొక తిరువళ్ళువరు, సర్వజ్ఞుఁడని తజ్ఞులందురు. తెలుఁగున మాత్ర మతని కతండె సాటియని పలువుర యభిప్రాయము. కాని అలఁతి యలఁతి పల్కులం దెంతో భావ మిముడ్పఁగాఁ డిక్కయజ్వ కితఁడు దీటైనవాఁడని ఈ కవి యభిప్రాయము. భవతు:

త్రాళిక, బిత్తళి, చాడి, సొడ్డు, దుడ్డు, బైసి, మంకు, రిమ్మ, బసి విత్యాది పదాలు కన్నడీయాలు ఈ కవిద్వారా తెలుఁగు పొలాల నెలకొన్నవందురు.

ఇది అక్క సెల్లెండ్రి పొత్తు - ఎక్కడో మిన్నులు వడ్డచోటి దైన భాషాభేషజ మాత్సర్యముగాఁ దయార్త్రైనపుడీ చెలిమి కల్ల పడ నవసరములేదు. స్వరూపజ్ఞానము నశింపఁ జేయనిబలుపు, పల పొకదినును మెచ్చుకోలునకే యగునేమో?

ఇందలి శైలి పాదరసములాగునఁ బరువెత్తినది. భావములు కొట్టవచ్చినట్లున్నవి. శయ్య నాలుగంచులు తీరినది. సూక్తులలో బదునాఱణాల తెలుఁగుదన ముట్టిపడినది. ఇంతేల? ఈ సూక్తులన్నియుఁ వేమన్న నోటినుండి యథాతథముగా నూడి పడిన నట్లున్నవి. సూక్తులకు ముందలి ఖండములలోఁ గావ్య మర్యాద లిరవుకొన్నవి. వానిని దిఙ్మాత్రముగా సూచింతుము.

ప్రకృతిలో ౧౮ వ- పద్యము బట్టుమూర్తిని గుప్తికిఁ దెచ్చుచున్నది. అందలి ౨౮ వ- పద్యము పారిజాతకవి కత్యంత సన్నికృష్టము. సమావేశ కృతిలోని ౨౧ వ- పద్యము సమాస విస్ఫూర్తికిఁ దటిమెనఁ బెట్టినది. ౧౧ వ- పద్యమునఁ జందన చర్చలు గులుకు నలసాని శయ్యాసౌరభము గుబాళించినది.

తలపోఁతలోని "ఎముక లేద్బుకతిను" నట్టి ప్రయోగములు తేనెపెరలఁబోని తంజాపురి కవుల రచనలు బుణికి పుచ్చుకొన్నవి.

"ఔపనిషద వివేకానంద" "మన ఉద్ధతి" మొదలగు ప్రౌఢకవి ప్రయోగము లైచ్ఛికము లనిపించుచున్నవి.

ఇందడుగడుగున నుప్పతిలు జాతీయ పదముల, నానుడుల నెత్తిచూపుట కయితిగానిపని - ఒకటా రెండా ఎత్తిచూపుటకు కథావస్తువు లేకున్నను ఈరీతి సూక్తివైచిత్రిచేఁ పాఠకుల మెప్పించుట అసాధకున కరిది. ఇందు కవికుండవలసిన సాధన సామాగ్రి పుష్కలముగా నున్నది. ప్రత్యుత తెలుఁగు పోడుముల కెల్లయగు జాతీయసంస్కృతి పెల్లుబుకు చున్నది. ఇంతకు

సహజసుందరమైన యీ కవిత్వమున కన్యుల పరిచయ మనవసరము.

సొమ్మెత కామెతయైన ఈ తెలుఁగు నుడికారపు సొంపే భావుకులకుఁ జుబ్బన చూఱకాఁగలదు.

— ఏటుకూరి వేంకటనరసయ్య.

# విన్నపము

భారతీయ మహింసాధర్మ మీనాఁటిది కాదు. దాని నొక స్వరూపమునకుఁ దెచ్చిచూపిన బుద్ధదేవుఁడు మనపాలిటి భగవానుఁడు. ఆ ఛాయ లందుకొని ప్రపంచజ్యోతియై వెలుఁ గొందినవాఁడు మహాత్ముఁడు. ఆయన ధర్మమున నేఁటికి స్వాతంత్ర్యము లభించినది. అది కారణముగా మన జాతీయదృష్టి వైజ్ఞానిక ప్రవణమైనది. అన్నింటికన్న భాషాస్వాతంత్ర్యము జాత్యభ్యున్నతికి మూలకందము. కావున, నేఁడు దేశభాషలకుఁ గలిగిన ప్రాముఖ్యము నా కెంతయో ముద్దుగొల్పినది.

రసపిపాసులకుఁ గళారాధనము నైజమైనది. వారిలో నణుప్రాయుఁడనైన నాకుఁ జిననాఁటి నుండియుఁ గవితా వ్యాసంగమన్న నిష్టముంటచే నెడనెడఁ బెద్దల ప్రోత్సాహమున నింతనంతఁ జెప్పనేర్చి మూఁడు దృశ్యకావ్యములు వ్రాసితిని. అవి యందందు ప్రదర్శితములై యుత్సాహజనకములైనను శ్రవ్యకావ్యములయెడ మనసు వ్రాలినది.

కొంత సాధనద్వారమున నా బాటలఁ గాలిడితిని మునుముం దాంధ్ర కవి గాయక శిల్పులనుగూర్చి లలితకళాక్షేత్రమను నొక ప్రబంధము వ్రాయఁదొడఁగితిని. దానిలో నొక ఘట్టమే యీ వేమన.

ఆ గ్రంథమును జూచిన మిత్రులు ప్రత్యేక ప్రత్యేకముగా దీనిని వెలయింపుఁడని నాకు సలహాలిచ్చిరి. అదియుఁ బ్రచారమునకుఁ గొంత సుకరముగా నుండునని యీ పనికిఁ బూనితిని.

తమ పరిచయమూలమున గ్రంథమునందలి భావరేఖలను బాఠకలోకమునకుఁ బరిచయ మొనరించిన "కవిబ్రహ్మ" శ్రీ ఏటుకూరి వేంకటనరసయ్యగారికిని, ది 6-2-1949 మధ్యాహ్నము

గం. 11-30 లకు పరమేశ్వరుండు కృతిభర్తగా శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు (M.A). పంతులుగారు సభ్యాధ్యక్షులుగా, 6 వ- దక్షిణభారతవయోజన విద్యా మహాసభలో కృతిసమర్పణ మహోత్సవ మత్యంతోత్సాహమున జరిపించి, ద్వితీయ ముద్రణకుం బ్రోత్సహించి చేయూఁత నొసంగిన శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులు గారికిని, ముచ్చటగ తృతీయ ముద్రణము అట్టతోసహా అచ్చొత్తించి ఇచ్చిన లిబర్టి ప్రింటర్స్ చీరాల వారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

గ్రంథకర్త



ఏ పరమేశ్వరుండు జగ
మెల్ల సృజింపను బెంపఁ ద్రుంపఁ దా
నోపెనొ? యే యనంతుఁడు య
థోచితరీతి సమస్త జీవులన్
బాపములన్ దొలంచి నిర
పాయ సుఖస్థితిఁ దేర్చుచుండెనో?
ఆ పరమాత్మ కీ కృతి స
మర్పణసేతు నభీష్టసిద్ధికై.



ఏ సర్వజ్ఞదయావిశేషమున నాకీవాకు చేకూరెనో
ఏ సర్వేశు కృపా కటాక్షమున నిద్దీ రూపముందాల్చెనో
ఆ సర్వాత్మకు పాదపద్మములకే నర్పించుటన్ భక్తిమై
ఈ సాహిత్యలతాగుళుచ్ఛ మెదకెంతేఁగూర్చు నామోదమున్

పచ్చకప్రపు మొలక లాపలుకుబడులు
పచ్చి కస్తురి వలపు లా భావభంగు
లతి మధుర మాస్వరూప మెట్లన్ననేమి?
అందచందాలరాణి మా యాంధ్రవాణి.

తను దెఱచి మూసినంతన
కన దద్భుత లీల నాకుఁ గన్పడు లోకం
బనుపమ కవితాలోకం
బనఘులు కవిచంద్రు లిది మహార్థమ కాదే?



# వేమన

## ప్రకృతి

ఈ వనము పొంత ఈ రాత్రి ఈ వికార
భూత బేతాళ సంచార భీతిద మగు
ఈ నదీతీర ఘోర శ్మశాన వాటి
ఎట్టి క్రిందఁ గనంబడు వెట్టి యెవఁడు? 1

ఊఁడల కూడలే పెరిఁగి యూర్జిత సత్వ సమేత మైన యీ
నీడలమఱ్ఱి నీలధరణీధర మోయనఁ దోఁచుచుండు నీ
పాడుబయళ్ళ వట్టిచను పాంథులఁ దేర్చెడు దీనిపై సదా
గూడులఁగూర్చి బిట్టగసి కూయున నేక విహంగ సంతతుల్. 2

కాయలను నల్లగ్రుడ్లు గ్రక్కదలుచుండ
ఆకు లను పల్లజడలు వ్రేలాడుచుండఁ
చటపటాయించు నీ పెద్దతాటిచెట్టు
బ్రహ్మరక్షస్సు నాఁగంటఁ బడ్డ డిచట, 3

పచ్చపైరుల క్రొఁగొత్త వలువఁ దాల్చి
తళుకు బెళుకుల భూదేవి కులుకుచుండెఁ
జేనుగట్టుల బొరియల చెంత నిలిచి
దొంగజపమాచరించు నా కొంగతుటుము. 4

పిల్లకాల్వలు ముత్యాల పేరులట్లు
క్షేత్రలక్ష్మికి జిగిమీఱు చెలువమొసఁగె
తడిసియుండఁగఁ జలిగాలి తగిలినంతఁ
బుడమి పులకించినది యనఁ బూచె జిల్లు. 5

సంజ మందేహ దైత్యులు సారసాప్తుఁ
డని యొనర్చుచు విడిచిన యలుగులెన్నొ
కొట్టుకొని పడి భువిగుచ్చుకొనిన వనఁగ
ఏచి యందంద పూచికల్ తోఁచుచుండె. 6

మండుటెండల నోరెండి మంచినీటి
కొఱకుఁ దపియించు పాంథులఁ గూలఁద్రోయ
నెండమావుల సృజియింప యేచునట్టి
దాన మెఱుఁగని వట్టి మైదానమిద్ది. 7

కారుచిచ్చులాటెఁ గలువలు మితిమీఱ
మరుఁడు కత్తినూఱె మడుగు దీఱె
అసలు పుట్టువూరె నంచపిండులు కేరెఁ
గాలమహిమ కడ్డుగలదె జగతి ? 8

పేద మెకముల నెత్తురు పీల్చునట్టి
క్రూర జంతుల స్వైర విహార వేళఁ
బాప మీరూపమున వచ్చి పడినదనఁగఁ
గాఱు చీఁకటి జగమెల్లఁ గౌఁగిలించె. 9

కీ లెఱిఁగి గట్టిగాఁ గంచు గీచినట్లు
లీల కోళులు 'గీ'యని గోల సేయ
గుడ్లగూబలు 'గుబ్బ'ని గొతుకుచుండ
బీతు గొల్పిన దిచటి విభీతకంబు. 10

ఇదిసమయంబు హింసయొ? అహింసయొ? లోకముని ద్రగూరియు
న్నది తెలివొందెనా? తగు నెడాటము సాగఁ దొఁకెట్టునన్ నా
మదిఁగల కోర్కె దీఱఁగ నమాంతము పక్షుల దొర్చితింట నా
కది పది వే లటంచునె దివాంధము లేచిన ద్రొక్కపెట్టునన్. 11

కొలఁది దూరమునం బేర్చు కొలఁకునందు
అలఁతి కప్పలు 'బెకబెక' లాడఁదొడఁగెఁ
బొవలఁబొదలెడు పిట్టలు పోరుసలుప
వాని జెక్కలసడికి నవ్వలను కలఁగె 12

ఘోరతమమున బ్రహ్మాండ గోళమంత
కరుడుగట్టిన కాటుకకాయ యయ్యెఁ
గొఱవి దయ్యాలబలె మిణుగుఱులెసంగఁ
జుక్క లొయ్యొయ్య మార్గము సూపుచుండె. 13

పీన్గుపెంటల కటునిటు పెనఁగులాడి
నక్క లొకచోట గుమిగూడి దిక్కులద్రువ
నూళ పెట్టుచు నున్నవీ కళత్రి
నెట్టు లుంటివో? యిచ్చోట నెఱఁగియెఱఁగి 14

యోగసమాధిలో మునిఁగియుండి పరాత్పరుఁ జూచుచున్న యీ
రాగవిదూరుఁ డెవ్వఁడో? పరాకుగ నీతనిఁ బల్కరించితిన్
భోగియుఁ ద్యాగియున్ బరమపూజ్యుఁడు నౌమనవేమనార్యుఁడా?
ఆగెదఁ గొంతసేపు మనసారఁ దదీయ దిదృక్షనారయన్. 15

విన్ననెడు మల్లెపందిటఁ జెన్నుమిగులు
పిన్న మొగ్గలు కగ్గని పెద్దమొగ్గ
లనఁగ నక్షత్రములు లెక్క కలవిగాక
మిన్కుమిన్కని మినుచక్కి మెఱయుచుండె. 16

హృద్యత్కృత్యుఁడు సృష్టికర్త రజితాద్రింజేరి గంగాపగన్
సద్యశ్శ్రీ నలరారుదానిగని పెల్చన్ గాలియంత్రానఁ ద
ద్విద్యుత్తున్ గొనివచ్చి నేరు పొలయన్ విన్వీధి వెల్గించెనా
విద్యుద్దీప శిఖావితానముగ నొప్పెన్ దారకానీకముల్. 17

అబ్జకిరణాలు భక్షించి యాకసమున
స్వేచ్ఛ దిరుగు చకోరమ్ము లెడలవిడుచు
రెట్టలోయన 'జెకుముకి' కొట్టినట్టు
లుల్క లందంద గాదిలో నురలఁజొచ్చె. 18

ఉడుతచేఁ గొంత చవిచూడఁబడిన తేఁత
చిలుకముకు మావిపండునాఁ గళలుచిందు
నర్ధచంద్రుఁడు దోఁచి తెల్లైనపిదప
ఎల్లవాఱిన జగమెల్లఁ దెల్లవాఱె. 19

దివిని సుధ ద్రావుచుండిన దేవవిభుని
చేయి జాఱుటచే రెండు చెక్కలగుచుఁ
బగిలిపోయిన పింగాణి పళ్లెమనఁగ
మింట జాబిల్లి సగమయ్యె మెఱయుచుండె. 20

హరిపదమ్మను నిర్మల సరసునందుఁ
దెల్లఁ దామరలనఁ జుక్కలెల్లఁ దనరె
నొడ్డునందోఁచి మఱియొక యొడ్డుజేరు
రాజహంసము నా నలరారె రాజు. 21

గగనమను నల్లబల్లపైఁ గాలగురుఁడు
సగము భూగోళపటమును సరిగగీచి
మిట్టపల్లములను గుర్తుపెట్టె ననఁగఁ
దెలుపు శశియందు హెచ్చుతగ్గులుగఁ దోఁచె. 22

ఉదయ మెడపేయు కబ్ధిలో నుదకమాడి
విష్ణుపదమంటి యాశ సేవించి యతఁడు
లలిత తారాయుతుండయి కులికె ననఁగఁ
బీచుమబ్బుల తెరల దోఁబూచులాడె. 23

మదురుతమంబులో నణఁగిపోయిన లోకము నుద్ధరింపఁగా
నొదవెను రాజు. రాజకళ యుట్టిపడఁ సమతత్త్వశీలుఁడై
సదయత సర్వజీవులను శాంతరసమ్మున ముంచితేల్చుచున్
హృదయము కందిపోనడచె నిట్టివె సద్గుణరాజధర్మముల్. 24

మేడపై పూలపాన్పున మెఱయుచున్న
లచ్చిగల యింతి కేసుఖ మిచ్చినాఁడొ!
నేలపై నెత్తికొంగున నిదుర గూరు
బిచ్చగత్తెకు నాహాయి నిచ్చినాఁడు. 25

జనకుఁడు రత్నాకరుఁడని
తన పేరు సుధాకరుఁడని తగవెఱిఁగి బుధుల్
మనుపు మని యాశ్రయించినఁ
దనువుఁ గల యమృత మతఁడు దానము సేయుఁ 26

భవుని తల సుల్లెచెండు - దేవతలపండు -
కాలపురుషుని కన్ను - పాల్కడలి జన్ను -
కలువ చక్కిలిగింత - దొంగలకుఁ జింత -
అందచందాలసీమ - మాచందమామ. 27

ఆత్మ మదనాగ్నిఁ జల్లార్పఁడని తలంచి
ఈ కళానిధిఁ జూచి సహింపలేక
విరహిణుల్ తిట్టి మెటికల విఱుతురౌర?
సర్వజన పూజ్యుఁడగు వాఁడు జగతి లేఁడు. 28

చంద్ర! నిన్నవలోకించు సమయమందు
'వరదగుడి' వన్నెచిన్నెల వంకఁజూడ
ఎంత సంతస మబ్బునో యంతకంటె
నధికతరమైన సంతోష మావహిల్లు. 29

ఇనువ గజ్జెల తల్లి వసించు గృహము
రక్తి చెడియుండుఁ జీఁకటి రాత్రివోలెఁ
పద్మ దయతోఁ గటాక్షించు వాని గీము
రమ్యముగ నుండు వెన్నెల రాత్రివోలె. ౩౦

దూది గుట్టలు గాలిలోఁ దూలిపోవు
చున్న విధమునఁ గన్పడుచున్న వచ్చ
మబ్బుతునకలు తనశక్తి మాసిపోవ
సృష్టిలో దేనిగతియైన నిట్టిద కద! ౩౧



బ్రహ్మమును జూచి లోకుల భ్రాంతిఁ జూచి
పలుకుచున్నాఁడు కమ్మని పద్యములను
తపసితో మటలాడఁగాఁ దగినవేళ
ఇదియ గావున నే సమీపింతు నింక. 32

వేమన యోగీశ్వరులా
స్వామీ! పొరపాటు, తప్పు క్షమియింపుఁడు మీ
కోమల దేహము పసచెడె
నేమీ? గుర్తింపఁజాల కే నిట్లంటిన్. 33

బంగరు పూవుటూయెల సెబాసన నూఁగుచు నున్నవాఁడు రా
జ్యాంగనఁ గూడి వేడ్క మెయి నచ్చట నీదు సహోదరుండు; త
త్సంగతి కేమి? నీ విట శ్మశానభయానకవీథిఁ జిత్కళా
రంగము నేలుచుంటి వవురా! యనుజన్మల భేద మిట్టిదా! 34

అధికార గర్వ మెఱుఁగఁడు
బుధులన్నం బ్రాణమిచ్చుఁ బురజనులను సత్
పథమున నడపం జూచును
ఔర వేమన సాటి నృపులు పృథివిం గలరే! 35

తెలుఁగుం గబ్బములన్ రచించి శుభ సందేశంబు లాంధ్రావనిం
జెలఁగం జేయుచు రాజ్యపాలనమునం జేదోడువాదోడుగా
మెలఁగంజాలెడి తమ్ముఁ గుఱ్ఱవని నమ్మింగాని యీ రీతిగా
నిలభోగంబులఁ ద్రోసిపుత్తువని భావింపఁడు తానాత్మలో. 36

నీతిపునీత 'విశ్వద' మణీమయ సౌధ వితర్ది నుండి యుం
జేతము నీవయి న్నిలిపి చింతిలు చున్నటు లున్న దింతకున్
లేఁత గులాబిపూవుల బలెన్ జిగి గూరెడు మేల్మి బుగ్గలన్
ద్యోతక మయ్యె మౌక్తికము లోయన జాఱిన యశ్రుబిందువుల్. 37

ఎంచి విరించి చెయ్యమున కేడ్చి తపించి విపంచి మీటిన
ట్లించుక సంచలించి నినదించుగళమ్మున మూఁగరాగ మొ
క్కించుక రేఁగి రేలఁ దమకించి యొడల్ చెమరింప నీకునై
కాంచన కేతకీకుసుమగాత్రి బయళ్ళను గౌఁగిలించిచెదుఁగా. 38

ఆమని లేఁ జివుళ్ళు దిని హాయిగఁ గోయిల కూయుచుండఁగాఁ
ప్రేమ సుధాస్రవంతి ము పొంగెడి భావతరంగలోలమౌ
కోమలి సౌఖ్యనౌకపయిఁ గోమలి, నీవు రసైకలోలురై
ఏమనుకొంటిరో తిరిగి యేత్రియఁ బాసి చరించుచుంటిరో. 39

ఫణిజయు మానసమున రాజహంసల భంగి
నీఁదు లాడి నట్టి దృశ్యమిప్పుఁ
డాకె కింక మఱపు రాక చీకాకువఁ
గుందుచున్న దురక డెందమందు. 40

సహజసౌందర్య సౌహార్ద్ర సామరస్య
మహిత నాయికా నాయకాత్మజ విలాస
మది రసాయన సమ్మేళ మగును, గాని
భౌతికపు మిశ్రమముగాదు త్వరగ విడగ. 41

చందనచర్చలం గులుకు సానిమొగమ్ము కళావిహీనమై
కందిన దందుకై ముఖము ఖమ్ములు సూచికొనందొడంగి రం
దంద చెలుల్ పటీరజల మాకెపయిఁ జిలికించుచుండి రా
కొండల మేమిచెప్ప; నిముగూర్చి తపింపని తావులేదటఁ 42

ఖండ శర్కర నోటినిండఁ గ్రుక్కెద నీక
 పలుకవే యొకమాఱు చిలుక నీవు
బంగారు గజ్జెలు పాదాలఁ జుట్టెద
 నృత్యమ్ము సేయవే నెమ్మినీవు
తియ్యని పండ్లను దినిపింతుఁ గొరిఁగొత్త
 వార్త సెప్పవె గోరువంక నీవు
కాదమ తామరతూండ్లు ముదమార నొసఁగెద
 నటునిటు తిరుగవే హంస నీవు 43

అలచుఁ జెలులైనఁ బులుఁగుల నాడరేల
పులుఁగులైనను గవగూడి కులుకవేల
భోగవతిపాలఁ బడిన వియోగ రసము
చేతనాచేతనములందుఁ జిందె నేమొ?

తానే తావకరూప మాసపడి తొల్తన్ నిన్నుఁ బ్రేమించెనో
యా నారీమణిరూప మాసపడి నీ వాసించితో మీ మనో
వీణానిక్వణలీనరాగకళ కీ విశ్వంబు విభ్రాంతమై
మ్రానై పోయిన దీదృశప్రణయ సామ్రాజ్యంబ దిట్లయ్యెనా?

జవ్వనమునఁ దొలఁకు జగ్గునిగ్గులు వసి
వాడనట్టి కొమరుఁ బ్రాయమందె
ఈ వియోగజలధి నీఁదుచు లలితాంగి
పచ్చి పసుపుఁ గొమ్ము పగిదినొప్పె.

కమ్మనూసెలు, దుస్తులు, కాలిజోళ్ళు
నిల్వుటద్దాలు, లేఖలు, నీరజములు
కాంచినపుడెల్ల నీ రూపు కనులఁ బ్రేల
వేడినిట్టూర్పుపుచ్చు నావెలఁదమిన్న.

నాఁడు విశ్వదిహృద్గుహ నవ్య భవ్య
సరస భావమణీఘృణి శబలితంబు
నేఁడది వియోగ వాయుఘూర్ణిత నితాంత
ఘోరదుఃఖ రజఃపుంజ పూరితంబు.

ఉడుగక నర్మగర్భ విషయోక్తి సుమాసవ మాను వేళ నం
దడరి వనీహారమునకై రథమెక్కి గమించు వేళ మీ
రడకపుఁ బ్రేమతో జలక మాడెడు వేళ మహోదయంబుగాఁ
దొడరిన యచ్ఛమోహరస తోయములింకె విరాగకీలలన్.

జన్మమునుబట్టి వేశ్య నాఁజనునుగాని
దివ్యగుణముల సతులకుఁ దీసిపోదు
కాన గాంధర్వ వైవాహికమున శుద్ధి
యంచు మీ ప్రేమబంధమ్ము నెంచవచ్చు.

ఆటవెలఁది సుఖాంతైక నాటకమున
రంగమధ్యంబుననె తెఱ వ్రాలిపోయె
నిఁకఁ బ్రదర్శించు రూపక మెట్టిదనిన
నతి విషాదాంత నాటక మందుమయ్య.

రచ్చబండమీఁద విచ్చలవిడిఁ జేరి
తమ విచిత్ర జీవితములఁ గూర్చి
పౌరు లెంతొ వింతపడి చెప్పుకొనుచుంద్రు
దైవఘటన మనుచుఁ దలఁచుచుంద్రు.

హృదయ దౌర్బల్య మిసుమింత యెఱుఁగనట్టి
నీ మహా త్యాగదీక్షకు నివ్వెఱపడి
యుష్మదాత్మీయ బంధువు లొక్కొకయెడ
మెచ్చుకొనుచుందు రీ నీ కీర్తి పిచ్చలింప.

మొగ్గ దొడుగునపుడు ముడుచుకొన్నను దఱి
వచ్చి పూవు పరిగ విచ్చెనేనిఁ
బ్రొద్దుదిరుగు డరక ప్రొద్దునే చూడదా ?
విశ్వవినుతచర్య ! వేమనార్య !

ఈషణత్రయంబు నీనడించిన నీవు
గణిక పలుకు లెట్లు గణనసేతు ?
కడలి దాఁటునతఁడు కాల్వకు లోఁగునా ?
విశ్వవినుతచర్య ! వేమనార్య !

కతిపయదినంబు లీరీతిఁ గడచినంత
నామెయు న్నీదు మార్గంబు ననుసరించుఁ
గామ తత్వంబు నిస్తుల ప్రేమతత్త్వ
మైక్యమై ముక్తినిధిఁ జూఱలాడకున్నె ?

ఎపుడు వెలయాలితో స్నేహ మెసఁగియున్న
నన్నగారన్న భక్తి నీకగ్గలంబు
కాన, నొకనాఁడతం డెదురైన యంతఁ
దలుపు చాటునఁ బిల్లివై దాఁగుచుందు.

మెఱపుఁదీగఁనుబోని నెమ్మేనుగల్గు
వారకాంత నొకింతలో వదలివైచి
అంతకంటె మహానంద మలవరించు
ముక్తికాంతను జేపట్ట మురిసితీవు.

ఆకాంతను నీ కాంతను
నేకమ్మొనరించి కులుక నేరికిఁ దరమౌ
లోకాతిశాయివిగదా !
నాకము నరకంబు గలిపినాఁడవు వేమా !

పశ్చాత్తాప విదగ్ధ పాపపటల పారిదుర్భవ చ్ఛిద్రమా
నిశ్చింత ప్రతిభా విభాసుర మిళ న్నిస్తంద్ర యోగక్రియ
దుశ్చారిత్ర తమః ప్రభాకరుఁడవై దోతెంచు నిన్నెంతయు
నాశ్చర్యోద్ధతిఁ జూచు రాజ్ఞిఋణ మార్యా ? తీర్తువా: జన్మలో.

ఆ నరసాంబ మీ వదిన యద్భుత వత్సలతా పరిపూర్ణయై
కానక కన్నసంతుబలెఁ గాఁచెను ముద్దు మఱందివంచునాఁ
డా నలినాక్షి నీవొక మహాత్ముఁడ వౌదని నమ్మెనేమొ ! నీ
పూనిక కడ్డుసెప్ప దది పూర్ణముగా ఫలియించె వేమనా !

సారసనేత్రువంటి పతి సారసమిత్రునివంటి పుత్రులున్
సారససజాతవంటి సుత సారసవైరునివంటి కీర్తియున్
సారసన్నిభంబయిన సద్హృదయంబును గల్గ నామె సం
సారము స్వర్గతుల్యమయి సజ్జన సన్నుతి గాంచుట బ్రిమే ?

పెట్టెడువేళఁ దల్లివలెఁ బ్రేమను జూపెడివేళ భార్య నా
గుట్టును విప్పిచెప్ప తఱిఁ గూరిమి మంత్రివోలె నోర్పుతో
నెట్టన సేవసేయుచెడ నేర్పుగఁ జేసెడి దాసియట్ల యా
పట్టపురాణి భర్తృపదపద్మములన్ భజియించు నెప్పుడున్.

ఓసీ ! సోదరుఁడిట్టు లయ్యెనని రాజోత్తంసుఁ డల్లాడఁగా
ఆసాధ్వీతిలకంబు తావకభవిష్యమ్మాత్మ నూహించుచున్
మీసన్యాస మనన్యసాధ్యమని స్వామీ ! భర్తతోఁ ద్వ్రుసా
ళాసానంద విలాసిభావముఁ దెల్పన్ తేఁడు శాంతింపఁడా !

ఆడిగినదెద్ది కాదనఁడు తండ్రివిధాన
దయఁ జూచునని యెడి తరుణి యొకతె
మంతనంబుననైన మనసిచ్చి మాటాడు
మఱపుకాఁడని పల్కు మగువ యొకతె
కలవారి బిడ్డనన్ గర్వమించుక లేక
చనవిచ్చు ననుచుండుఁ జాన యొకతె
పెఱవారి కష్టముల్ విని సహింపఁగలేఁడు
కడు జాలికలఁడనుఁ గలికి యొకతె

ఒక్క వేశ్యావిలోలత దక్కఁ బెక్కు
సుగుణములకిక్కయని చాటు సుదతి యొకతె
ఇట్లు పరిచారికలు తమ యిచ్చకొలఁదిఁ
బలుకుచుందురు కూరిమి మొలకలెత్తి.

ఏ తల్లి గన్నదో నిను
నీ తీరున మోక్షరాజ్య మేలుటకొఱకై
ఆ తల్లి కాన్పె కాన్పని
చేతో ముదమొదవ నిజము చెప్పెదనార్యా !



# తలపోఁత

ఆ పరాశర బాదరాయణ మరీచి
వాలఖిల్యాక్షపాదాత్రి వామదేవ
నారద వసిష్ఠ సనకసనందనాది
ఋషులు వోయిన త్రోవ లీ దృశములన్న!

పాపభూయిష్ఠమైన ప్రపంచమందు
నిజము, కల్లగఁ గల్లయే నిజముగాను
కానఁబడుచుండు దాని వైఖరు లెఱింగి
తప్పుకొనుచుంద్రు నీవంటి తత్త్వవిదులు

ఆరత్నావసథమ్ము లా వనము లా హస్త్యశ్వశాలాదు లా
నీరేజాకరవాసిహంసతతు లా నిర్ణిద్రభోగమ్ము లా
శ్రీరమ్యోపలవేదు లా చెలువ లా శ్రీగంధచర్చాదు లీ
వేరెత్తిసె విడనాడి వచ్చితివి స్వామీ! విశ్వసన్యాసివై

తతహంసతూలికా తల్పంబులా లేవు
సౌవలాఱఁ దోఁచు బూడిదలుగాని
ద్యుతిమీఱివెల్గు విద్యుద్దీములులేవు
కార్చిలు పెన్గొఱవి దయ్యాలుగాని
వంధిమాగధ భట్ట వైతాళికులు లేరు
కాకఘూక సృగాలకఘులుగాని
చంద్రకాంతోప లాస్థానసీమలు గావు
పాలుపేదు రక్కెసపొదలుగాని

వెలిచి పనిసేయవచ్చు సేవికలుగారు
ఎముక "లేర్పుక" తిను పిశాచములుగాని
సమ్మతింప విభూతి తత్త్వమ్ముగాదు
మృత్యుదేవత కోఁటల మెఱపుగాని.

కొమ్మకుఁ గొమ్మ రాచుకొని ఘోరదవాగ్ని జనించి కాల్చు వృ
క్షమ్ముల, రోగరూపమున స్వైరవిహారము సల్పు మృత్యువే
యిమ్మగ దుఃఖదూనమగు నీ జగమందె సుఖంబు గల్గునే
కుమ్మరి యావమందెవరు కోరిన నిత్తడి పాత్రలుండునే.

ఒకచోటఁ జిక్కని యుడుకునెత్తురు క్రాఁగ
భర్తృవియోగాగ్ని జగబగమను
ఒక కేళివ నాశాలలో న్మూలహేతువై
పుత్రశోకాగ్ని కొఱింబొగలుచిమ్ము
ఒక వంక వాత్సల్య వికల సాధనమయి
పితృ కాష్టవహ్ని విభీతి గొలుపు
ఒక దెస హృదయదారక ఘోరదృశ్యమై
మిత్రి దుఃఖజ్వాల మింటి కెగయు

ఒక్కచక్కి మధ్యమలోక ముద్ధరించు
కలము. కత్తి, కిన్నెర, కుంచె లలవిగాని
మంటలోఁబడి మలమలమాడుచుండఁ
గళలు కన్నీటితో జలాంజలు లొసంగు.

ఈ చితాభస్మవేదిక నీశుఁడెక్కి
తాండవమొనర్చు నుగ్రభూతములతోడ
ఈశ శబ్దార్థుఁడవుగాన నీవుగూడ
నిట విహారమ్ము సేయుదువే మహాత్మ!

ఔపనిషద వివేకానందగరిమచే
మన ఉద్ధతి మఱింత మాఱనేమొ ?
వస్తుతత్వజ్ఞాన వైశిష్ట్యమునఁ జేసి
అద్వైతసిద్ధాంత మంటెనేమొ ?
జనన మరణ దుఃఖ సంభావనంజేసి
అచలయోగరహస్య మబ్బెనేమొ ?
విమలబోధామృత వీచికారుచిరమై
కవితాస్రవంతి గ్రిక్కదలెనేమొ ?

కుండలిని జిక్కఁబట్టి లోఁగొన్న కతన
నష్టసిద్ధులు స్వాధీనమయ్యెనేమొ ?
కడుపు చల్లఁగ నినువంటి ఘనునిగన్న
ఆంధ్రమాత కహర్నిశ మంజలింతు.

మానసికతత్త్వ పరిణామ మార్గ మరసి
నిశ్చల సమాధినిష్ఠలో నిలచియుండి
సచ్చిదానందమయుఁడు కాఁజాలినట్టి
యోగికంటె వినిర్మల భోగియెవఁడు ?

ప్రణవ పుంస్కోకిలధ్వని వినెడు చెవికి
ప్రణయ కాకారమ్ము లేపాటి తనువు
అమృతభాండమ్ము లభియించినంత నెవఁడు
కల్లుకుండిక నాశింపఁ గలఁడు చెపుమ ?

భక్తకబీరుఁ డిట్టులె స్వభావ విరుద్ధముగాని తీరులన్
శక్తికొలంది పంపు మది సంస్కరణం బొనరింప గేయముల్
రక్తి రచించి ముక్తికి సరాసరి బాటలు దిద్దె నీ క్రియల్
ప్రాక్తన పుణ్యకర్మ పరిపాకమునన్ లభియించుఁ బుణ్యుడా ?

పండితులు వానిఁ బిలిపించి పరిహసింపఁ
దలఁచి వేదాంత చర్చకుఁ దలపడు మన
అవ్యయుని గన్న మాకు విన్నట్టి మీకు
ఏటిచర్చల టని "టలాయించె" నంట. 79

రామ రహీము లిర్వురు పరాత్పరు లంచు సమన్వయించుచో
నామవిభేద భావములు నాశనమౌనని దీక్షఁబూని ని
ష్కామకళన్ రమారమణ గానసుధన్ జవిచూపె నాతఁడో
స్వామి! జనానురాగయుత సత్యపథంబున నీకు నుద్దియై. 80

పరికృతి మధుకలశంబుగఁ బరిగణించి
తదభిసాస్వాదనానంద తత్త్వకలిత
మానసుండయి యద్వైత మార్గమరసె
ఉమరుఖయ్యా మతండొక యమరజీవి. 81

మనము మంచిసేయ మనకు మంచియొనర్చుఁ
జెడు గొనర్పఁ దుదకు జెట్టసేయుఁ
గాన దైవమందుగల గొప్పతనమేది
అనుచుఁ బృచ్ఛసేయు నతఁడు మనల. 82

జంతుబలి తీవ్రముగ సాఁగు సమయమందు
అద్ది సరిదిద్ది సిద్ధార్థుఁ డవతరించె
హెచ్చు లొచ్చుల వైషమ్య మెచ్చినంత
నీవు జన్మించి నాఁడవు నిజము చెప్ప. 83

చెన్నా! అన్నులమిన్న కన్నుగవమూసెన్—జిన్నిబిడ్డండునున్
మున్నే నిద్దురవోఁగియుండె - నిదియేమో? దాటిపోవీలు—నీ
కన్నన్ సాయ మెవండొనర్చు నిపుడీ గాఢాంధకారమ్మునం
దన్నా! వాహముఁదెమ్ము పోవలయు- మోక్షానందముం
బొందఁగన్ 84

ఈ లోకంబున నింతకాలమిటు జీవింపన్ యథార్థం బెదో
జాలంబేదొ యెఱుంగఁజాల మనసే సందిగ్ధ వారాన్నిధిన్
గూలందేలెడి మార్గమేది ? యిక సంకోచింపకే మౌని పా
దాలన్ వ్రాలెద కానకేగి పరమాత్మన్నైన దర్శింపఁగన్. ౮౫

అంచు శుద్ధాంతమట వీడి యరిగి యరిగి
తత్త్వవార్ధిఁ బదింబది దఱచి తఱచి
అనుభవామృత బోధ నోలార్చినట్టి
బుద్ధభగవాను నీతోడఁ బోల్చుకొందు. ౮౬

ఎవని జీవిత యాత్రలో నెచటనేని
కంచు కాగడాల్పూని గాలించి యొక్క
మచ్చఁ గనలేమొ ? అట్టి సన్మార్గుఁడైన
బుద్ధభగవామనకు సదా మ్రొక్కువాఁడ. ౮౭

ఎట్టి ధర్మము నతఁడు స్థాపింపకున్న
శౌరికిది తొమ్మిదవ యవతార మనుచు
వాకొనఁగఁ జెల్లు నానాఁటి పత్రికలకును
దిగ్దిగంతర పూజలఁ దేర్చువారె ? ౮౮

రవికిరణాలలో రంగు లెవ్వఁడు దిద్దు
  పూలలో మధువింత పోయు నెవఁడు
అంభోధి సుతు నెవ్వఁ డమృతహస్తుని జేయు
  గర్భస్థ శిశువులఁ గాఁచు నెవఁడు
అవని నాకర్షణ యంత్ర మెవ్వఁడు నిల్పె
  నాకసమ్మునఁ జుక్కలదుకు నెవఁడు
ఎద గడియారంబు లెవ్వ డాడించును ?
  నీటిలో విద్యుత్తు నిలుపు నెవఁడు ?

దృష్టిలోఁ బ్రేమరసముఁ జొప్పించు నెవఁడు
సృష్టిపై విధ్యమును విప్పిచెప్పు నెవ్వఁ
డట్టి పరమాత్ము రూపు నీ వనవరతము
కనులఁ గట్టి వచింతువు కవివతంస ! 89

కమ్మని కవితారస మెగఁ
జిమ్మెడి నీ వాక్కులెన్న జీవకళలతోఁ
గ్రొమ్మెఱుఁగు లీని హృద్దివ
మిమ్ముగ వెలుఁగొందఁ జేయుటెవ రెఱుఁగరయా ! 90

నిన్ను కవీంద్రుగాఁ బరిగణింపరు ధూర్తులు దానికింతయున్
జిన్నతనంబు రాదు రససిద్ధుఁడ వీ వపురూప భావనా
భ్యున్నత నీ ప్రపంచమున కోరుపులేదు మహాకవీ ! నినున్
మన్నన సేయు వారు పదిమంది జగంబున నున్నఁ జాలదే ! 91

కోరినయంత కాంచనము కొల్లలుగా లభియించునింట నే
కారణజన్ముఁడెవ్వఁడును గక్కినకూటికి నాససేయునా ?
నీ రసవాదముందెలియ నేరక కేవల బాహ్యదృష్టితో
నీరసవాదమున్ సలుప నీకుఁ గళంకమురాదు వాక్పతీ ! 92

ఎన్నఁటికైన లోకము గ్రహింపదె సత్యము, నాఁడు నీ గుణా
భ్యున్నతి దిగ్దిగంత విజయోత్సవజాత యశోవిశాలమై
మన్నన లందుకోఁ గల దమానుషశక్తియుతుండవైన నీ
కున్నది పాదపూజ జగమొక్కటఁ గాడఁక ముజ్జగంబులన్. 93

ఎఱుఁగక మాటలాడిన సహింతురు పెద్దలు శాంతచిత్తులై
యెఱిఁగి వచించినన్ విని సహింపరు చిన్నలు క్రోధదృష్టులై
యెఱిఁగి యెఱుంగనట్లు నటియింతురు కొందఱు హీనబుద్ధులై
వెలువక సత్యవాక్కు వినిపింత్రు మహాత్ములు ధర్మబద్ధులై. 94

గాలిని మూటగట్టి యొక కావ్యజగత్తు సృజించి యిన్ను ధీ
శాలురు సత్కవీంద్రులు ప్రసాదములేక కృశించుచుండ మా
ర్మాలలఁ బాఁతిపెట్టుదురు ముల్లెను లోభులదేమి లాభమో
కాలము గాలమా కవికిఁ గారణజన్ముల కర్మలేశమా ? 95

వేదాతీతుఁడు వేమనన్న పలుకే విశ్వంబునన్ వ్యాప్తమై
మోదంబున్ సమకూర్చుసూక్తి కుసుమామోదమ్ము నిష్ఖేదమై
వేదస్తుత్యమగున్ ద్వదీయ మహిమావేశమ్ముతోఁ ద్వత్కథా
నాదబ్రహ్మసుఖానురాగమున నానందింతురు దివ్యాంగనల్. 96

భావనాశక్తి పరిణతి పడయకున్న
నెంత వ్రాసిన నతుకుల బొంతె యగును
ఆ రచన ముద్దు గొల్పదం దతుకు లగుచు
బసని రేకుల నిర్గంధ కుసుమమట్లు. 97

"సర్వంబ్రాహ్మ్యమిదం జగ" త్తనెడువాచారూఢిసత్యంబు 'మీ
గర్వాలాపము లేల ? మానుఁడని వక్కాణించి తీ వందుచే
నిర్వాణామృత మాన నొల్లక నినున్ నిందింతురేమందుమా. 98
సర్వేశుండు భవత్కవిత్వమును విశ్వస్థాయి గావింపఁడే ?

"ఎవ్వ రేమనుకొన్న నాకేమి కొదవ ?"
అన్న శ్రీనాథకవి నుడు లపహసించి
అట్టి వానికె నామాలు పెట్టి రనఁగ
నితరులం గూర్చి పలుకుట కేమి వింత. 99

సదయా ! శాశ్వత విశ్వభారతికి నీ సందేశ సూర్యప్రభన్
హృదయాంభోజము విచ్చెఁ దన్మధురసశ్రీలోలురా సాధులీఁ
దుదురీలౌకిక తత్త్వవారినిధి నిర్ధూతాఘరాగాంధులై
మదినైర్మల్యము నొంద సంతసము బ్రహ్మానందముం
బొందఁగన్. 100

దురహంకార పిశాచ తాండవధృతిన్ దూలించి మేలెంచి ఓ
కరుణా సాగర ! విప్లవాత్మక కవీ ! కైవల్యముం జూపుచున్
స్థిరబోధైక రసామృతమ్ముసఁగుచున్ దేశాటనం బీవొన
ర్చు రహిం గాంచఁగ నాదిశంకరుల తీరున్ జ్ఞప్తికిందెచ్చెడిన్ 101

మతమొక మత్తుమందువలె మారణయంత్రముపోలె మానినా
గతిచెడి దేశమెల్ల నరకంబునఁ గూలినభంగిఁ దోఁచు నా
మత మమృతంబునాఁదనర మానవలోకమె దేవలోకమై
కుతుకము గూర్చుఁ గాన మతగోష్ఠి విమర్శన సేయుదె కవీ! 102

ఎందఱో యుందరు నినువలె
సందేహము దక్క నిజము చాటెడు వారల్
నిందన మానందన, మఖి
వందనములు స్వీకరించువాడవు యోగీ ! 103

తాటియాఁకు గంటమ్ము చేఁదాల్పలేదు
మనసులో నూహ లెసఁగిన మాత్రముననె
ఉపమ లలరారి సహజలోకోక్తు లెసఁగఁ
బలుకుచుందువు మృదువైన పద్య ఫణితి. 104

అరటి పండు నొలిచి యఱచేతఁ బెట్టిన
రీతి నెసఁగు నీదు గీతు లెల్ల
ననుభవింప లేని యధమున కెవ్విధి
నచల సౌఖ్య మబ్బునయ్య వేమ ! 105

శివకరమగు సత్యంబున
భవబంధవినాశహేతు భావయుతముగాఁ
గవనము సెప్పఁగలాఁడే
కవియనఁగాఁబరగు నన్యకవియుం గవియే ? 106

రాజాధి రాజులు రాలిపోయిరి గాని
  కవుల కీర్తికిఁ జావుగలిగె నయ్య !
దివ్య సౌధము లెల్ల దిబ్బలైనవి గాని
  గ్రంథశక్తికి లోటు గదిరెనయ్య !
మతము లెన్నెన్నియో మాయమైనవి గాని
  పాప పుణ్య విమర్శ వాసెనయ్య
వేషభాషాదులు భేదిల్లినవి గాని
  జాతీయ భావముల్ సడలె నయ్య ?

సకలలోక పదార్థ విజ్ఞాన శాస్త్ర
మెన్నియో మార్పులన్ బొందుచున్నదైన
సృష్టి కాధారభూతుఁడై చెలఁగు నట్టి
పరమ శివులీల మనకంటఁ బడునటయ్య. 107

ఆకాశమున నైన నవకాశము ఘటించి
  కనకంపు మేడలు గట్టువాఁడు
భూలోక మెల్లెడ గాలించి నిజ మెంచి
  మించి వాగ్భేరి మ్రోయించు వాఁడు
వసుధ వ్రయ్య లొనర్చి పాతాళమునఁజొచ్చి
  ఫణిపతి మణులు చేపట్టు వాఁడు
ఈరేడు జగముల కేకాంతముగ నూఁగ
  వేడ్కమై నూయేల వేయువాఁడు

బ్రహ్మ విష్ణు మహేశ్వర ప్రాభవములఁ
జలన చిత్రాలవలెఁ జూపఁజాలు వాఁడు
చెలఁగి సృష్టికిఁ బ్రతిసృష్టి సేయు వాఁడు
జ్ఞానికి సహోదరుఁడు మహాకవివరుండు. 108

జ్ఞాని యను వాఁడు మూఁడు లోకముల యందు
దుర్లభుం డని పెద్దలందురు కవీంద్ర !
పరమ హంసవు నీ సూక్తి పథ మెఱింగ
వసుధ లేదండ్రు వేమన వంటి యోగి. 109

బ్రహ్మమును బోలు గురుఁడును భక్తుఁడైన
సిద్ధయను బోలు శిష్యుండు సిద్ధుఁడైన
వేమనను బోలు యోగి యే పృథ్వియందుఁ
బుట్టుచుండురొ యదె పుణ్యభూమి సుండి. 110

ఓ కవీ ! నీదు పద్దియ మొక్కమాఱు
మనసు దీఱఁగఁ జక్కఁగా వినిన నరుఁడు
మరల జన్మములో దాని మఱచి పోక
సమయు మబ్బినఁ జదువును సామెతగను. 111

గుండు దెబ్బయైన గుఱి దప్పిపోవును
నాటు నీదునోటి మాట సరిగ
నోరుగలుగు తెలుఁగు వారెల్లరును నీదు
పద్దియములు నేర్వ వచ్చు సరగ. 112

తిట్టినను హాస్య మొకకం
దిట్టుటచే నంతయైనఁ దీండ్రింపక యా
తిట్టించుకొన్నవాఁడే
గట్టిగ నవ్వెఁడు నదేమి కారణ మబ్బా ! 113

అన్ని రసములుండి హాస్యంబులేకున్న
నదియు గొప్ప లోటె యనఁగ వచ్చు
ఉప్పులేనికూర చప్పగా నుండదా ?
విశ్వవినుతచర్య ! వేమనార్య ! 114

ఉన్నదున్నట్లు వ్రాయఁగా నొప్పననుచుఁ
గంకణము గట్టుకొంటివి కవివతంస !
అబ్బ ! నీ దెబ్బ కుబ్బితబ్బిబ్బులైరి
వారు వీరననేల- ఏవారలైన. 115

సంస్కృతచ్ఛాయలే మాకు శరణమనుచుఁ
గైతలల్లిరి తొల్లింటి కవులు - గాని
భావదాస్యము నీ పొలఁ బడని కతనఁ
దెలుఁగు వెన్నెల బయళులఁ దిరిగితీవు. 116

కారణ విమర్శనాశక్తిఁ గాంక్షసేసి
హృదయముఁ దావు దాని కర్పించి తీవు
కనుక నీకైత నెఱకులు గాడితీరుఁ
గత్తితోఁ గొట్టినట్టుల గానిపించు. 117

తాళిక, కళవళము, తారాడు బిత్తలి,
చాడి, సొడ్డు, దుడ్డు, సఁబళమ్ము
బైసి, మంకు, రిమ్మ, దవిసి యవ్వదములు
కన్నడంపుఁ జెలిమి నున్న వన్న ! 118

"వాఁల కందని పద్యముల్ వేలసంఖ్య"
యనుచు నీ చెప్పినట్టి వాక్యమును వినఁగ
నా రచించిన పద్యమ్ము లన్ని మాకు
సరిగ లభియించె నని చెప్పఁ జాలనయ్య. 119

కన్నడంబున నినుబోలు కవి యొకండు
కలఁడు సర్వజ్ఞుఁ డనఁగను - దమిళమునందు
వఱలెఁ బూర్వము "తిరువళ్లువరు" - తెలుంగు
నందు నుపమింపఁ దగు వార లరుదు సుమ్ము. 120

విశదముగ నర్థము వచింప వీలుకాని
" కూటములు " గొన్ని తావుల గోచరించె
నందు సాంకేతికములకు నందనట్టి
భావములు గూడఁ గొన్నిటఁ బరగెనయ్య! 121

కక్షలఁ గొందఱు తమతమ
పక్షంబుగ వ్రాసికొనిన పద్యములిందున్
బ్రక్షిప్తములుగ నమరుట
ఆక్షేపింపంగఁ జాలరయ్యా! నిన్నున్ 122

రసపిపాస కతన రాణించు హృదయంబు
స్వల్పదోష 'మాట్టె' సరకుగొనదు
ముండ్లచేలందు మొగలిపూవుండిన
విడువవలయు ననెడి వెఱ్ఱిగలఁడె? 123

నీదు కవితాస్రవంతిలో నిఖిలభావ
జీవరత్నాల వెలుఁగులు చిందులాడ
వెలుఁగు గనలేని చీఁకటి పులుఁగులెల్ల
దొలఁగిపోయిన నీకేమి దొసఁగు పొసఁగు. 124

అలఁతి యలఁతి పల్కులందెంతొ భావమ్ము
దిద్ది తీర్చు తెల్వితేటలందుఁ
దిక్కయజ్వకీవు దీటైన కవివయా!
విశ్వవినుతచర్య! వేమనార్య! 125

కొందఱు కొండవీడనుచుఁ గొందఱు శ్రీగనమంచు గొంత సం
బంధము నెంచుచున్ గడపమండలమౌనని కొందఱాడఁగా
సందియ మెక్కుడయ్యెఁ "దమ" జన్మ వసుంధర నిర్ణయింప నా
డెందము సమ్మతింపదు గడించిన గాథలఁ దృప్తిదీఱమిన్. 126

మఱచితిఁ గొండవీడనిన మాత్రన జ్ఞప్తికివచ్చెఁ జిప్పకల్
చెరగిన రెడ్డిరాజుల ప్రసిద్ధపరాక్రమ వైభవంబు వా
రఱమరదక్క చేసిన మహాకవిపూజలు, వారికైతలన్
వఱలిన యాంధ్రవాఙ్మయ సువాసన లుప్పతిలెన్ గకుప్పలన్. 127

వీరభద్రారెడ్డి కోరి కాశీఖండ
మంకితమంది ప్రఖ్యాతివడసె
కోమటిపోలయ వేమన, కాస్థాన
కవియౌట నెఱిన గణుతికెక్కె
ఆంధ్రవాఙ్మైపుణ్య మరసి మల్లారెడ్డి
షట్చక్రవర్తుల చరితవ్రాసె
కోమటి వేమన్న వామన శ్రీనాథ
కవులకుఁ గొల్విచ్చి గౌరవించె
"అమరుకము" నకు వ్యాఖ్యాన మతఁడెఁ వ్రాసెఁ
గొమరగిరి వేమ నరచించె నమృతమొలుకఁ
బనివడి 'వసంతరాజీయ' మనెడి నాట్య
శాస్త్ర మది తెల్గుతల్లి కాస్థానభూమి. 128

ఎత్తెఱఁ గెవ్వఁడే కపటకృత్య మొనర్చెనొ కొండవీటిలో
నిత్తఱి రెడ్డివీరులు నశించిన దుర్గముచూడ నక్కటా?
కుత్తుకనిండ రక్తమొగిఁ గ్రోలి యజీర్ణముచేతఁ జచ్చి యా
కత్తులబావిదయ్యమదె కన్పడుచున్నది రాక్షసాకృతిన్. 129

మొదట నభిరామయాభిధు మూలముననె
ఇమ్మహా బ్రహ్మవిద్య లభించె నంద్రు
ఆ కృతజ్ఞత చూపుట కతనిపేరు
పద్యమకుటంబుగాఁ జేర్పఁబడె నఁటయ్య! 130

రాణి ముక్కునందు రాజిల్లు ముక్కఱ
జంకకేల నీదు సాని గోరెఁ
గోరెఁ బో యదేటి కోరిక యనకుండ
నామె చెంత కెట్టు లరిగి తయ్య 131

అడిగినవేళ యెట్టిదొ మహాసతి యాయమ దాని సెంతగా
నెదదఁ దలంచెనో "యటులె యిత్తును నావచియించురీతిగా
నుడుగక సల్పు" మంచుఁ జెవినూఁదిన గొప్పరహస్యమే మొయా
తొడవును వేశ్యకిచ్చు తఱిఁ దోఁచిన నూత్న విరాగ మెట్టిదో. 132

మలమూత్రాస్థివసాసృమాంసమద చర్మస్నాయు నిర్మాణ మి
లలనాదేహము మోహసంజనకమా లాలిత్యమా నిత్యమా?
కలి మాయంబడి కొట్టుకొంటి ననుచున్ జ్ఞానార్థివై వేశ్యతో
కలికీ! నీకును నాకుఁదీఱె ఋణమింకన్ వీడు'' మంచాడుచున్133

దీనత్వమ్మొక రూపుఁవొందినటు లందే నిల్చి సాలోచనా
ధ్యానమొక్క క్షణమ్ము సల్పి నపుడంతర్వాణి యేమన్నదో
కానీ, కన్నుల నీరు నింపుకొని యౌగాముల్ వితర్కింపకే
రాణిన్ మానసదృష్టిఁ గాంచి పరమార్థశ్రీ విలాసార్థివై. 134

వడివడి నేగి యా వదినె పాదములం బడి మోక్షదాయినీ!
విడువను నీపదమ్ము లిఁక వేఁడెద నేఁ దరియించు మార్గమున్
నొడువు ఫలించునోములవి నోచినవన్నియు నన్ను నల్లనం
దడవుచు ముంగురుల్ సతిసుధామధురంబుగఁ బల్కె నీక్రియన్135

ఏది నేఁ దరియించు మార్గమని నీవిట్లిప్డు ప్రశ్నింపగా
మోదంబయ్యెను నాకుఁజెప్పునది యామోదంబుగా విన్నచో
ఖేదంబుండదు నీకు-రాగలఁడు యోగిశ్రేష్ఠుఁ డాచార్యుఁడా
సాధూత్తంసముఁగొల్చి దివ్యపథమున్ సాధింపుమో వేమనా !136

ఏనిమిత్తమాత్రి వనుచు నీవెంతువేని
గాల మన్నింటి సరిదిద్దఁ జాలునయ్య
అంచు నిమ్నోద్ధరించి దీవించినట్టి
భరతనారీవతంసమా వరసమాంబ. 137

ఔరః దుర్గంధభూయిష్ఠ మైన చర్మ
భస్త్రికొఱకెంత వ్యామోహ పడితి ననుచుఁ
గంపలోఁ బడ్డ కాకిపై క్రాలు వేళ
దారి దొరకెను శివయోగి దాపుఁ జేర. 138

శివయోగికి శిష్యుఁడవై
భవసాగరమీఁది సిద్ధివడసిన నీ యా
శివయోగామృత సంభృత
కవితాగానం బొసంగుఁ గైవల్యమ్మున్. 139

నివురుఁ గప్పిన నిప్పునా నెగడునట్టి
మానసిక శక్తులన్నిఁటి మసి దొలంగ
దివ్య విజ్ఞాన దీపిక తేజరిలుట
సకల ధర్మంబులకు నిది చరమసిద్ధి 140

గురురూపంబున వచ్చి యీశ్వరుఁడె నీకున్ బోధగావించెనా?
పరమార్థంబది గాకయున్న నెటులిబ్బంగిన్ మనోసిద్ధియున్
సురసామ్రాజ్యము నేలుచుంటివి కవీ! శోభాయమానంబుగా
వెలుఁగా నీమహిమంబు నెన్నఁదరమే వేనోళ్ళ శేషాహికిన్ 141

తీయని కోర్కులం దనివి తీరక యూరక పట్టి లొట్టలన్
వేయుచుఁ గాలముం గడపి వృద్ధుఁడవై సుకృతం బదేమియున్
జేయఁగఁ జాలనైతినని చింతిలినన్ ఫలమేమి? నీవలెం
జేయు మహామహుండు రససిద్ధుఁడు సిద్ధపథానువర్తియై. 142

గురుతర రాజ్యభారమునఁ గ్రుంగి కృశించి నశించిపోవు భూ
వరులకు దక్కనే ప్రణవ భావమణీ రమణీయ సౌధ భా
సుర రమణీమణి ప్రణయ సూత్రము? నూటికిఁ గోటికెవ్వఁడో
పురుషవరేణ్యుడై పుడమిఁ బుట్టుఁ దరించి తరింపఁ జేయుఁగా. 143

రాజులు రాజ్యభోగముల రాజిలుచో యువరాజు లెంతయో
తేజము మీఱ సౌఖ్యములఁ దేలుచు బాహ్యవిమోహవాహినిన్
రాజిలుచుంద్రు గాని యిటు రమ్యపదార్థములందుఁ బూర్తిగా
మోజుఁదొలంగ ద్రోసికొని ముక్తి వరించెడి వారలుందు రే? 144

ఎవ్వడు శాశ్వతంబిచట నెవ్వని కేది స్థిరంబు. దేనిలో
నెవ్వఁడు మేలుపొందు నెది యెవ్వడు చెప్పగలాఁడు తాపసీ!
దివ్వె వెలుంగుచుండఁగనె దేహగృహంబున నాత్మరూప మిం
కెవ్విధి నున్నదో తెలియుటే నరజన్మకు మోక్షసిద్ధిరా! 145

లోకుల కృత్యముల్ మనసులోఁ దలపోసి యథార్థమెట్టులే
వాకొనఁ జెల్లదాయని యపారితలీల నమాయికత్వమన్
జీఁకటి బాపి జ్ఞానకళ సృష్టియొనర్చిన ధాతవే నమో
వాకములయ్య నీకు జనవందిత! వేమనయోగిపుంగవా!! 146

కొండలు పిండిసేతుమను కోవిదు లెల్లరు నీదు ముందటన్
బెండులువోలెఁ గన్పడిరి బేలల మోసముచేయు మాటలన్
ఖండనసేయు వేళల నెగాదిగఁ జూచిరి సత్యధర్మ వా
క్పాండితి కబ్బి భక్తిమెయి బాగుగ మ్రొక్కిరి నాఁడు నాఁటికిన్ 147

ఇచ్చకమాడఁగోరి స్తుతియించుట నామది కింతయేనియున్
నచ్చదు నచ్చెనా గుణగణంబుల మెచ్చక మానమాన్యులన్
ముచ్చటగా నుతించి కడుమోదము వొందని వాక్కువాక్కె నీ
యచ్చపు బ్రహ్మతత్త్వమున కంజలి పట్టెదనయ్య వేమనా! 148

విద్యాహీన నికృష్టలోకమిపుడీ వేదాంత విజ్ఞాన నై
వేద్యంబుం జవి చూడలేక వెలియై విశ్వాసమున్ వీడి సం
పాద్యమ్మొక్క ధనమ్మెయంచుఁ దలఁపంబ్రాపించునేయాస్థితుల్.
సద్యస్సౌఖ్యల సుఖాభిలాషఁ కుపజ్ఞాభాగ్యమెట్లబ్బురా? 149

గూఢమైన విద్య గురుముఖమ్మున నేర్చి
స్వానుభవము కొఱకు శ్రమ మొనర్చి
నిన్ను నీవ తెలిసికొన్న ధన్యుఁడవన్న
విశ్వవినుతచర్య! వేమనార్య! 150

కోర్కెతీవలన్ని కూకటివ్రేళ్ళతోఁ
బెల్లగింపబడిన యుల్లమగుట
నలలుపుట్టనట్టి జలనిధివలె నుండు
నీ మనంబు నిభృత నిశ్చలముగ. 151

భోజరాజేంద్రుని ముఖతేజమును గనుగొన
సంస్కృత కవిత్వమును జెప్పఁజాలిరంట
అట్టులే మిమ్ము వర్ణించినంత నాకుఁ
దెనుఁగు లోకోక్తులం బల్క మనసు గలిగె. 152



## స్తోత్రం

అవధూతా ! భవదీయ వర్ణన విశేషాహ్లాద ముగ్ధుండనై
శ్రవణానందముగా రచింతుఁ దమపేరం గొన్ని పద్యంబు లీ
భవమందింతకుమించి చేయఁగల సేవాధర్మ మెుండేది? నా
కవనమ్మీ కృతిరూపమై సుకవితా కళ్యాణముల్ గూర్చుతన్. 153

చీకు చింత లేని చిన్మయ సూత్రముల్
ప్రజలకెల్ల బోధ పఱుపఁ దలఁచి
వేమనంగ యోగి వెలసె నాంధ్రావనిఁ
బూజలిడుఁడు పుణ్యపురుషులార ! 154

ఆట వెలఁదియయ్యు నర్థమెంతేఁగల్గి
నీ మహత్తువలన నిజము పలికి
మోహబుద్ధివీడి మోక్షంబుఁ జూపెరా
విశ్వవినుతచర్య ! వేమనార్య ! 155

అచలవిద్య తప్ప నన్యవిద్య లవెల్ల
పొట్టకూటికొఱకుఁ బుట్టెననుచు
నొట్టుపెట్టినట్టు లుగ్గడించితివయా
విశ్వవినుతచర్య ! వేమనార్య ! 156

ఆత్మతేజమెఱిఁగి యచలుఁడవౌ నిన్ను
లోకజాలమెట్లు లొంగదీయు
సూర్యుఁడున్న చోటఁ జొచ్చునా చీఁకటి ?
విశ్వవినుతచర్య ! వేమనార్య ! 157

ఎఱుక లోక మెఱుఁగు నెఱుఁగదు తన్నుఁదా
జీవి తెలియలేడు జీవకళను
దనసుఖంబు తనకుఁ గనఁబడు చుండునా?
విశ్వవినుతచర్య! వేమనార్య! 158

దిగినకాదె లోఁతు తెలియును నీటిలోఁ
దినినయంతగాదె తెలియు రుచులు
ననుభవించు నతఁడె యచలతత్త్వ మెఱుంగు
విశ్వవినుతచర్య! వేమనార్య! 159

అబ్ధివంటిది పరమాత్మయందుఁ బుట్టు
నలలవంటివి జీవాత్మ లరసిచూడు
కానసంతట నిండినవాని నీశు
లేఁ దనుటకంటె మౌర్ఖ్యము లేదు జగతి. 160

సృష్టింపబడిన జీవుఁడు
పరిష్ఠను జేరుకొను యోగసాధనపరుఁడై
దృష్టిని భ్రూమధ్యంబుని
స్పష్టముగా నిలువవలయు శమదమరతుఁడై. 161

తనదు దేహంబులోపలఁ దఱచిచూడ
నాత్మరూపుఁడుగా దేవుఁడవఃరియుండ
బయట నెందెందొ కలఁడని పఱుగులిడుట
వెన్నయుండఁగ నేతికి వెదకినట్లు. 162

ఐహికానందమే పరమావధియని
యాత్మజిజ్ఞాసచే బ్రహ్మమందలేక
కనఁబడని దేవుఁడెచ్చటఁ గలఁడటంచుఁ
బలుకు దుర్మార్గులెందరో ప్రబలినారు. 163

దేవుడుండఁ డొక్క దేవాలయమునందె
దేవుడుండు సకల జీవులందు
దేవుఁడున్న తనువు దేవాలయము కాదె?
విశ్వవినుతచర్య! వేమనార్య! 164

మతముపేరతోడి మనుజులఁ గ్రిందికిఁ
ద్రొక్కఁదలఁచుచుండు ద్రోహులెల్ల
దివ్యపథముఁజూపు దేవతలౌదురా?
విశ్వవినుతచర్య! వేమనార్య! 165

మతము బోధించురీతి జీవితము నడుపు
మానవుండొక్కఁడైనను గానరాఁడు
మతవిరోధ పిశాచముల్ మాఱుమసల
ఘోరకృత్యాలు కొంపలఁ గూల్చుచుండు. 166

ఫాలభాగమందు బాగుగా వెలుగొందు
ఈశు శ్రీశు స్వప్రకాశుఁజూచి
సృష్టిమర్మమెఱుఁగు దర్శియే వేదాంతి
విశ్వవినుతచర్య! వేమనార్య! 167

ఆసనముల వలన నారోగ్యమును బొంది
యోగమెఱిఁగి దివ్యభోగ మెఱిఁగి
హాయిచెందువాఁడె యఖిలతత్త్వజ్ఞుండు ॥విశ్వ॥ 168

అనుభవమున జ్ఞాన మార్జించి సంసారి
ఓర్పు నేర్పు లెన్నొ యొగ్గడించు
రాజయోగిమాట రతనాలమూటరా ॥విశ్వ॥ 169

ఇతర దేశములకు నీ దేశమునకును
మతము వేఱు దాని మహిమ వేఱు
కర్మభూమియందు మర్మముల్ పెక్కురా ॥విశ్వ॥ 170

పొగడుచున్న వానిఁ బోషింపఁజూతురు
తప్పులెన్ను వారి దరికిరారు
ఉన్నమాటయన్న తలకెక్కవౌగదా ॥విశ్వ 171

ఆశయెంతయున్న నంతకష్టముగల్గు
దృప్తియున్న సుకము ప్రాప్తమగును
ఉప్పుదినిన కొలఁది దప్పిక పెరుగదా? ॥విశ్వ॥ 172

పిసినిగొట్టుచెంత పసిఁడి బొచ్చెండున్న
ననుభవింప నేరి కనువుపడదు
ఉదధిజలము త్రావ నుపయోగపడునయా? ॥విశ్వ॥ 173

స్వార్థరహితమైన సత్యప్రబోధక
గ్రంథమొకటిచాలు కవిరచనకు
బెక్కు రాళ్ళకంటె నొక్క రత్నము మేలు ॥విశ్వ॥ 174

ఒక్కవిద్య నొకరుఁ డుత్తీర్ణుఁడయ్యు వే
రొక్కవిద్య నతఁడు మొక్కవోవు
జలముమీఁద బండ్లు సాగి పో నేర్చునా? ॥విశ్వ॥ 175

తచ్చెక్కువాడు రాజుకాఁ దగియుండె
నింటనుండువాఁడు హీనుఁడయ్యెఁ
గాలికాలమందుఁ గర్మముల్ మాఱునా? ॥విశ్వ॥ 176

సంధ్య వార్చెదమని చదువుచు మంత్రముల్
మనసు వాంఛలందు మసలఁ జేసి
ముక్కుపట్టుకొనిన మోక్షంబు కలుగునా? ॥విశ్వ॥ 177

నిలువుబొట్టుఁబెట్టెఁ జెలువుగా శ్రీహరి
యడ్డబొట్టుఁనబ్జజుండు
తండ్రికొడుకులకిటు తగవేల పుట్టెనో ॥విశ్వ॥ 178

చదువులేని భార్య చదువుకొన్న మగండు
కాపురంబు నెట్లు గడుపఁ గలరు?
ఏటికీడ్వదున్న యెద్దెండకీడ్వదా? ॥విశ్వ॥ 179

మగనిమాట కొమరు మాటాడునది యాలె
యాలుకాదు నల్ల తేలుగాని
నరునకంతకంటె నరకంబు లేదురా? ॥విశ్వ॥ 180

పుట్టమీఁదఁ దేలు కుట్టిన నాగన్న
మయమటంచుఁ బల్కు మనుజులెల్ల
మంచి చెడ్డలరసి మాటాడఁజూతురా? ॥విశ్వ॥ 181

కాలఁత లెసఁగు నింటఁ గలిమి యెంతేనున్న
సుఖముమాట నిండుసున్న సుమ్ము
పోరులేని కూడు బొక్కెడు చాలదా? ॥విశ్వ॥ 182

తానె యధికుఁడంచుఁ తలపోసి పేదల
బుద్ధిమాలి త్రోసిపుచ్చరాదు
సింహమునకు మేలు చిట్టెలక సేయదా? ॥విశ్వ॥ 183

ప్రకృతియందుఁ గల్గు ప్రతి జీవికి గుణంబు
జన్మమందె కొంత జననమగును
దుమ్మ చెట్టుముల్లు తొలుతనే పుట్టవా? ॥విశ్వ॥ 184

ఇష్టులైనవారి దుష్టచరిత్రముల్
కప్పిపుచ్చఁ దలచు ఖలుఁడు, కాని
లోకమెల్ల మూయ మూకుఁడు దొఱకునా ॥విశ్వ॥ 185

అర్చిగల నరుండు అక్షభోగములొందు
లేనివాఁడు పొందలేఁడు జగతి
ఈఁకలున్న పక్షి యెగురుదా స్వేచ్ఛగ ॥విశ్వ॥ 186

జగతి నెవ్వడైన జ్ఞానబలంబుచేఁ
బహుబలము జయింపఁ బడును సుమ్ము
కత్తిపోటుకంటెఁ గలము పోటెక్కుడు ॥విశ్వ॥ 187

సంఘముద్ధరింప సజ్జనుల్ కృషిసల్పఁ
దులువతోఁకఁ గొందఱు నిలువఁబోవు
పన్నికల్లు దాఁచ జరుగదా పెండిలి? ॥విశ్వ॥ 188

తనువు నిచ్చెఁ దనదు చనుబాలఁ బోషించె
గుణము తెలుగఁజేసె గురుని జూపెఁ
తల్లి కంటె పూజ్యదైవ మింకెవ్వది ॥విశ్వ॥ 189

అధిపు నండఁజేరి యల్పుఁడైనను జాల
గొప్పవాని తెఱఁగు గోచరించుఁ
దామరాకు నీరు తళతళ మెఱయవా? ॥విశ్వ॥ 190

ఎన్ని మహిమ లున్న నెట్లు పోషించినఁ
దనువు తిరము గాదు ధరణిపైని
నీటి మీఁది బుడగ నిలుచునా చిదుగక ॥విశ్వ॥ 191

పేదవారిగోడు ప్రేమతో నాలించి
యిచ్చునట్టి దాన మెట్టిదెని
వాడియున్న చేని పైఁబడు వానరా ॥విశ్వ॥ 192

అల్పఋణము చేసి యధికుఁడు సిగ్గొందు
హీనుఁ డెంత యప్పునైన సేయు
నిండ మునిఁగినంత నుండునా చలిబాధ ॥విశ్వ॥ 193

కఠినుఁడైన నెదుటఁ గల మాట పల్కఁడు
వాఁడు హాని సేయఁబోఁడు ప్రజకు
నఱచునట్టి కుక్క కఱచునా యెపుడైన ॥విశ్వ॥ 194

స్వార్థపరుఁడు తనదు సౌఖ్య మన్వేషించుఁ
బరుల కష్టమునకు బాధపడఁడు
ఎద్దుపుండుఁ గనిన నీఁగకు జాలియా? ॥విశ్వ॥ 195

మగనిరోసి ఱంకుమగని గూడిన దాని
సొత్తుఁ గోరదగునె? చిత్తముచెడ
కుక్కముట్టుకొనిన కూటికాశింతురా ॥విశ్వ॥ 196

క్షేత్ర మెఱిఁగి విత్తు పాత్ర మెఱిఁగి దాన
మనిరి పెద్దవార లది నిజంబు
జలధి వానకురియు ఫలమేమి కలదురా? ॥విశ్వ॥ 197

అల్పుఁ డాముహారసి యధికుల డీకొన్న
తాను హానిపొందుటే నిజంబు
తగరు కొండకెదురు తాఁకిన చందమౌ ॥విశ్వ॥ 198

కాలమెట్టిమార్పుఁ గలిగించు చుండిన
నడ్డుపెట్ట నెవ్వఁడర్హుఁ డగును
ఏటివఱదనావ నేరికిఁ దరమయా? ॥విశ్వ॥ 199

మద్యసేవకంటె మాయజూదముకంటె
దురదకంటె నోటి దురుసుకంటెఁ
జిగురుటమ్మిగూర్చు చిక్కులు పెక్కురా ॥విశ్వ॥ 200

ద్రోహినెంత ప్రేమతో నాదరించిన
వాని సహజగుణము వదలఁడెందుఁ
పాలుపోయఁ బాము పాయునా విసమును? ॥విశ్వ॥ 201

సువతిఁ బెండ్లియాడి ముదుసలి కులికిన
ననుభవింప నెట్లు అర్హుఁడగును?
దంతపటిమ తొలఁగఁ దములమ్ము సేయునా? ॥విశ్వ॥ 202

లోకమాన్యులైన లోకుల గుణములు
బాల్యముననె కొన్ని బయటఁ బడును
మావు పుట్టఁగానె తావులు చిమ్మదా? ॥విశ్వ॥ 203

షండుఁడని యెఱిఁగి చక్కని చుక్కయౌ
కన్యనేల యంటఁగట్టవలయు?
బోసినోటి కుక్కబొమికలు గొఱకునా? ॥విశ్వ॥ 204

సర్వ భేధములను సవరించుకొనలేక
వనిత మెట్టినిల్లు వదలుటన్న
పట్టుఁగొమ్మ విడిచి పెట్టిన విధమురా ॥విశ్వ॥ 20

పల్లెఁబుట్టి మల్లె యిల్లాలి తలనెక్కె
నడవిమల్లె రాలి పుడమిఁ బడియె
జనులకూర్మి దక్కి ఘనుఁడును ఘనుఁడౌనె? ॥విశ్వ॥ 206

అన్నియున్న వేళ నందఱుఁ జుట్టలే
లేనివేళ నొండుఁ గానఁరాడు
ఇంట బెల్లమున్న నీఁగలు ముసరవా? ॥విశ్వ॥ 207

బాలురాఁడదగిన భావముల్ గమనించి
యాడవలయు మించి యాడరాదు
పిన్ననోటికేల పెదపెద్ద పల్కులు ॥విశ్వ॥ 208

దుష్టబుద్ధియైనఁ గష్టముల్ గలవేళ
దీనరక్షకుండు దేవుఁడనుచు
పెన్నదాటువఱకుఁ బెరుమాళ్ళ సేవరా ॥విశ్వ॥ 209

కలిమి లేమియైన చెలువములు పగలైన
మంచివాని గుణము మాఱదెపుడు
గట్టిరంగు గుడ్డ కగ్గునా యుడికిన? ॥విశ్వ॥ 210

ఇంత పదవియున్న నెగిరిపడెడువాఁడు
పెత్తనంబు తొలఁగ తొత్తె యగును
గోఱలూడఁ బెబ్బులి తీరదా యహిభీతి ॥విశ్వ॥ 211

అలరువేళకంటె నాపదలందింక
నుత్తములగుణము మహోజ్జ్వలమగు
కరగినంతఁ బసిడి కసటెల్ల వాయదా? ॥విశ్వ॥ 212

మందమందు సరకు మాణిక్యముగనున్న
నవ్వునిత్తుమన్న నడుగరెవరు
కడుపు నిండినంత గారెలు చేదురా! ॥విశ్వ॥ 213

పనికిరానివారలని తోఁచినను బంధు
వులను వీడి వృద్ధిపొందలేవు
పొట్టుతీసివేయ మొలకెత్తునా గింజ? ॥విశ్వ॥ 214

మేలుకోరువాఁడు మిత్రుఁడు-భర్తతో
గష్టసుఖము లోర్వగలది గృహిణి:
కూడుపెట్టువాఁడు కూరిమి కొడుకురా ॥విశ్వ॥ 215

ఎండవాన లనక పండించి ధాన్యముల్
తిండి కలుఁగజేసె దేశమునకు
రైతుకంటె లోకరక్షకుఁ డెవఁడయా? ॥విశ్వ॥ 216

గర్భశత్రువైనఁ గాలాను గుణియౌచు
నుపకరించు మనకు నొక్కొకయెడఁ
గాకి గూఁటిలోన కోకిల పెరుఁగదా? ॥విశ్వ॥ 217

సమయమెఱిఁగి రాజసము వీడుటే మేలు
బెట్టుగాలివాన కొట్టునపుడు
తుంగ వంగి బ్రదుకఁ, ద్రుంగదా పెన్వేము ॥విశ్వ॥ 218

శీలవంతు నొక్క చెడ్డ మాటాడిన
కలఁత నొందు హృదయ కమలమందు
నెత్తురున్న చోట నొత్తిన నొప్పిరా! ॥విశ్వ॥ 219

పాపభీతి కలిగి వర్తించు మానవుల్
జమునకైన నేల జడియ వలయు
నిప్పు పట్టుకొనక నీచేయి పొక్కునా? ॥విశ్వ॥ 220

అన్న వస్త్రములకు నధిపతు లిద్దఱు
కర్షకుండు వసన కారకుండు
వారి మేలు కోరవలదొకో సుజనులు ॥విశ్వ॥ 221

సజ్జనుండు గొప్ప స్థానముఁ బొందుచోఁ
బలువ తూలనాడ ఫలమదేమి?
ఏనుగునెక్కి కుక్క కెవ్వఁడు భయపడు? ॥విశ్వ॥ 222

నిన్ను నీవ పొగడుకొన్న లాభంబేమి?
పరుల మెప్పు పడయ ఫలము గలదు
స్వకుచ మర్దనమున సంతోష మొదవునా? ॥విశ్వ॥ 223

తిట్టు నట్టి నోరు తిరిగెడి కాలును
నూరకుండఁ గలవె? యొక్కక్షణము?
దాన మిచ్చు చేయి దాఁచిన దాగునా? ॥విశ్వ॥ 224

మోహనాంగి తన్ను ముదముతోఁ దిలకింప
భ్రమ జనించు నెంత వానికైన
గాలి గొట్ట జ్యోతి కదలక నిలుచునా? ॥విశ్వ॥ 225

స్త్రీల తోడి పొత్తు చిత్తంబు చెఱచును
ధాతకైన వాని తాతకైన
నిరుపమంబు గాదె యనుమానమింతయు ॥విశ్వ॥ 226

ఆర్పకంటియమ్మ యధిపతికే హాని
యీడ్పుకాళ్ళ తల్లి యింటికిం జేటు
పోర్పు లేని వార లూరికే చేటురా ॥విశ్వ॥ 227

అతి రహస్యమైన యాత్మీయ విషయము
స్త్రీల చెవిని వేయఁ జిక్కు లౌవవు
పువ్వుఁబోణి నోట నువ్వులు నానునా? ॥విశ్వ॥ 228

అందమైనవాఁడ ననుకొని సాధ్వుల
చెనకెనేని మిగులఁ జేటుగలుగు
ఇంద్రునంతవాఁడె యిగిలిపడఁడా పండ్లు? ॥విశ్వ॥ 229

జవ్వనంబు మనకు శాశ్వత మనఁ గాని
వృథ యొనర్చుకొన్న వ్యథ జనించు
గట్టుపొర్లు వఱద కలకాలముండునా? ॥విశ్వ॥ 230

యౌవనమున ధనము నార్జించి చివరకు
నిలువసేసికొనిన కలదె సుఖము
దాహమైన యపుడ త్రవ్వేదవా బావి? ॥విశ్వ॥ 231

ఇల్లె తనకు గొప్ప యిలువేల్పుగా నెంచు
దేబె విశ్వమెట్లు తెలియఁ గలఁడు
బావిలోని కప్ప పరికించునె జగంబు ॥విశ్వ॥ 232

మంచికొఱకు మనము మనసారఁ బనిసేయఁ
జెట్టువుట్టు కొన్ని పట్టులందు
సమృతమునకుఁ ఓఱవ హాలాహలము గల్గె ॥విశ్వ॥ 233

కపటి కానివాఁడు కపరి పెల్లాడిన
నుల్ల మంతలోనఁ జల్లఁబడును
నిప్పుకంటి వేల్పె నీటిని దాల్చెరా ॥విశ్వ॥ 234

సహజ కవికి గొప్ప సాహిత్య మబ్బిన
అతని కళకు జెప్ప నలవి యగునె?
జాతిరత్నమునకు సానబట్టిన భంగి ॥విశ్వ॥ 235

పుట్టుగ్రుడ్డి లోక మెట్టు చూడఁగలాడు
పంగువెట్లు కొండ ప్రాఁకఁగలఁడు
మూర్ఖమానవులకు ముక్తి లభించునా? ॥విశ్వ॥ 236

ప్రాణమున్న వఱకె ప్రాణి సౌందర్యమ్ము
ప్రాణమూడఁగట్టె పాడువడును
పంజరంపుఁ జిలుక పాఱిపో నేప గున్ ॥విశ్వ॥ 237

చచ్చువాఁ డొకండు చావక భారత
సంగరంబుఁ గూర్చి చచ్చె శకుని
రాచపీన్గు తోడు రానిది బోవునా ॥విశ్వ॥ 238

తప్పులేనివాని దండింపఁ జూచిన
దైవమహిమ నదియ తప్పిపోవు
ఎప్పుడైనఁజెదలు నిప్పున కంటునా? ॥విశ్వ॥ 239

ఎట్టికూ్రరుసైన నెఱిఁగి విమర్శింప
దండిగుణము లేవొ యుండవచ్చు
నత్తలున్న వార్ధి ముత్తెములుండవా? ॥విశ్వ॥ 240

ఆత్మరక్షణమున కనువైన కఠినత
లేకయున్నఁ జెనకు లేకియైనఁ
గఱ్ఱలేనివాని గొఱ్ఱెయుం గఱవదా ॥విశ్వ॥ 241

ధూర్తువినయమునకుఁ దూఁగాడి మేల్సేయు
నెంతొకీడు దలఁచు హితున కతఁడె
బొమ్మదిన్నవాఁడు తొమ్ముగుద్దిన యట్లు ॥విశ్వ॥ 242

తల్లిదండ్రు లింత తప్పుసేసిన తోవ
నడ్డగింపవచ్చు నాత్మజుండె
అగ్ని, దేవుఁడైన నడరిన నార్పమా? ॥విశ్వ॥ 243

పలుప పరిచపింపఁ దలపడియుండ నీ
పూరకున్న దైవమూరకొనదు
కావలసిన పనిని గంధర్వతతి పేసె ॥విశ్వ॥ 244

శైశవంబునుండి పరిగ శిక్షింపక
వెనుకఁ జూతుమనుట వెఱ్ఱితనము
గోటఁబోవుపనికి గొడ్డలివలయునా? ॥విశ్వ॥ 245

ఒకరి మేలుచూడక నొల్లక యితరుల
చెఱుపఁదలతుఁజేని చెడెదవీవు
జింకఁజంపఁ గుట్రజేసి నక్కయొచచ్చె ॥విశ్వ॥ 246

ఘోషయాత్రకేగెఁ గురురాజు ఠీవిగాఁ
బరిభవింపనెంచి పాండవులను
దానొకండు దలఁప దైవమొకండు దలంచె ॥విశ్వ॥ 247

తనదుశక్తి మించి పనిసేయఁ దలపడ
నృపునకైనఁ గల్గు నపజయంబు
ఉక్కు కత్తియైన ముక్కలు పోవదా? ॥విశ్వ॥ 248

ఐకమత్య మనెడి యాయుధమున కిహ
లోకశక్తులెన్నొ లొంగిపోవు
పోరునష్ట మెపుడు పొందులాభముకదా ॥విశ్వ॥ 24

ధర్మమాడు వలఁతి నిర్మలజ్ఞానియే
పిన్న పెద్దతనము లెన్ననేల?
కర్ణుకంటె సభ వికర్ణుని మెచ్చదా? ॥విశ్వ॥ 250

అదనెఱింగి పలుకు నధికారిమాటకు
రెండు పైపులందు నుండు పదను
నృపులతోడి పొత్తు నెత్తురుకూడురా ॥విశ్వ॥ 251

తత్త్వమరసి మనము తగినటు మాటాడ
దుష్టుఁడైన మనకు నిష్టుఁడగును
నాగమైన, నాడు నాగస్వరం బూఁద ॥విశ్వ॥ 252

కార్యసాధనంబ కాంక్షించువార ల
త్యల్పునైన పూజ్యు డనవలయును
గండ కొఱకు నక్క కాకిని బొగడదా! ॥విశ్వ॥ 253

ఎవని నైనఁ జంక నిరికించుకొను తఱి
సూత్రిమెఱిఁగి చేయు సుఖము కలదు
ముక్కుత్రాడు లాగ మోమూపదా యెద్దు? ॥విశ్వ॥ 254

ఎఱుఁగనట్టు లెదుట నిచ్చక మాడుచు
సమయమబ్బ హాని సల్పునొకఁడు
కన్ను తగులు పుల్లఁ గని పెట్టి తిరుగరా ॥విశ్వ॥ 255

అన్ని యున్న వార లాకులోఁ బిందెత్తై
లణఁగి మణఁగి యుందు రబ్బురముగ
ఫలవిశిష్టశాఖ బహునమ్రతను జూపు ॥విశ్వ॥ 256

ఏది సేయఁగోరి యెవ్వఁడు వెడలినం
గలిమిగల గృహంబె కానఁబడును
కాయలున్న చెట్టు చాయను జూడరా ॥విశ్వ॥ 257

ఉత్తముండు పొందు నుపకారమింతైన
గొప్ప ప్రతిఫలంబె కూర్చు మరల
గంపెడీయు నిలకు గింజెడు నుపకృచ్చ ॥విశ్వ॥ 258

పరముఁ డొక్కకతఱి పరమార్థమున కేగఁ
బ్రతిఫలంబు కీడు ప్రాప్తమగును
స్మరుఁడు పూలు వేయ హరుఁ డగ్నిఁ జిమ్మఁడా? ॥విశ్వ॥ 259

పతిత జనుల కొఱకుఁ బ్రాణ మిచ్చిన యట్టి
ధీరపురుషవరుల దివ్యచరితఁ
బోధి సేసి రోళ్ళు రోకళ్ళు బాడరా? ॥విశ్వ॥ 260

బ్రతికియున్న వేళ వ్యర్థుడుగానున్నఁ
జచ్చినపు డొకింత మెచ్చు జనము
ఉన్న లిక్కి, యదియ యూరేగఁ గొడవలి ॥విశ్వ॥ 261

ఆత్మ తత్త్వవేత్త యజ్ఞాన ననువుగ
నఁకె కీడ్చి ఫలము నందఁ గలఁడు
గంత గట్ట నెద్దు గానుఁగఁ ద్రిప్పదా? ॥విశ్వ॥ 262

తూలనాడియైన మేలుఁ జేయఁ దలంపఁ
దెలివి లేనివాఁడు నిలువలేఁడు
చెదరఁ గొట్ట పశువు బెదరి పోకుండునా? ॥విశ్వ॥ 263

వలయు దానికొఱకుఁ బని సేయకుండి త
త్ఫలముఁ బడయఁ గోరఁ గలుగఁ గలదె?
విత్తకుండఁ గోయ వెడలిన చందమౌ ॥విశ్వ॥ 264

పుట్టు పేదయైన భోజనసౌఖ్యంబు
పాడియున్నఁ గొంత పడయవచ్చు
నఱువదాఱుకూర లావుచంటఁ గలవు ॥విశ్వ॥ 265

ఇష్టమైన పనియ యుత్తమం చడిగినఁ
గష్టమైన పనికిఁ గడగఁ డెవఁడు
ఎద్దునడిగి గంత నెవ్వఁడు కట్టురా? ॥విశ్వ॥ 266

కలుషమతులకెందుఁ గాలంబు గాలమే
నీతిలేనిచోట నిలువఁదగదు
చేతగానిపనులు చేయుట దోతరా ॥విశ్వ॥ 267

ఊర్వినేలఁదగిన యున్న తోద్యోగియే
అంచగొండి యగుట లక్షణంబె?
కంచె చేను మేయఁ గాపేమి చేయురా? ॥విశ్వ॥

ధన మొసంగువాఁడె ధవుఁడని భావించు
గణిక కెవనియందుఁ గలుగు ప్రేమ
పలువురేగు బాటఁ బచ్చిక పుట్టునా? ॥విశ్వ॥

ఎఱుకలేక యెవరొ యెద్దినె నన్నము
గాఁగట్టు మనెడి ఘనులు గలరు
భావదాస్య మెంత పనికిమాలినదయా ॥విశ్వ॥

నీచుచెంత జేరి నీతులు దెల్పిన
నాదరింపకెంతొ యుపహసించు
మోటువాని కిడిన మొగలిపూ చందము ॥విశ్వ॥

చంకబిడ్డలేని చక్కఁ దనంబేల
యనుభవింపలేని యాస్తి యేల
బుధుల మెప్పుఁగనని పురుషజన్మ మదేల? ॥విశ్వ॥

మెఱతోడసాటి మిణుగురుపుర్వైనె
పండితునకు దీటు పామరుండె
యాత్మశక్తి తోడ నన్యశక్తి సమంబె? ॥విశ్వ॥

మాతృభాషలోన మంచి పాండితి లేక
యితరభాష వే గ్రహింపఁ గలవె?
నేలవిడిచి సాము నేలచేయఁగవలె? ॥విశ్వ॥ 2

ఊరుగాని యూర నోరూరఁ జేసిన
తెలుఁగు పలుకుతీరు తియ్యఁ దనము
తెనుఁగువారికేమొ తేలిక యయ్యెరా! ॥విశ్వ॥ 275

కావ్యశిల్పమునకుఁ గళఁగూర్చునది ధ్వని
దానిబాహ్యతనువు తగిన శైలి
రెండు పక్వమైన నుండదా పెన్నిగి ॥విశ్వ॥ 276

మామపెత్తనంబు మర్యాదచిహ్నము
మగనిపెత్తనంబు మగువసుకము
అత్తపెత్తనంబు కత్తులబోనురా ॥విశ్వ॥ 277

ఆత్మలేనివారి కైశ్వర్యములనిచ్చి
మంచివారినోట మన్నుగొట్టు
మాయదారిబ్రహ్మ మతమేమి మతమురా ॥విశ్వ॥ 278

మధ్యవచ్చు గుణము మాన్పవచ్చునుగాని
సహజగుణము మాన్ప జాలరెవరు
కుక్కతోఁక నెవఁడు చక్కజేయఁగనేర్చు ॥విశ్వ॥ 279

ఒకరికొకరు సాయ మొనరించుకొనఁ దగు
నండలేని యూర నుండఁదగదు
తల్లిలేని బిడ్డ ధరణి కెక్కువకదా? ॥విశ్వ॥ 280

ఎన్నొ సుగుణములకు నిక్కయౌ సజ్జను
స్వల్పదోషమొండు సరకుగొనరు
ఱిక్కతేనిమచ్చ లెక్కకు వచ్చునా? ॥విశ్వ॥ 281

గొప్పవారిలోని గొప్పతనంబును
గొంటె యెట్లు తెలిసికొనఁ గలండు
కమలమిచ్చు మధువు, కప్ప గ్రహించునా? ॥విశ్వ॥ 282

తనదు విషయ మెఱిఁగి తనపయి యధికారి
కోరుకున్న మేలు కూర్పఁబోఁడు
అడగకున్న బువ్వ యమ్మయుం బెట్టునా? ॥విశ్వ॥ 283

సహజశక్తి లేని చవట బా గొనరింప
వలనుపడునె యెట్టి వానికైన?
పటముసఁ గల దంతి పనికివచ్చునె యెక్క ॥విశ్వ॥ 284

నెమలితోఁక విప్ప రమణీయముగ నుండు
కూఁతవేయ మిగుల రోఁత పుట్టు
ఒప్పులన్ని యొకట నొనగూడవా యేమి? ॥విశ్వ॥ 285

మాయ మనకు లొంగ మార్గమెయ్యది లేదు
యోగసాధనం బదొకటి తక్క
అద్రివంటి యేన్గ కంకుశమన భీతి ॥విశ్వ॥ 286

పండితునకుఁ జేత భారతమున్నప్డు
వర్జ్యమడుగనేమి వాకొనునయ?
వరపతి మోలకత్తి క్షురకర్మ కనువౌనె ॥విశ్వ॥ 287

అధికబలుఁడుగూడ నల్పునిచేతిలోఁ
జిక్కుపడి కృశించు నొక్కకయెడఁ
జెవినిగుట్టునీఁగ సింగమేమియొనర్చు ॥విశ్వ॥ 288

అనుభవజ్ఞుఁడైన యద్వైతగురుఁజేర
శిష్యుఁడెట్టిఁడైన సిద్ధిఁబొందుఁ
బరుసవేది యినుము బంగారుసేయదా ॥విశ్వ॥ 289

కొంచెతలేనివాఁకు కోటికొక్కఁడు లేఁడు
కొన్నియున్న నేవొ కొన్నిలోటు
లందమైన మోదుగలరు నా తావితో ॥విశ్వ 290

ఆతతాయియైన నాత్మరక్షణఁ గోరి
చేతులెత్తి మ్రొక్కఁ జిదుమఁ దగదు
అభయహస్తమిచ్చి యాదరించుటె మేలు ॥విశ్వ॥ 291

శక్తి యున్నయపుడ సాధించి ధనమది
వెచ్చ పెట్టుప్రజలు మెచ్చుపనికిఁ
బోనిపుడుర్దాదు పుచ్చినవక్కైన ॥విశ్వ॥ 292

ఆత్మదేశమందు నంతఃకలహమున్న
నితరుఁడోర్చి నెత్తి కెక్కఁగలఁడు
పిట్టపిట్టపోరు పిల్లిదీర్చినరీతి ॥విశ్వ॥ 293

బ్రహ్మపురముఁజేది పరమసుఖంబంద
ననుభవంబులెన్నొ యాడుచుందుర్రి
ఊరుఁజేరు దారు లుండవా పెక్కులు ॥విశ్వ॥ 294

సాధువరులు మోక్షసామ్రాజ్యమును వీఁడి
వ్యర్ధరతులఁ జిక్కుపడరు, హంస
గంగవదలి బురద కాల్వకుఁబోవునా? ॥విశ్వ॥ 295

వేరులేనిచెట్టు విశ్వంబువ్యాపింప
రూపులేనిపోతు ప్రాపునంది
గూడులేని పెంటి గ్రుడ్లెన్ని పెట్టెరా? ॥విశ్వ॥ 296

తల్లిదండ్రు లెంత చల్లనివారైన
మిట్టిపడెడు సుతులు పుట్టవచ్చు
జలధరములమండి వెలలవా? పిడుగులు ॥విశ్వ॥ 297

విలువలేని వట్టి పలువల కడుపున
నుద్ధరించు కొడుకు లుద్భవింతు్రి
మంటిలోన మంచి మణులెన్నొ పుట్టవా? ॥విశ్వ॥ 298

ఘనుల గుణముఁజూచి గౌరవించుట లెస్స
పుట్టువెన్నికోలు పుచ్చరాదు
పంకమందుఁ బుట్టఁ బద్మము నీచమా? ॥విశ్వ॥ 299

రామునంతవాఁడు రాజ్యమున్ విడనాడి
యడవులందు గొప్ప యిడుమలందె
నెంతవారికైనఁ జింతలు తప్పునా? ॥విశ్వ॥ 300

అందమైనదాని నాశింతు రెల్లరు
కళవశింప దానిఁ గాంక్షఁగనరు
వాడియున్న పూల వనితలు దాల్తురా? ॥విశ్వ॥ 301

జగతి పందఱవలె జన్మించియున్ యోగి
లీమఁడగునె లోకలీలలందుఁ
బాలఁబుట్టి వెన్న పాలలోఁ గలియునా? ॥విశ్వ॥ 302

కడుపులోని కింత కసరు పోయినఁగాని
స్నాన మొసఁగునట్టి శక్తి వేఱు
మోపు తడియదేని మొక్కకు జిగిరాదు ॥విశ్వ॥ 303

బిడ్డపుట్టి తనదు దొడ్డ యాశలనెల్ల
వాఁడె తీర్పననెడి వాఁడె వెఱ్ఱి;
మొలక పుట్టినంత ఫల ముప్పతిల్లునా? ॥విశ్వ॥ 304

కృష్ణునంతవాఁడు కేవల భక్తుకు
చేలు నాదరించి సిరు లొసంగె
నొడికమైన యెటుక పిడికెడు ధనమెంత్రు ॥విశ్వ॥ 305

సద్గుణంబు లవ్వి జన్మమ్ముతోఁ గాక
నడుమఁ బొడమునను నవ్వులాట
హంగు విడిసిపోయి రంగు మాఱఁగవచ్చు ॥విశ్వ॥ 306

దాసి నభిలషింపఁ దగదను సైరంధ్రిఁ
గూడఁ దలఁచి కీచకుండు మడిసెఁ
బుట్టుబుద్ధి పుడకలతోఁ బోవు ॥విశ్వ॥ 307

మంత్రతంత్రయంత్ర మర్మజ్ఞు లన్నిట
ముందు నిలిచి విజయ మందఁగలరు
ఏది లేనివారి కేనారి లేదురా? ॥విశ్వ॥ 308

చెప్పువాఁ డొకండు చేయువాఁ డొక్కఁడు
లేకయున్నఁ గలదె? లోకనటన
అంద అరద మెక్క నదలించువా రేరు? ॥విశ్వ॥ 309

తీర్థయాత్ర కతన దేహమ్ము శుద్ధమౌ
క్షేత్రదర్శనమున నేత్ర మలరు
సాధుసేవనమున సద్భావ మలవడు ॥విశ్వ॥ 310

తనకు హాయిగొలుపు మనుజుని గుణ మొండు
తెలియు టరిది మొఱకు దెలివిలేమి
గంద మొలుకఁ బూయు గాడిద యలరునా? ॥విశ్వ॥ 311

ఆర్యజాతి దైవమైన శ్రీవిష్ణువు
బుద్ధుఁడనెడి పేరఁ బుడమిఁ బుట్టి
అన్యమతము నెందు కతఁడె స్థాపించెరా? ॥విశ్వ॥ 312

అఖిల ధర్మములకు నాటపట్టనఁ దగు
సత్యనిష్ఠ వొలియు శాస్త్ర మేల?
వ్యాధి విరహితునకు నౌషధ మేలరా? ॥విశ్వ॥ 313

కావ్యకర్త పడెడు కష్టమ్ము పెఱవారి
కెట్టు తెలియు నేర్పు నిట్టిది యని
బిడ్డ నొప్పులెట్లు గొడ్డురా లెఱుఁగును? ॥విశ్వ॥ 314

ఇంటి గుట్టు మట్టు లితరుల కెఱిఁగింప
అగ్గు గలుగనేర దెగ్గగాని
కడుపు చించుకొన్నఁ గాళ్ళమీఁదఁ బడు ॥విశ్వ॥ 315

కొండమీఁద నున్న కోఁతైన దిగివచ్చు
ధనము చేతినిండఁ దనరెనేని
డబ్బులేనివాఁడు డుబ్బుకుఁ గొఱగాఁడు ॥విశ్వ॥ 316

పాంచభౌతిక ప్రపంచకవస్తువు
దేనఁ గలిగె దాన లీనమవును
నీటఁబుట్టు నుప్పు నీటనే గరఁగురా ॥విశ్వ॥ 317

బాధ గురువుచేరి బాధించు నటుగాక
బోధగురువు జ్ఞాన బోధసేయు
గుణము కుదురకున్న గురువేల కొల్పవా? ॥విశ్వ॥ 318

అందగత్తెలైన యాంధ్రను విడనాడి
వేశ్య దగిలియుంట వెఱ్ఱితనము
పంటచేను దొఱఁగి పరిగ కాసింతురా? ॥విశ్వ॥ 319

అతఁడెవ్వఁడైన నవగుణ మెంచక
గొప్పగుణము లెన్నుకొనుట లెస్స
పశు వొసంగెనంచుఁ బా లానకుందురా? ॥విశ్వ॥ 320

శుభ మశుభము దెల్పఁ జూచునఁ గావను
కాకి కెవఁడు సెప్పె లోకవార్త
ఈశ్వరాజ్ఞ దక్క యితరాజ్ఞ లున్నవా? ॥విశ్వ॥ 321

కూడుగుడ్డలంచుఁ గుందెడు నిఱుపేద
నుద్ధరించు మార్గ ముత్తమంబు
దీనజనుల సేవ దేవుని సేవరా? ॥విశ్వ॥ 322

తనదు భోగ మోలిఁ దఱిఁగిపోయె నఁటంచు
దీనవదన మయ్యెఁ దెలుఁగుఁ దల్లి
ఆమెగోడు వరయు నాంధ్రులు తేరయా ॥విశ్వ॥ 323

రాజశాసనాను రాగమ్ము సడలిన
నిష్ఠమైన కరణి నెసఁగు జనము
కట్ట తెగిన నీటి గతు లిట్టులమ్మగు ॥విశ్వ॥ 324

శుభ్రవస్తు వరయ శుచి కశుచికినైనఁ
బ్రీతి పొడము నెట్టి బ్రాతినైన
కంటికింపకున్నఁ గడుపునకించునా? ॥విశ్వ॥ 325

ప్రకృతిధర్మమునకు బాహిరమ్ముగ మండి
యెంతవాఁడు కర్జ మెద్దుకొనఁడు
నింగిఁ బ్రాఁక నెవఁడు నిచ్చెన వేయునా? ॥విశ్వ॥ 326

క్రూరకర్మతోడఁ గొంకక స్నేహమ్ము
సేయనేల? వానిఁ బాయనేల?
అడుసుద్రొక్కి కాలు కడుగు టదేలరా? ॥విశ్వ॥ 327

ఇతరు లెఱుగకుండ నే లంచముల మేయు
వానిలచ్ఛనమ్ము గానఁ బడును
గంచ మెత్తి దాఁవఁ గండలు దాఁగునా? ॥విశ్వ॥ 328

బాహ్య వేషములకుఁ బదరి లో గొనముల
నిర్ణయించుటంత నేర్పుగాదు.
నల్ల నావు పాలు తెల్లగా నుండవా? ॥విశ్వ॥ 329

జ్ఞానదాత నెవఁడు గమనించినాఁ డయా?
నోరుగలిగి పలుక కూరకున్నఁ
గనులు తెఱువసూవఁ గొళ్ళఁ బూజింతురు ॥విశ్వ॥ 330

"చిత్తశుద్ధి లేని శివపూజ" లొనరింపఁ
బత్రిచేటుగాని ఫలము లేదు
పట్టియంత్రి మూడ వస్తువు లెటు లబ్బు ॥విశ్వ॥ 331

ఆత్మసుఖము లేని నైశ్వర్య మదియేల?
భర్త యెముక లేర్చు భార్య యేల?
సౌఖ్య మబ్బ నట్టి సంసార మేలరా? ॥విశ్వ॥ 332

అనధికారి వోలె నధికారి మెలఁగిన
దుష్టశిక్షణంబు దొడర దెపుడు
కుట్టనట్టి తేలు కుమ్మరి పుర్వౌను ॥విశ్వ॥ 333

మయాసభఁ దిలకించి మదిఁగుందు కురురాజు
శకుని రెచ్చగొట్టె సమయ మెఱిఁగి
పుల్లవిఱుపు మాట "పుటిరింతలకు" బాట ॥విశ్వ॥ 334

పిద్దె గలుపు వానిఁ బెద్దగా నెంచక
గద్దె నెక్కువాని గౌరవింత్రు
లోకతంత్రిమెల్ల నీ క్రియ నున్నది ॥విశ్వ॥ 335

అచ్చుబోసి విడిచినట్టి యాఁబోతయి
తిరుగువాని కెట్లు తిండిదొఱకు
టెక్కలాడకున్న డొక్కాడ నేర్చునా? ॥విశ్వ॥ 336

దాన ధర్మములకుఁ దావల మైనట్టి
భక్తి యుడిగె నీచశక్తు లెసఁగెఁ
గష్టసుఖము లెన్నఁ గావడికుండలు ॥విశ్వ॥ 337

సరస భావగరిమఁ జవులూరు కావ్యముల్
చదువ వేడ్కవడును సరసుఁ డెపుడు
తమ్మితేనె గోలెఁ దుమ్మెద చనుదెంచు ॥విశ్వ॥ 338

ఆశలేనివాఁడె యీశుఁడు ధరలోనఁ
దృప్తియున్న వాఁడె ధీరవరుఁడు
దీక్షఁబూనువాఁడె దక్షుఁడన్నింటను
విషయపరుఁడె తత్త్వవిదుఁడు వేమ! 339

ఆఱుగురు శత్రువులనోర్చి యాశవదలి
యఖిల జీవులు తనవంటివని యెఱింగి
నిర్వికల్పసమాధిలో నిలిచియుండు
బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడే బ్రాహ్మణుండు 340

సూర్యు డగ్గఱుచున్నచో సోముకళలు
తరిగిపోయెడు చందాన తత్త్వపరుల
మనసు పరమాత్మ దృష్టిపై మరలెనేని
విషయవాంఛలు క్రమముగా వీగిపోవు. 341

ఒక్క గాలి పీల్చి యొక్క నీటిని ద్రావి
యొక్క దేశమందె యుండి యుట్టు
లొకరి నొకరు చూచి యోర్వలేకుండుట
మనకు ధర్మమగునె మాన్యులార! 342

గతిదప్పిన ధృతిదప్పును
ధృతిదప్పిన మతియుఁదప్పుఁ దేహికి నవలన్
స్థితిగతులు తాఱుమాఱై
వెతలందుట నిక్కమయ్య వేమనవర్యా! 343

చెడి పిడుక లేరునప్పుడు
తడిసి గుడిసె కట్టునపుడు తాతలు తండ్రుల్
విడువక చెప్పిన నీతులు
దృఢముగ నీలోనమార్పు దేరవె! వేమా! 344

మనసిచ్చి మాటలాడఁడు
కనువిప్పి కనండు పరుల గర్వాంధుండై
చన వెఱుఁగఁడు నరుఁడకటా!
యనువుగ నధికారభూత మావేశింపన్. 345

నీవు చెడిపోవుచుండిన నిన్నుఁ జూచి
హీనుఁడని హేళనముసేయు నీ జగంబు
నీవు మేలొందుచుండఁగా నిన్నుఁ గాంచి
యోర్వలేకుండు లోక మయోమయంబు. 346

ఈశ్వరాజ్ఞచేత నీ జగంబున నేది
యెప్పుడెట్టు లగునో యెవ్వఁడెఱుఁగు
దానినెంచలేక తనశక్తియే యని
విఱ్ఱవీగుచుండు వెఱ్ఱినరుఁడు 347

ఎంతగొప్ప సంస్థనేనియు స్థాపించి
యందఱాదరింప నందమగును
ఇంటికొక్క పుష్పమిచ్చిన శివునకు
నొక్క హారమగుట నిక్కమయ్య. 348

తోఁకచుక్క వోలెఁ దోఁతెంచు పెఱబాప
లమ్మ వలుకుకెంతొ హానిగూర్చెఁ
బొలమునందుఁ గలుపు పూర్తిగాఁ బెరిగిన
నసలుపంట తగ్గు టరుదె చెపుమ? 349

తెనుఁగుభాష యనెడు తేనెతుట్టెను బెట్టి
ఈఁగ లొక్కటొకటి యేగుచుండెఁ
దొనకలాడఁ దొడఁగెఁ దుట్టెనిండుగఁ దేనె
మనుజులార! రండు మధువుఁగ్రోల. 350

పక్షీంద్రులు పుట్టని స్థలములందుఁ
గొద్దిచదువరినే యెంతొపెద్దయండ్రు
చెట్టుచేమలు పెఱుగని పట్టులందు
నాముదపుమొక్క వృక్షమైయలరు గాదె? 351

మాతృభాషామృతంబును మదినిరోసి
యన్యభాషల కెగఁబ్రాకు నాంధ్రులగతి
తల్లిపాలను విడనాడి పిల్లవాండ్రు
బుడ్డిపాలకు మూఁతుల నొడ్డినట్లు. 352

ఎవరిభాష నశించునో హీనమగునొ
ఎవరిసంతతి నిర్వీర్యమగునొ వార
లైక్యగతిఁబాసి పెడబుద్ధులావహిల్లి
దాస్యశృంఖలములఁ జిక్కి తల్లడింతురు. 353

భాషయనియెడియాకాశ పథమునందుఁ
బండితకవీంద్రబృందమన్ పక్షిసంఘ
మెఱుగు శక్తిఁ గలది నింకిఁతె కాక
యాకసంబంతఁ గ్రుమ్మర నలవియగునె? 354

భవ్యశాస్త్రార్థ విదుఁడగుఁ బండితుండు
కళ నుపాసించునాతఁడు కవివరుఁడగు
రెండు నొకచోటఁబెనఁగొని యుండెనేని
యందమగుపూవు తావితోనమరినట్లు. 355

పక్షపాతంబుతో వ్రాయు వ్రాతలందు
జ్ఞానమజ్ఞానకలితమై కళతఱుగును
వెలుఁగుతో నల్లపొగయును వెడలఁగ్రక్కి
గబ్బునూనె తిల్లికకాడి గట్టినట్లు 356

దేశకాల పాత్రంబుల తీరెఱింగి
చేయఁదగు సద్విమర్శన చేయవలయు
నిజము వచియింప సత్కీర్తి నెగడుననుట
యేటి కెదురీఁదినట్లుగా నెంచవలయు. 357

ఆశయంబుల నభిమాన మంకురింపఁ
గథను నొకకొంత మార్చును గవివరుఁడు
తత్త్వవిజ్ఞానమును సూక్ష్మదర్శిని గల
ఘనవిమర్శక దృష్టికే కానఁబడును. 358

ఎంత పాండిత్యధనమున్న నెట్టిఁడైన
కపటహృదయుఁడు సత్కీర్తిఁగాంచఁబోఁడు
పొట్టలోపల పురుగులు తెట్టగట్ట
నత్తిపండంత పూజార్హ మని రటయ్య? 359

ఆవిరిగ మాఱు జలముల నాని మేఘుఁ
డిలకు వర్షముగాఁ దిర్గి యిచ్చునట్లు
శాస్త్రపుష్పరసంబుల సంగ్రహించి
కావ్యసుధ నిచ్చు సత్కవి ఘనుఁడు కాడె? 360

చిలుక నేర్పినమాటనే చెప్పఁగలుగుఁ
గాని సమయానుకూలత కలుగఁ బోదు
మానవున కింక నేర్పిన దానికంటె
ననుభవజ్ఞానమున నూహ లధికమగును. 361

పాలు నీరును గలసిన భంగి మంచి
చెడ్డ లుండెను గ్రంథాల సిద్ధ మగుచుఁ
బరమ హంసగ మాటీన సరసుఁ డెపుడు
పాలు గ్రోలుచు నీటిని బాయఁ గలఁడు. 362

మతముపేర నమాయిక మానవులను
మోసగించుచు నున్నారు దోస మనక
యట్టి మాయను దెలియుతె నంత వఱకు
భావధాస్య విముక్తిని బడయలేరు. 363

శాంతి బోధకుడైన వేదాంతి మాట
వినదు లోకము మోసమ్ము విశ్వసించు
గొల్లవానిని నమ్మదు గొఱ్ఱె యెపుడు
కటికవాఁడన్న దానికి కాంక్ష మెండు 364

అంటరానితనం బగ్ని కఁటగట్టి
తోడివారలనెంచు నీతోడులనుచు
నట్లుగాకున్న సరియైన యాత్మశాంతి
కలుగఁ బోదింక నెన్ని యుగాలకైన. 365

గొప్పవాఁ డెవ్వఁడైనను గోచరింప
నతని కుల మెద్దియని పల్కు హైందవుండు
తన కులజుఁడైన యాతని ఘనతఁజాటుఁ
గాకయుండిన లెక్కగాఁ గైకొనండు. 366

ఒకఁడు ఘనకార్యమును జేయుచున్న నొకఁడు
భంగమును జేయఁ జూచియుఁ బతితుఁ డగుచు
వంకలనుబెట్టు, నందని పచ్చిద్రాక్ష
పుల్లగానుండు ననుటది కల్లగాదు. 367

నిలువు లద్దాలు మొగమున నిక్కనిల్పి
పెట్టినను జేతితోనింత పెట్టకున్నఁ
జేరఁబోదెన్నఁడును లచ్చి; చెట్టువేసి
పెంచకుండిన ఫలము లభింపఁ గలదె? 368

పలువురొక పని సాధింపఁ దలపడినను
ఘనులె యంతముఁ గనుఁగొనఁ గలరు; కడలిఁ
జిన్న యలలన్ని నడుమనే చితికిపోవ
దొడ్డకెరటాలు మాత్రమే యొడ్డుదాఁకు. 369

అణఁగి చరియించు సజ్జనుఁ డతిమృదువుగ
నధముడెప్పుడు నిక్కి పై నాడుచుండు
ప్రాణవాయువు క్రిందుగా వచ్చుచుండఁ
జోవు పైభాగమున బొగ్గుపులుసుగాలి. 370

ఉత్తములతోడ సహవాస మున్న యెడల
సద్గుణంబులు గలుగుట సాజమయ్యె!
చెంత జందనవృక్షంబు చెలగియున్నఁ
జెట్టులన్నియు నాతావి జిమ్ముటరుదె? 371

కష్టములు తీరినంతనే కలుగు సుఖము
విలువ యెక్కువగాఁగల్గి యలరుచుండు
మండు వేసవి యెండకు మాడిమాడి
నిమ్మనీడను జేరు సుఖమ్ము భంగి. 372

ఎచటఁ బుట్టిన జీవికి నచట నెట్లొ
యీశ్వరుఁడు జీవనంబుఁ జూపించినాఁడు
కాకయుండిన జాతిలోఁ గప్పయెట్లు
బ్రిదుకుచుండును నారోగ్య పథమునందె. 373

స్నేహితులు తన్ను గొప్పగాఁ జెప్పుకున్నఁ
గపివరుండైనఁ గీర్తిని గాంచలేఁడు
ఎంత గారడివాఁడైన నెఱిఁగి మనుజు
లెట్లు వత్తురు డోలు వాయింపకున్న. 374

హృదయ మర్పించునట్టి స్నేహితుఁ డొకండు
చాలు మన మేలుకోరుచు సాయపడఁగ
పిచ్చిమొక్కలు పదివేలు పెఱుగనేల
కాయ లిచ్చెడి వృక్ష మొక్కటియె చాలు 375

ఎండలో పుట్టి పెఱిఁగి వశించుచుండఁ
ద్యాగపురుషుల జీవిత భాగములనె
చెప్పుకొనుచుంద్రు భక్తిమై గొప్పగఁ బ్రజ
తావిగల పూవులనె తలం దాల్చినట్లు 376

తొలుత మాపూర్వు లందఱు దొడ్డవార
లనిన నెందాక గౌరవ మబ్బు మనకుఁ
జెట్టు పేరులు గొప్పగాఁ జెప్పుకొనుచు
నెందనుక పండ్లను విక్రయింప గలము. 377

తల్లి గర్భములో నుండి ధరణిఁ బడిన
క్షణము మొదలుఁగ గడపటి క్షణము వరకు
లోకజాలములోఁ దగుల్కొనును నరుఁడు
బూజులోఁ జిక్కి తపియించు పురుగువోలె 378

తనదు లోపంబులను దిద్దుకొనకమున్నె
పరుల తప్పుల నెంచుట పాడియగునె
అచ్చపుం గాజుమేడఁ దా వధివసించి
యితరులను జాలుఱువ్వుట హేయమగును. 379

ధర్మసంస్థాపనము సేయఁ దగినయట్టి
రాజులేకున్న సాధు సంరక్షలేదు
ముండ పెంచిన బిడ్డయు, ముక్కుఁద్రాడు
లేనియెద్దును హద్దాఁక లేకయుండు. 380

పాపపూరితమైన సంపాదనమ్ము
చీడపురుగుతోఁ బెరిగెడి చెట్టువోలె
ననుభవించుట కేమాత్ర మనువుపడని
చెడుఫలంబుల నొసఁగి నశించుటయుదె? 381

ఎంతవాఁడైన దారిద్ర్య మొసఁగియున్న
గుణహీనుని చందాన గోచరించు
సింహమైనను బోనులోఁ జిక్కియున్న
నగము చచ్చిన రీతిగా నగపడదొకొ? 382

ఉత్తమ సతీమతల్లి తా నొళవు మీఱ
భర్త యడుగులలో నడుగు వైచుచుండు
సిద్ధ గురుమార్గవర్తి యౌ శిష్యునట్లు
శ్రుతుల వెన్నంటి సాగెడి స్మృతులవోలె. 383

ఎంత యాకార గాంభీర్య మొసఁగియున్న
సతి పతికి లొంగియుండుట సహజమండ్రు
కడవ వలె నున్న గుమ్మడి కాయయైన
గత్తిపీటకు లోకువ కాదఁటయ్య? 384

చెప్పు మాటలకును జేయు చేతలకును
బొసఁగకుండిన నభివృద్ధిఁ బొందరెపుడుఁ
జెనఁడి శ్రీరంగనీతులు చెప్పినంత
వినెడివారెట్టులద్దాని విశ్వసింత్రు? 385

గృహిణిగుణములు సవరింప కేగృహంబు
జక్కఁజేయఁగనెంచుట సరియగు నొకో?
యసలువస్తువు వంకర నట్లెయుంచి
దానినీడను సరిచేయఁ దలఁచినట్లు ౩౮౬

కలవానిచెంత నక్కఱ
గలవాఁడు ఖలుండుచేరి ఘనదాజమ్ముల్
సలుపుటకద్దె నిలుచును
ఫలభూజముక్రింద గొప్పపొదున్నక్రియన్. ౩౮౭

స్థిరముగఁ బ్రశాంతిఁ గోరెడి దేశమెపుడు
సిద్ధపడి యుండఁదగు ఘోరయుద్ధమునకుఁ
బంటవలఁతిని రక్షింప వడెపెలయును
దండమును గాఁపు ధరియించి యుండవలయు. ౩౮౮

తెవులులేని యాత్మ దేహియై ధరఁబుట్టి
పాపపుణ్యఫలముఁ బడసినట్లు
వాసన రుచి రంగు వాననీటికి లేవు
పుడమిఁబడిన వానిఁ బొందఁ గలుగు. 389

క్రోధపూరిత హృదయుండు కోపగింప
శాంతుఁడు ప్రశాంతి విడఁడు భాస్కరుని మిగుల
ఉష్ణకిరణంబులే సోఁకు చున్నఁ దనదు
చల్లని వెలుంగు కిరణాలు శశియొసంగు. 390

సూత్రమదేమొ? ప్రజాపతి
క్షేత్రజ్ఞుండొచు నేమి చేసెనొ తొలుతన్
*"నత్రజని భ్రమణము" వలెఁ
జిత్రమ్ముగఁ దోఁచు లోకసృష్టి గణింపన్. 391

* Nitrogen Cycle

కుజనుఁడు కుతర్క మొనరింప సుజనుఁ డెపుడు
సౌమనస్యమ్మునన్ సత్యసార మెఱుఁగు
బంభరము పూవుఁదేనెకై పరువు లిడఁగఁ
బేడ కాశింప దయ్యె? "బొంబోడి" పురుగు. 392

మనసు సన్మార్గ మందుట మాత్రిఁ గష్ట
మది కుమార్గమునం జేరు టక్రమంబు
బండ నలకొండ మీదికిఁ బఱపుటన్నఁ
గష్టతర మది విడచుట కడుసులభము. 393

నిప్పుల కుంపటి యైనది
యప్పా! సంసారభార మతిదుర్భర మే
చొప్పునఁ దరిఁపఁ గల నని
తప్పక క్షేత్రిజ్ఞుఁ డాత్మతత్త్వము వెదకున్. 394

ధన ఋణ విద్యుత్తులచే
మన కీలోకంబు గలిగె మహిమాఢ్యంబై
అణుధర్మ మరయ నయ్యది
అనుమానములం దొలంచు నయ్యా! వేమా! 395

అఖిల విజ్ఞానపేటి గ్రంథాలయమ్ము
కల్పమటు దివ్యఫలముఁలఁ గలుగఁ జేయు
లలితకళల వినోదాళిఁ గులుకు ఘనులు
దానధారలఁ బోషింపఁ దగదె దాని. 396

కావ్యకల్పలతను ఘనులు పోషించుచో
అమరఫలములెన్నొ యది యొసంగు
ధీరవరుల వారిఁ దిన నర్హులగుదురు
విశ్వవినుతచర్య! వేమనార్య! 397

జ్ఞానభిక్ష పెట్టు గ్రంథాలయము లెప్పు
డుండి తీరవలయు నూరనూర
దానఁ జాలవఱకు జ్ఞానపోషణ గల్గు ॥విశ్వ॥ 398

ఓర్పునేర్పులరసి యొక్కఁడింకొకనికిఁ
దప్పకుండ విద్య సెప్పెనేని
చదువురానివాఁడు జగతిఁ గన్పడఁబోఁడు ॥విశ్వ॥ 399

పెద్దవాఁడనైతి విద్దె నాకెటులబ్బు
నంచుఁ దలఁచుటెన్న నధమగుణము
గుఱియెనిల్వ విద్యకూడదా తగినంత ॥విశ్వ॥ 400

పుడమిఁ బడినదాది కొడుకులకు కూఁతుల
గుణము చక్కదిద్దు గురువు తల్లి
తల్లిచదువుకొన్న పిల్లలకే మేలు ॥విశ్వ॥ 401

కష్టసుఖములందుఁ గలిమిలేములయందు
మంచివారి గుణము మాఱదెపుడు
చెఱకు తియ్యఁదనము విఱిచినఁ బోవునా? ॥విశ్వ॥ 402

సుకృత దుష్కృతముల సూటిగ నెఱిఁగింప
ఆత్మయుండఁ బరుల నడుగనేల?
ముకురమేల? కడెము ముంజేతనుండఁగ ॥విశ్వ॥ 403

ఆడితప్పఁబోకు మప్పుసేయఁగ బోకు
పరులమనసు కష్టపఱుపఁ బోకు
కొంటెచేష్ట మాను కొంటెముల్ మానరా. ॥విశ్వ॥ 404

మంచినెంచలేని చంచలచిత్తుల
మనసు తెలిసి యెవఁడు మసలఁ గలఁడు?
పిచ్చివాని చేతి బెడ్డటు పోవునో ॥విశ్వ॥ 405

చెడ్డమూక నింత దొడ్డవాఁ డొకఁడున్న
నెంతొ మంచికీర్తి నెసఁగుచుండు
నలుపుప్రక్కనున్న తెలుపువెల్గిన యట్లు ॥విశ్వ॥ 406

శ్రద్ధతోడవినినఁ జక్కగాఁ దెలియును
మనసు నాటుకొనును మానసమున
ప్రజకుఁ దిరిగిచెప్ప ప్రజ్ఞాధికుండగు ॥విశ్వ॥ 407

ఉన్న వేళ మనసు తిన్నఁగా నుంచక
లేమివేళ నేడ్వ నేమిఫలుగు?
కట్టత్రెంచి నీరు కలవైన దన్నట్లు ॥విశ్వ॥ 408

కార్య సాధకుండు కష్టవారిధు లీది
తలఁచుకొన్న పనులు సలుపుచుండ
ఒడ్డు నున్నవాఁడు గడ్డలువేయుగా ॥విశ్వ॥ 409

దాన ధర్మములకుఁ దగినంత యొసఁగిన
లోటుపడు నటంచు లోఁదలఁపకు
చెలమ తీయుకొలఁది జలమూరుచుండదా? ॥విశ్వ॥ 410

ఆలు మగల మనసు లతుకకుండిన యెడ
జీవితమున రసము చుప్పిలదయ!
జంత్ర గాత్రములకు జతగూడ కున్నట్లు ॥విశ్వ॥ 411

గడ్డవెనుక పెద్దగడ్డవేయుచు మన్ని
పరసునడుమ పాచి చనును కడకు
మంచిమాటలు విన మనసు నిర్మలమగు ॥విశ్వ॥ 412

పుణ్యముకొలంది పురుషుండు లభియించు
ధానమునకుఁ దగిన తనయులంద్రు
పిండికొలఁది గాక పెఱుగునారొట్టెలు? ॥విశ్వ॥ 413

తగిన దిట్టయైనఁ దరిదప్పఁ గీడ్పడు
చిక్కనట్టి లేడ చిక్కె నన్న
కాళ్ళు లేకకాదు కాలము వచ్చిరా ॥విశ్వ॥ 414

చక్కనమ్మమేను చిక్కిన సొబగగుఁ
గాంచ ముద్దగు శశికళ తఱిగియు
ఎలుఁగు మంచిదైన నేడ్చిన నింపగు ॥విశ్వ॥ 415

అల్పుఁడాచరించు స్వల్ప దోషంబుల
గొప్పవాఁడు సేయు గొప్ప తప్పు
ఎంత దివ్వెకింద అంత చీఁకటియుండు ॥విశ్వ॥ 416

తొండమున్న మాత్ర దోమ యేనుఁగుకాదు
ఱెక్కలున్న నీఁగ పక్కిగాదు
పెద్ద మచ్చలున్న పిల్లి బెబ్బులిగాదు ॥విశ్వ॥ 417

క్రిందివాడు తనకుఁ గీడుసేయుండని
తలఁచెనేని హాని కలుగుఁ గర్ణు
చావుకొఱకు జరిగె శల్య సారథ్యంబు ॥విశ్వ॥ 418

అండ యున్న దంచు నదరిపడెడువాని
నణఁగ ద్రొక్కఁ నలఁతు లదనెఱింగి
కొండెమీటు తేలుఁ జెండరా కసితోడ ॥విశ్వ॥ 419

ఉట్టి గట్టి నిరత మూఁగు లాడఁగ బోము
మాటమనును, తనువు మట్టిపాలు
మాట దక్కెనేని మూటయు దక్కురా ॥విశ్వ॥ 420

కన్న తల్లికంటెఁ గల్పవృక్షము లేదు
తగిన భార్యకన్న దాసి లేదు
పరమ గురునికంటె బంధువే లేదురా ॥విశ్వ॥ 421

కూడు గుడ్డ కొఱకుఁ గుందెడు నిఱుపేద
చదువు సంధ్యలకెటు శ్రమపడునయు
పాదహీనుఁ డెట్లు పరుగిడ నేర్చును? ॥విశ్వ॥ 422

మిత్రులట్లమెలఁగు శత్రువులుందురు
ఎఱుకగలిగి సంచరింపవలయు
తులసిమొక్కవోలె దురదగొండియు నుండు ॥విశ్వ॥ 423

పాలనిచ్చుచుండుఁ బచ్చికఁదిని గోవు
పాలుద్రావి విసముఁ బామొసంగు
ఉత్తమాధముగుణ ముండురా యిబ్భంగి ॥విశ్వ॥ 424

తనకుచాలినట్టి దానధర్మముసేయఁ
బూని సెగ్గలేఁడు; తాను దూఱ
వీలులేనియపుడు డోలుండు మెడకేల? ॥విశ్వ॥ 425

పతియె దైవమంచు భావించు చక్కని
సతి లభింప వేఱె స్వర్గమేల?
ఇచ్చోటఁదక్క స్వర్గ మింకెట నున్నదిః ॥విశ్వ॥ 426

సంశయాత్ముడెపుడు జయ మొందజాలఁడు
సంతసంబె మనకు సగము బలము
సాహసమున లక్ష్మి సంప్రాప్తమగునందు ॥విశ్వ॥ 427

దేవుడెచటనుండుఁ దెలియఁ జెప్పుమటన్న
ఏమిచెప్పఁ గలుగు నెవ్వఁడైన?
నమ్మినట్టివారి నెమ్మనంబున నుండు ॥విశ్వ॥ 428

పడవనడుపువాడు పడుగుచేసెడివాఁడు
గాలివాటమెఱుఁగఁ జాలకున్న
గుడ్డియెద్దు చేను బడ్డ రీతిగనుండు ॥విశ్వ॥ 429

తల్లిదండ్రులనెది పిల్లలు ప్రశ్నింప
ఒప్పులరసి విప్పి చెప్పవలయు
సాఁగుచున్న లతను సరిగ పందిరి వెట్టు ॥విశ్వ॥ 430

కాలుచుండి వెల్గుగ్రుక్క నుండునువత్తి
ఎండనుండి నీడనిచ్చువృక్ష
ముత్తముండు కష్టమోర్చి మేల్సేయురా ॥విశ్వ॥ 431

ఎన్నొ రూపములుఁగ నెసఁగు విశ్వంబెల్ల
బ్రహ్మమయమెకాని పరముగాదు
రంగులన్ని తెల్లరంగులలో నున్నట్లు ॥విశ్వ॥ 432

ఐనహారికింత యాకులో వడ్డించి
కానివారలకిడు కంచమునను
లోకమునకుఁ దెలివి లోటెంత కలదురా ॥విశ్వ॥ 433

అనుభవజ్ఞులైన యార్యుల యోచించి
చెప్పినట్లు పనులు చేయవలయు
ఎఱుకలేక సలుప ఏకు మేకౌనురా ॥విశ్వ॥ 434

చీడపుర్వు చెట్టుఁ జెడదినునేగాని
పుడిసెడైన నీరు పోయలేదు
దుష్టుఁడొరులఁ జేరి ద్రోహమే సేయురా ॥విశ్వ॥ 435

ప్రక్కయింటివాఁడు బాగుపడుచునుండఁ
జూడలేనివాఁడు శుద్ధపశువు
పశువుకైన కొంత పరమార్థమున్నదే? ॥విశ్వ॥ 436

శక్తివంతుఁడైన సమయము విషమింప
దగ్గియుంట విహితధర్మ మగును
మఱ్ఱియాకుమీద కఱ్ఱివేల్పున్నట్లు ॥విశ్వ॥

ఎముకలేని చేయి అమృతమొలుకు వాయి
గల మనిషి కేమి గలుగదయ్యా?
అట్టు నిచ్చినమ్మ కట్టున్నరీయరా ॥విశ్వ

ఎగ్గుసిగ్గులేని హీనులతోఁ జెల్మి
చేసెదేని కడకుఁ జేటుగల్గు
కోఁతిమూఁక జేర కొంపలు జెడునయా ॥విశ్వ॥

చెవిటివాడు పరుల చెవిటివారలు నాఁగ
పెద్దగొంతుతోడఁ బిలిచి చెప్పు
ఎట్టివారికి పరులట్టివారుగఁ దోఁచు ॥విశ్వ॥ 440

పరులయాస్తి చూచి పరితపింపఁగనేల
తనకు లేదటంచు గొణగనేల?
తాత్తువోలెఁ జేసి దొరవలెఁ దినవలె ॥విశ్వ॥ 441

మురుఁగునీరు నిల్వ బురుగులుపుట్టును
గోయిపెఱుఁగ మడ్డి జేరుచుండు
కోపమడరెనేని పాపము మొలకెత్తు ॥విశ్వ॥ 442

నీతులెన్నొ చెప్పి చేఁతలు లేకున్న
ఫలమొకింతయైనఁ గలుగఁ బోదు
మందుపేరుసెప్ప మాయునా వ్యాధులు? ॥విశ్వ॥ 443

పెద్దవారిలోనె యొద్దిక చెడిపోవ
పిన్నల కది పుట్టి పెరుగు టెట్లు?
రాజుగుణముఁ బట్టి రైతుగుణంబుండు ॥విశ్వ॥ 444

పెద్దకొడుకు మీఁదఁ బ్రేమ తండ్రికిమెండు
తల్లికుండు చిన్నతనయు మీఁద
మధ్యములను గండుని మధ్యస్థమగునయ ॥విశ్వ॥ 445

అత్తపోరుకంటె ఆడుబిడ్డల పోరు
ఎక్కువగును కొన్ని యిక్కలందు
అసలు మందుకంటె అనుపానమెక్కువ ॥విశ్వ॥ 446

హానికరములైన యవసరమ్ముల యందు
బాటఁ దప్పెనేని భంగపడును
రేవువడిచి దిగినఁ జావు తిప్పలుగల్గు ॥విశ్వ॥ 447

వేశ్యవిటుల కొఱకు వేషభాషలఁ బైకి
మెఱుపుఁజూపు మనసు మెఱుఁగుబాపు
కొప్పునిండ పూలు కొప్పువిప్పిన పేలు ॥విశ్వ॥ 448

బిగువుసేయఁ దీఁగ తెగిపోవు వీణకు
వదలుచేసెదేని వలుకఁబోదు
సరిగఁ గుదురకున్న సంసార మంతెరా ॥విశ్వ॥ 449

తగినకృషి యొనర్చి ధనవంతుఁడగు నొండు
తండ్రివలనఁ గలుగు ధనమొకనికి
సెట్టు శాస్త్రియొకఁడు పుట్టు శాస్త్రియొకండు ॥విశ్వ॥ 450

పరులసొమ్ము తినెడి పాపాత్ములకు స్థాయి
కలుగఁబోదు జయము నిలుపఁబోదు
పరధనమ్ముకంటె గరళము మేలురా ॥విశ్వ॥ 451

గంజినీళ్ళ కేని కఱవైన యప్పుడు
పట్టుబట్ట లేల కట్టవలయు
మ్రింగ మెతుకు లేదు మీసాల కత్తురా? ॥విశ్వ॥ 452

బలము చాలనపుడు పాండవులుండిరి
పొసఁగ ఏకచక్రపురమునందు
వలిగియున్న వేళ తొలఁగి యుండుట మేలు ॥విశ్వ॥ 453

కండ క్రౌర్యకలిగి కవియు దుర్మార్గుండు
సాధు రక్షణకెటు సాయపడును?
మేలుకోరి వృకము మేకను కాయునా? ॥విశ్వ॥ 454

పద్మ రేఖలున్న పాదము కుంటిదే
ఐన మంచి దశకు హానిలేదు
కాలుకుంటిదైన కడుపెట్లు కుంటిది? ॥విశ్వ॥ 455

సమునిమీఁద తనదు శౌర్యంబు చూపక
మ్రొక్కువాని నణఁగఁ ద్రొక్కుటరయ
బడుగుపిచ్చుకపయి బ్రహ్మాస్త్ర మేయుట ॥విశ్వ॥ 456

ఓనమాలుచదివి ఆనవాలును జూడు
గురుని మాటమీఁద గురిని నిలుపు
విన్నవానికంటె కన్నవాఁడె ఘనుఁడు ॥విశ్వ॥ 457

తానె శకునిగూడి ధర్మజుతో జూద
మాడ కౌరవేశుఁ డరుగుటరయ
పిల్లిఁజంకఁ బెట్టి పెండ్లికిఁ బోవుట ॥విశ్వ॥ 458

ఇచ్చకంబులాడి యుచ్చులోఁ బడద్రోయు
నవ్వి దువ్వి ఖలుఁడు నటన సేయు
నోరు మాటలాడ నొసలు హేళనచేయు ॥విశ్వ॥ 459

నేలమీఁద బడిన నిముసమ్ము మొదలుగా
ఊరక తరిగిపోవుచున్న ఆయు
వోటికుండలోని నీటి విధంబురా ॥విశ్వ॥ 460

శిక్ష కాజ్ఞనీయు దక్షత గలవాఁడు
చెప్పినట్లు చేయు చెనఁటిగూడ
చెప్పకిచ్చింది తేలు చెప్పినట్లుండదా? ॥విశ్వ॥ 461

నోరు మంచిదైన ఊరు మంచిదియగు
తిండిపుష్టి యున్న కండపుష్టి
ధర్మబలము గల్గ దైవబలముగల్గు ॥విశ్వ॥ 462

చిన్న చిన్న దొనగులెన్నొ కన్పడకుండు
దాతకుండు గొప్ప దానమహిమ
సూర్యుడున్న యపుడు చుక్కలు తోఁచునా? ॥విశ్వ॥ 463

సద్గుణముల వృద్ధి చాలకాలము పట్టు
చెడుగుణాల పెంపు శీఘ్రము యగు
ముండ్లచెట్టె పెరుగు పండ్లచెట్టునకంటె ॥విశ్వ॥ 464

అధిపులొందుచుండు రధిక కష్టసుఖాలు
ఎంతచెట్టు కుండు నంతగాలి
అబ్ధి కున్న పెద్ద అలలు కాల్వకులేవు ॥విశ్వ॥ 465

చెప్పఁదగినమాట చెప్పఁదగనిమాట
తెలిసి పరులతోడఁ దెలుప వలయు
పెదవి దాటెనేని పెన్నయు దాటురా ॥విశ్వ॥ 466

ఎ డమాషలందు నుండదు నీరమ్ము
నేఁతిబీరలోన నేయి సున్న
వేశ్యవలపునందు ప్రేమ శూన్యంబురా ॥విశ్వ॥ 467

ఎవరి తప్పు వార లెఱుఁగంగఁ జాలరు
పరుల తప్పు పట్టి పదరుచుంద్రు
ఎవరి వీపు వారి కెట్టుల కనుపడు ॥విశ్వ॥ 468

జోలిమాలిన పని జోక్యంబు కల్గించు
కొనుట, హానికరము మన జులకును
మేకు పీఁకి కోఁతి మిత్తి వాతంబడె ॥విశ్వ॥ 469

వర్ష యోగమునకె వచ్చు తూఁనీగలు
తేఁచు కీడుకొఱకె తోఁకచుక్క
చెడెడు కాలమునకె చెడ్డ బుద్ధులు పుట్టు ॥విశ్వ॥ 470

పెద్దవారితోడ నొద్దిక విడనాడి
మాటలాడెదేని చేటుగలుగు
కన్ను బోవు వంత కౌటుక యేలరా ॥విశ్వ॥ 471

ప్రాణవాయువున్న వ్రిజ్వలించును దివ్వె
ప్పర్థయున్న విద్య సరిగఁ బెఱుగు
వాన కురియుచున్న వరదలు వచ్చురా ॥విశ్వ॥ 472

ఇంట పెద్దవాఁడు తుంటరియైనచో
చెనఁటు లగుట కేమిః చిన్నవారు
కోడలు వలుపైన కుల మెల్ల నలుపురా ॥విశ్వ॥ 473

ఉన్నవారిచెంత నొద్దికతోఁ జేరి
మాటనేర్పుచేత మనెడివాఁడు
గాదికిఁ్రింద మన్న గరిమిడికొక్కురా ॥విశ్వ॥ 474

ఊరకున్న వాని కూరెల్ల నోవదు
భూషణంబు సత్యభాషణంబు
కట్టులేని నోరు గట్టు తెగిన యేరు ॥విశ్వ॥ 475

నీతిమార్గమందు నీవు చరించుచు
ఒరుల కది వచింప ఉచితమగును
మొదట నిల్లు గెలిచి పిదప రచ్చం గెల్వు ॥విశ్వ॥ 476

కలిమి లేని వేళ కానుచేయని వాఁడు
కలిమి గలుగ రాజఘనతఁ గాంచు
ధనము మహిమగాని తనమహిమా యది? ॥విశ్వ॥ 477

పెంకెవాని మనసు బింకంబు తెలియక
హితము చెప్పెదేని యెగిరి పడును
ముద్దుగొన్న కుక్క మూతి కఱచినట్లు ॥విశ్వ॥ 478

అత్మలేనివాని కాచారములు మెండు
అల్పమతికి సంశయములు పెక్కు
వట్టి గొడ్డు కఱపు "లాట్టె" పుట్టుచునుండు ॥విశ్వ॥ 479

వృద్ధుఁడయ్యు ఘోరయుద్ధాన భీష్ముఁడు
లొంగలేదు వైరిలోకమునకు
బ్రహ్మచర్యదీక్ష బహుశక్తి నిచ్చురా ॥విశ్వ॥ 480

పరికైన దేహమారోగ్య మొందక
బుద్ధి వికసనంబు పొందలేదు
చమురులేని దివ్వె చక్కఁగా వెలుఁగునా? ॥విశ్వ॥ 481

శ్రద్ధయుండెనేని సాధనముండును
సాధనమునఁ బనులు చక్కఁబడును
చక్కఁబడిన పిదప సౌఖ్యంబు గలుగురా ॥విశ్వ॥ 482

దున్న యీనెనన్న దూడఁ దెమ్మన్నట్లు
మాటలాడునట్టి మనుజులున్న
నిజమెఱుంగ కొంత నిలుకడ వలయురా ॥విశ్వ॥ 483

రాజమార్గమందు రక్షణముండును
అడ్డదారి పోఁగ గొడ్డ మగును
సత్యపథమునందు సౌఖ్యంబు పొసగురా ॥విశ్వ॥ 484

అప్పుచేసియైన పప్పుకూడు తినుట
ముప్పు గూర్చుఁగాని ముద మొదవదు
ఆయ మెఱిఁగి నరుఁడు వ్యయము సేయుట లెస్స
॥విశ్వ॥ 485

కష్టపడి ఫలమ్ము గడియించుకొను వాఁడు
పవలు రేయి యనక పాటుపడును
ఈఁతకాని కెంత లోతైన లెక్కయా? ॥విశ్వ॥ 486

పతికి ముదముకూర్చు భార్య గతింపగా
కష్టపెట్టు కలికి కలిగెనేని
తలుపు పోయి కడకు తడికె చేకుఱినట్లు ॥విశ్వ॥ 487

రౌద్రరూపము చూపు క్షుద్రు సేవించుచు
ఎంతదనుక పేద యెటు వసించు
ఏటియొడ్డు గుడిసె ఎన్నాళ్ళు నిలుచురా ॥విశ్వ॥ 488

వయసునందు చిన్న వాఁడయ్యు సుజ్ఞాని
పరుల కుపకరించుఁ బలు విధముల
చిన్న దివ్వెచేత ఎన్నొ దివ్వెలు వెల్గు ॥విశ్వ॥ 489

బాటసారి యెంత బాఁతిమాలి యడిగిన
బండి వచ్చు తఱిని తిండిపెట్టు
పూటకూళ్ళ తల్లి పుణ్య మెఱుంగునా? ॥విశ్వ॥ 490

ఒక్క తెక్క పోటు పెక్కురు తినునిఁట
కఱవుగాక యెట్లు కొఱఁత తీఱు
చిన్న సూయి సూఱు చేదలఁ దన్నునా? ॥విశ్వ॥ 491

కాలుజాఱ తిన్నగా తీసికొన వచ్చు
నోరుజాఱ తీయు దారి లేదు
చేయిజాఱి కుండ చెక్కలైన తెఱంగు ॥విశ్వ॥ 492

వేశ్య యింటిలోన వేదాంత గోష్ఠిని
సల్పఁ దలఁచు టెంత తెలివి లోటు
రొట్టె బేరమేల? బట్టల కొట్టులో ॥విశ్వ॥ 493

ఆతఁడేమిచేసె నీతఁడేమి యొనర్చె
అనుట యెంతకైన అతి సులభము
ఏమి చేసితినని ఎంచుకొంటయె గొప్ప ॥విశ్వ॥ 494

మంచి వారలణఁగి మణఁగి వర్తించిన
చెడ్డవాఁడు కీడు చేయుచుండు
చిమట పెట్టెలోని చీరల చింపదా? ॥విశ్వ॥ 495

సారహీన మైన సంసారమునఁ బడి
మాఱు దాటలేని మానవుండు
జిగురుకండె తగిలి చింతిలు పులుఁగురా ॥విశ్వ॥ 496

బ్రహ్మఁ జూడ విద్యపై భ్రాంతి వొడమును
హరిని గాంచ భోగ మండఁ గోరు
శివుని గన్న మోక్ష జిజ్ఞాస గల్గురా ॥విశ్వ॥ 497

గణిత శాస్త్రభావ గరిమ విమర్శింప
వస్తు తత్వశాస్త్రవాద మరయఁ
దత్వశాస్త్రమునకె తలయొగ్గు చున్నవి ॥విశ్వ॥ 498

గీ॥ మానవుండయి పుట్టిన మాత్రముననె
మానవత్వము గల్గునన్ మాటకల్ల
మానవత్వము గలయట్టి మానవుండె
దైవతత్వము సాధింపఁ దగును సుమ్ము. 499

క్రూరజంతు వొంటి గుహలఁ జరించును
సాధుజంతు లుండు సంఘములుగ
సజ్జనుండు సతము సంధిని గోరురా ॥విశ్వ॥ 500

ఇహ సుఖంబుఁ గోరి యే యెండకా గొడ్గు
పట్టునతఁడె నరగ బాగుపడును
నిక్కమగల్గి సుఖము దక్కద యరుమురా ॥విశ్వ॥ 501

అప్పులేనివాఁడె అధిక సంపన్నుడు
సత్య మాడువాఁడె సజ్జనుండు
మేలు గూర్చువాఁడె మిత్రాధికుండురా ॥విశ్వ॥ 502

జూదమాడి నలుఁడు ఖేదమ్ము పొందెను
జూదమాడి ధర్మజుండు చెడెను
వారికంటెఁ బరుఁడు వరికింప నెవఁడె ॥విశ్వ॥ 503

కసరుకొనెడు వాని కంటెఁ గన్పడకుండ
నాత్మనీర్ష్యఁ గాఁడె హానిసేయు
నెండకన్న మూఁగయెండ తీవ్రము నొందు ॥విశ్వ॥ 504

ఎవనియిల్లు వాఁడె సవరించు కొనినచో
దేశమెల్ల సరిగఁ దేజరిలదె?
చెప్పి యెంతవఱకుఁ జేయింపఁ గలవురా? ॥విశ్వ॥ 505

నమ్మి యిచ్చినట్టి సొమ్మెగ వేసెడి
పాపి మోము గనుట పాతకంబు
ధనము పోయినంతఁ దనువెల్ల నొప్పిరా ॥విశ్వ॥ 506

పరిహరవాయు వెపుడు భ్రమియించుటం జేసి
మండలములు తిరుగుచుండు సతము
అదియ నిలిచె నేని యన్నియు నిలుచురా ॥విశ్వ॥ 507

వాన కురియు వేళవలిగాలి వీచును
ఎండవేళ గాలి మండుచుండు
సాహచర్య మెంత సలుపురా గాలిని ॥విశ్వ॥ 508

ఐక్యమున కొకింత హాని గల్గించెడి
జాతి భేద మాట్టె నడలకున్న
సంఘసేవ సేయ సాధ్యంబు కాదురా ॥విశ్వ॥ 509

గాలికంటె రవము కడువేగముగఁ బోవు
దానికన్న కాంతి త్వరగఁ జను మ
మనము వేగ మింత యని చెప్పగా రాదు ॥విశ్వ॥ 510

కడవ కడవ పూజ గావించు వారికి
బుద్ధి నిలుకడెట్లు పొదలునయ్య?
వీచుగాలి కెపుడు తోఁచునా యొకతావి? ॥విశ్వ॥ 511

గీ॥ మామ యొకరింటి యల్లుఁడన్ మాట మఱచి
అత్త యొకరింటి కోడలే యని తలఁపక
చిన్న వారికి నీతులు చెప్పుచుండు
పాపటన్ వెండ్రుకలు తెల్లఁ బడినయంత. 512

గీ॥ పూలు రువ్వినవానిపై ఱాలు రువ్వ
కలుష చిత్తుల కిది మంచి కార్యమయ్య
చెంపఁ గొట్టిన మఱియొక చెంప నిచ్చు
సాధువుల కిప్డు నిల్వఁగ స్థలము లేదు 513

గీ॥ పిన్న చేఁపల మ్రింగును బెద్ద చేఁప
పిన్నవారల హింసించుఁ బెద్దవాఁడు
దీనిలోఁ గల మర్మంబు దేవుఁ డెఱుఁగు
బలము గలవారలకె నిల్వ స్థలము గలదు. 514

గీ॥ ముల్లుతోఁ దీయవలయును ముల్లునెపుడు
ముల్లెతోఁ బొందవలయును ముల్లెనరయ
వజ్రమును గోయవలయును వజ్రముననె
తెలివి చేతనె తెలివిని దెలియవలయు. 515

కం॥ ఏ విధము చేతనైనను
జీవికి జీవనము గలుగఁ జేసెడి పురుషుం
డే వసుధ పుణ్య పురుషుం
డావుల మరలించువాఁడె యర్జునుఁడు కవీ! 51

పట్టెడోరెమేరు పెట్టనందునఁ గుక్క
దొంగతనము సేయుఁ దొంగిచూచు
మనుజుకంటె నద్ది మఱవదు మేల్సేయ ॥విశ్వ॥ 517

పుష్పవంతుల ద్యుతి మీఱు సహస్రార
కమల జనితమైన జ్ఞాన దృష్టి
ఫాలనేత్ర మనుచుఁ బలికిరి పెద్దలు ॥విశ్వ॥ 518

కక్కు వచ్చుచున్నఁ గళ్యాణ మొదవిన
నాఁగఁ బోవపెవ్వఁ డడ్డమైన
మనుజుఁడెంత వాని మహిమాతిశయ మెంత? ॥విశ్వ॥ 519

పిన్న వయసునందె పెనిమిటిని గఱవు
చేసికొనిన వనిత జీవితంబు
తల్లివేరు దెబ్బ తగిలిన వల్లిరా ॥విశ్వ॥ 220

గీ॥ పేదవారికిఁ బట్టెడు పెట్ట నేడ్చు
పాఁచిపీనుఁగు వేశ్యకుఁ దోచిపెట్టు
దానమొక్కింత సేయుఁగ దద్దరిల్లు
దండుగెంతైనఁ బెట్టు నీ ధర్మమేమొ! 521

ఆడనేర్చువాడిఁ బాడనేర్చినవారి
నొప్పులరసి కైత సెప్పువారి
నాదరించు వార లరుదైరి యాంధ్రిని ॥విశ్వ॥ 522

జలము కంటె మిగుల సాంద్రతగల వస్తు
వద్ది మునుఁగుచుండు నప్పునందుఁ
దేలికయ్యెనేని తేలురా నీటిపై ॥విశ్వ॥ 523

గీ॥ గ్రుడ్డి గవ్వయుఁ జేయని మడ్డినరుఁడు
దొడ్డవాఁడగుఁ జేతిలోఁ దుడ్డు గలుగ
ధర్మదీక్షకుఁ బ్రాణమ్ము ధారవోయు
పేదవానిని గుర్తింపలేదు జగము. 524

నరునకున్న యట్టి నాలుగు దశలలో
జవ్వనము వసంత సమయ సమము
దాని వృథయొనర్చు ధన్యుఁడు కాలేఁడు ॥విశ్వ॥ 525

సంపెఁగ మధువాన షట్పదమేగదు
కొలిమి తిత్తి కొఱకు కుక్క చనదు
ఆసలేని దెసకు నరుగునా దయ్యము? ॥విశ్వ॥ 526

గుణవిహీనులైన కొడుకుల జనియింపఁ
జేటు గలుగు, చెట్టుచెడెడు కొఱకె
కుక్కమూతి పిందె లొక్కొటఁ గల్గును ॥విశ్వ॥ 527

సిద్ధపురుషుఁడైన సిద్ధార్థు వ్యర్థుఁగా
వాడిపోసి విష్ణువనిరి తుదకు
నరములేని నాల్క తిరుగదా యెటులైన ॥విశ్వ॥ 528

భార్య కర్మవశత భర్త దుష్టుండైన
నతనితోడి కష్ట మాలికబ్బు
ఇనుముఁగూడ నగ్గికిసి దెబ్బ లబ్బవా? ॥విశ్వ॥ 529

ఇడుమలనెడి వార్ధిఁ బడి చింతపడు వాని
కీడు పెంపుసేయఁ గృషి సలుపుట
బావిఁ బడినవానిపై బండ వేయుట ॥విశ్వ॥ 530

కర్తకంటెఁ గార్యకర్తల రొద హెచ్చు
మూల విగ్రహంబు మూలనుండ
ఉత్సవ ప్రతిమలె యూరేగు చుండును ॥విశ్వ॥ 531

వండుమన్న యమ్మ వాపిరి గొట్టుని
తినుమటన్న యమ్మ తిండిపోతు
ఏదిలేని యమ్మ కేమాట రేదురా ॥విశ్వ॥ 532

రాజు మంచిదశను రాజ్యమొకటి గెల్వ
"కూలివాని" కొండు కూలి దొఱకు
గజము కరముఁ బీల్వ గతుకుటే కుక్కకు ॥విశ్వ॥ 533

శిల్పి చేతఁబడిన శిల దేవుఁడై వెల్గు
కొండనున్న బాయి కుధర శిలయె
మనుజు మహిమ హెచ్చు మౌని శిక్షణకల్మి ॥విశ్వ॥ 534

మొదటిరోజు చాల ముద్దుగా నుండును
మరుదినంబు కొంత మార్పు గలుగు
మూఁడు దినములున్న ముఱికి చుట్టంబగు ॥విశ్వ॥ 535

నందిఁ బందిఁ జేయుఁ బంది నందిని జేయు
బోకరించి యొకఁడు పొడిచి గెలుచు
నోరులేనివాని కూరెక్క డున్నది ॥విశ్వ॥ 536

రాజకీయమందు మోజు హెచ్చిన వాఁడు
కళల మీఁద దృష్టి నిలుప లేఁడు
నిలిపెనేని యతఁడు నిస్తుల కీర్తియౌ ॥విశ్వ॥ 537

డవ్వునున్న తరిను దత్త్వంబు తెలియమి
సరళ హృదయుఁ డనుచు జాటఁ గలవు
తోఁచు నునుపుగానె దూరపుఁ గొండలు ॥విశ్వ॥ 538

భాగ్యమెల్లఁ దొఁలగఁ బౌరుషవంతుడున్
హీనరూపు నట్లు కానఁ బడును
అగ్గి యారిపోవ బొగ్గు నల్పెగదా ॥విశ్వ॥ 539

ఎంత సున్నితముగ నెద మాఱిపోవునో
అంత దివ్యగుణము అబ్బునట్లు
వసుధ బొగ్గె మాఱి వజ్రమై వెల్గదా? ॥విశ్వ॥ 540

కష్ట సుఖము లన్ని కడచిన పిమ్మట
ఆత్మబోధ వలయు ననుట జలధి
అలలు నిలువ స్నాన మాడెద ననుకొంట ॥విశ్వ॥ 541

కం॥ ఇల్లాలు రాతి బ్రొఃను
పల్లభుపై భక్తిఁ జూపవలయును సుమ్మా
ధిల్లీకిఁ బోఖండైఃమ
తల్లికి మ్రొక్కంగ వలయుఁ దర్మము వేమా 542

చిన్నతనమునందుఁ జేసిన చేష్టలు
పెద్దయైన పిదప వింతలగును
తెలివి చిత్రమగును గలఁగను దృశ్యముల్ ॥విశ్వ॥ 543

అర్థశూన్యమైన యలజడుల్ గలచోట్ల
నున్నతంపు టూహ లుప్పతిలవు
ఒక్క పక్షి తిరుగ దుఱుముల మెఱుములు ॥విశ్వ॥ 544

కలి యుగాంత మెపుడొ తెలుపుము గుర్తన్న
నెన్నొ యున్నవైన నెఱుగు మొకటి
పాపుతల్లి నాల్గు పాదాల నడచుట ॥విశ్వ॥ 545

రాగమహిమ చేత ద్యాగమహిమ గల్గె
త్యాగమహిమఁ గల్గె రాగమహిమ
త్యాగ రాగమహిమఁ ద్యాగరాజై వెల్గె ॥విశ్వ॥ 546

కాల్రిలు నింటిపేరు కస్తూరి వారని
కొంప గబ్బిలాల కంపు గొట్టు
మాటహెచ్చెగాని 'మానిక పిచ్చురా' ॥విశ్వ॥ 547

బిచ్చమిడిన యమ్మ బిడ్డల గన్నమ్మ
పృథగఁ బోవరెట్టి వేళయందు
ప్రకృతి ధర్మమునకుఁ బ్రతిబింబమే గదా ॥విశ్వ॥ 548

తనదు కాళ్ళమీఁదఁ దానిల్వఁ జాలని
బడుగుమోయఁ గలఁడె పరుల బరువు
లేవలేని యెద్దు లేవి బండినిలాగు ॥విశ్వ॥ 549

స్రష్ట సృష్టియందు శిష్టులు దుష్టులు
జనన మొందు చుంట సహజమరయ
వారిరి వలవన్న మీరె వడఁగలవ? ॥విశ్వ॥ 550

హారమందు నిముడు దారము రీతిగా
భర్త మనసులోన భార్యమనసు
కలసి పోయెనేని కలతలు గలుగవు ॥విశ్వ॥ 551

ఊపిరుండఁగానె యోపిన మట్టుకు
దానములు నొనర్పఁ దగును నరుఁడు
పోవునపుడు రాదు పుచ్చిన వక్కైన ॥విశ్వ॥ 552

సంతుకొఱకు మిగుల చింతించు వారికి
సంతు నొసఁగు టరుదు సంతసింప
చాలునన్న యింట సంతాన మధికము ॥విశ్వ॥ 553

పంచ భూతములకు మించిన పెనుభూత
మొండు గలదు తెలిసి చెండవలయు
అది దురాశయనుచు నాడిరి పెద్దలు ॥విశ్వ॥ 554

చింతవెల్ల మాని యంతర్ముఖుండయి
బ్రహ్మ పథమునందుఁ బరగు యోగి
యిహ పరంబులందు బహుసుఖంబునఁబొందు ॥విశ్వ॥ 555

పనులు చెరచునట్టి పంద లెచ్చటనున్న
మాఱుఁబోదు బుద్ధి తీరఁబోదు
కోఁతు లెచటనున్న మూఁతు లొక్కటెగదా? ॥విశ్వ॥ 556

సత్యమెఱుఁగఁ జేయు సజ్జనుఁ డున్నచోఁ
జక్కఁబడును పెక్కు సంశయములు
అద్దమున్న బొట్టు దిద్దుకో ననువగు ॥విశ్వ॥ 557

తగిన యెరువు పెట్టి తగిన కాలువ త్రవ్వి
తగిన విత్తనములు ధరణిఁ జల్లి
బీడునేలలైనఁ గూడుగుడ్డ లొసంగు ॥విశ్వ॥ 558

గొప్పవాని వ్యాధి గోరెడైనను, బెద్ద
ముప్పు వచ్చినట్లు ముసురుకొండ్రు
బక్కవాని చావు లెక్కలోనికె రాదు ॥విశ్వ॥ 559

దమననీతిఁ జూపఁదగు వారిపై దయఁ
జూపెదేని పనుల సొగసు చెడును
పైత్యరోగి నోటఁ బంచదారయుఁ జేదె ॥విశ్వ॥ 560

కొట్టమందుఁ బోట్లగొడ్డుఁ గట్టుటకంటె
ఉత్తదిగనె కోష్ఠముంట మేలు
కల్లమాటకంటె ఘనమౌనమే మేలు ॥విశ్వ॥ 561

కానికాలమందు గడు జాగరూకత
మెలఁగుచున్న చెట్ట మొలకలెత్తి
కడగఁ బోవు నదియుఁ గాళ్ళమీఁదికె వచ్చు ॥విశ్వ॥ 562

బాలుఁడైన గొప్ప పాపాత్ముఁడైనచోఁ
గఠిన శిక్ష నంతు కనుఁగొనఁదగు
కొద్దిపామునైన బెద్దకఱ్ఱన కొట్టు ॥విశ్వ॥ 563

వీరు లుద్భవింప విప్లవమ్ము జనించు
వార్ధిమ్రోఁత నుచ్చ వర్షము పడు
తీతు వఱచి యూరఁ దీయును బ్రాణము ॥విశ్వ॥ 5

చదువుకొన్న తల్లి సంసారమును తన
తెలివిచేతఁ జక్క దిద్దుకొనును
కాన విద్య స్త్రీకిఁ గఱపుటయే లెస్స ॥విశ్వ॥ 5

పూర్వజన్మమందుఁ బొసఁగిన గుణములు
అంతరాత్మఁ గొంత యంటియుండు
నూనె కొలిచినట్టి మానిక రీతిఁగా ॥విశ్వ॥ 56

వినయ గుణము వలన విజయంబు జేకూరు
మత్సరంబు నరుల మచ్చమాపు
కలుపుగోలుతనము కళ్యాణ నిలయము ॥విశ్వ॥ 56

సంఘసేవ కొఱకు సంస్థల నెలకొల్ప
నూఱు చూటలైన నుడువ వచ్చుఁ
'గాణి' యాయుమన్నఁ గష్టమే గలుగును ॥విశ్వ॥ 56

ఎవరి తిండి వారి కేర్పాటు చేసియే
సృష్టికర్త నరుల సృష్టిచేయు
శిశువు పుట్ట పాలు చేపవా తల్లికి ॥విశ్వ॥ 56

విద్యయున్నచోట విత్తంబు శూన్యంబు
విత్త మున్నచోట విద్య సున్న
రెండు లేనిచోట తిండికే తిప్పలు ॥విశ్వ॥ 57

పుట్టుగ్రుడ్డి లోకమెట్టిదో యెఱుఁగడు
షండుఁ డెఱుఁగఁ డింతి సౌఖ్యములను
ఆత్మతత్త్వమహిమ నజ్ఞాని తెలియఁడు ॥విశ్వ॥ 571

"స్త్రీల కేల విద్య బాలురకే గాని"
యనెడి మాట లోకమరసి కాదు
ఆలు మగనికెన్న నర్థాంగియౌఁ గదా! ॥విశ్వ॥ 572

పనులు చెఱచునట్టి ఘనుఁడున్న మున్ముందు
చెక్క మ్రొక్కి పనికి సాఁగి పొమ్ము
ముందె విఘ్నపతికి మ్రొక్కమె పూజలో ॥విశ్వ॥ 573

పూలమాలఁ దాఁకి కాలసర్పంబని
గ్రుడ్డివాడు పొందు దొడ్డ భయము
దయ్యమనిన యట్లు తననీడఁ దాఁ జూచి ॥విశ్వ॥ 574

దానవాధముఁడు దయ లేని మనుజుండు
విద్య లేనివాఁడు వింత పశువు
నీతిలేనివాఁడు కోతికంటెను బీదు ॥విశ్వ॥ 575

పాదరసము క్రిందఁ బడినఁ జేఁ జిక్కదు
మనసు కట్టుద్రెంప మరలదు వెస
పోయెనేని సరిగఁ బొందదు తేజము ॥విశ్వ॥ 576

ఇరుగు పొరుగు వారి సిరిఁజూసి యేడ్వకు
నీకు భాగ్యమున్న నిక్కఁ బోకు
కష్టసుఖము లొక్క కావడి కుండలు ॥విశ్వ॥ 577

మోసగాని చెలిమి మోసగాఁడొనరింపఁ
బలుకు లెన్నియైన ఫలము సున్న
తాలుగింజ చవిటి నేల నాటినయట్లు ॥విశ్వ॥ 578

ఒకని లొంగదీసి యొకఁడు పైకెక్కుట
కుద్యమించుచుందు రుర్వి జనులు
మట్టి తాటి మొదటి మట్టఁ బుట్టిన యట్లు ॥విశ్వ॥ 579

వదులు సుతరమగును వడ్రింగి కెప్పుడు
చీలఁదీసి పగలి నేలు టమవు
శివునిగొల్వ ముక్తి చేరుట సులభము ॥విశ్వ॥ 580

పనిని జేయలేని పందయింటికి దొంగ
సాధు హింసకుండు సభకు దొంగ
సతము బడికిదొంగ చదువని బాలుఁడు ॥విశ్వ॥ 581

తపసి దివ్యశక్తి దాగియుండును ఆత్మ
వలసి నపుడుకాని తెలియఁ బడదు
నివురు గప్పియున్న నిప్పుచందము గదా ॥విశ్వ॥ 582

అచెడివేళ నాలుగన్నను సమయాన
కోడలనెడి కరుణ కొంత యుండు
నత్తముండ కంటె నత్తముండే మేలు ॥విశ్వ॥ 583

వనములందుఁ గష్టపడుచున్న ద్రౌపదిఁ
బట్ట సైంధవుండు పాటు పడుట
చీరియు పుండులోన నుప్పు కూరినయట్లు ॥విశ్వ॥ 584

పరమ సాధ్వియైన పాంచాలి కొఱకేగి
చిక్కెఁ బాండవులకు సింధురాజు
మేయఁ బోయినంత మెడ తగుల్కొని నట్లు ॥విశ్వ॥ 585

అనుభవించు నేర్పు తనకు లేనప్పుడు
భాగ్య మెంతయున్న ఫలము సున్న
కోతిచేతిలోని కొబ్బరి బొండ్లమే ॥విశ్వ॥ 586

కన్నవారి కీవు కడుపార బెట్టవేన్
నీకుఁ బెట్టరయ్య నీ కొడుకులు
తాతనాటి బొచ్చె తరతరాలకు నుండు ॥విశ్వ॥ 587

అవని జాత సీత యైశ్వర్యసముపేత
నిష్కళంక చరిత నింద పడుట
మడుగుఁ జీరయందు మసి దాఁకినట్టులు ॥విశ్వ॥ 588

దుష్టబుద్ధి శకుని దుర్యోధనుని వైపు
జూదమాడి గెల్వ మోదమేమి?
చిలుక కుప్పు గలిపి ఫలమొసంగిన రీతి ॥విశ్వ॥ 589

నిఖిల జీవి వికతి సుఖ దుఃఖములయందు
సమము; శక్తియందు సమముగాదు
సింహమునకు గ్రామ సింహము దీటౌనె? ॥విశ్వ॥ 590

ఆవులావు లెంతొ చేవఁ దారసిలంగ
నడుమ లేఁగ కాళ్ళు నలగినట్లు
నృపులు నృపులు పోర నిల్గును నులిసేన ॥విశ్వ॥ 591

తనువులందు బలము తగ్గిపోవక ముందె
భావి సౌఖ్యమునకుఁ బాటుపడుము
దీపముండఁ గానె దెవులాడు కొనవలె ॥విశ్వ॥ 59

ప్రజల మేలు కొఱకు పనిసేయు వీరుఁడు
ఇంటఁగూరు చుంట కిష్టపడఁడు
పోరుసేయు పుంజు పొదుఁగునా గుడ్లను ॥విశ్వ॥ 59

వేయిమంది నైన వేష మాకర్షించు
వేసమందుఁ గూడ మోసముండు
కల్మషమును దాచు కాషాయ వస్త్రముల్ ॥విశ్వ॥ 594

పచ్చిగడ్డిఁ జూచి పశువు సంతోషించు
మోహనాంగిని గని మురియు విటుఁడు
అజుని వెల్గుగాంచి యలరును వేదాంతి ॥విశ్వ॥ 595

ఎన్ని లక్షలున్న వేకుల బుట్టకే
ఎఱువు కేగవలయు నెప్పుడైన
లోటులేనివారు లోకంబులో లేరు ॥విశ్వ॥ 596

నీ గుణాల ముందు నిర్మలముగఁ జేసి
చక్కదిద్దు మింటి జనుల గుణము
మొదట యిల్లు గెలిచి పిదప రచ్చను గెల్వు ॥విశ్వ॥ 597

తనువు పోవువఱకుఁ దగిన యాహారంబు
నెట్లు కోరుకొనునా యట్లె విద్య
వాంఛనీయమౌట వయసుతోఁ బనియేమి? ॥విశ్వ॥ 598

మారజిత్తునందు మహిమ యేమున్నది
ఘనులు పొగడుటెల్ల కల్లయనుట
జలజహితునిలోన వెలుఁగు లేదన్నట్లు ॥విశ్వ॥ 599

ఇహము పరము గోరి యీశ్వరారాధన
సలుపువాఁడు మంచి సౌఖ్యమందు
భక్తిపథము పాపముక్తిపథమ్మురా ॥విశ్వ॥ 600

ఒక్క చెవిని వినుచు నొక చెవి విడిచెడి
నీచుఁ డెన్ని విన్నఁ నిష్ఫలంబె
ఎంతవాన కురియ నింకదా యిసుకపై ॥విశ్వ॥ 601

పేదవారిఁ గొట్టి పెద్దవారికిఁ బెట్టి
గొప్పతనము తనకుఁ గూర్చుకొనుట
కాకిమూకఁ గొట్టి గ్రద్దల కిడుటరా ॥విశ్వ॥ 602

బలమునందు నేస్గు పరుగెత్త గుఱ్ఱము
ఉన్న కొన్నిపనుల నుష్ట్రిమేతగు
సాయపడదె యొంటె సహరాయెడారిలో ॥విశ్వ॥ 603

గృహిణి పెత్తనంబు గృహమునందుండును
బయటి పెత్తనంబు భర్తకుండు
రెండు సరిగనున్న నిండిన యిల్లగు ॥విశ్వ॥ 604

సూర్యకాంతి యుండి చూడ నేత్రములుండ
అడుగుదీసి యడుగు నిడును గాన
దైవశక్తికి వలయు దనశక్తిందోడు ॥విశ్వ॥ 605

చెప్పఁదగిన మాట చెప్పఁగూడని మాట
అరసి పరులఁ గూర్చి యాడఁదగుము
పెదవి దాటెనేని పెన్నయు దాటురా ॥విశ్వ॥ 606

కప్పలఱచెనేని కడవలు నిండును
ఎత్తుగాలి తిరుగ నేరు పొంగు
చూలు గలిగెనేని తేలు చావ నిజంబు ॥విశ్వ॥ 607

సర్వ కార్యములను సాధింప నృపునకు
నొక్క మంచి మంత్రి యుండఁడేని
కొండయంత కరికి తొండము లేనట్లు ॥విశ్వ॥ 608

దుష్టమానవునకు దూరముగా నుండు
సఖుఁడ వగుట మేలు సజ్జనునకు
మతముకంటె మనుజు మనసె ప్రధానంబు ॥విశ్వ॥ 609

నింద సేసియైన నిద్రాణమైయున్న
జాతి మేలుకొలుపఁ జాలెదీవు
బుద్ధి సెప్పువాఁడు గద్దించి పలుకురా ॥విశ్వ॥ 610

మంచివారలస్థితి మరణకాలమువందుఁ
జూడుమనుచుఁ బెద్దలాడినారు
పండు పుచ్చకుండ పడుట మంచిది గదా ॥విశ్వ॥ 611

పాడిపంటలందు పల్లెటూళ్ళే గొప్ప
పట్టణములు గొప్ప పై మెఱుఁగుల
ఆత్మదర్శనముల కడవులే గొప్పరా ॥విశ్వ॥ 612

ఆశలన్ని విడిచి ఆత్మను ఐరికించి
మహిని విడుచువాఁడు మరల రాఁడు
సెనగపవ్వు మెక్కి చేఁ గడిగిన రీతి ॥విశ్వ॥ 613

చమురు వత్తి కలియ సరిగ వెల్గును దివ్వె
వేఱుపడిన రెండు వెలుఁగకుండు
సరస మెఱుఁగకున్న సతిపతు లంతేరా ॥విశ్వ॥ 614

వేరు పార్ఁకుకొలఁది వృక్షంబు పెరుగును
విద్య పెరుగుకొలఁది వినయ మబ్బు
కలిమి హెచ్చెనేని కనులు నెత్తికి వచ్చు ॥విశ్వ॥ 615

ధర్మమనెడి పేరధర్మమున కిఁ బెట్టి
యెదురు లేనివఱకు నేలఁ గలరు
దశ తొలంగ నెవఁడొ తలక్రిందు సేయురా ॥విశ్వ॥ 616

నీరు దొఱకువైపు వేరు పాఱుచునుండు
వెలుఁగువైపె మొక్క తల తిరుగును
దాత నరసి జనులు దరి జేరుచుందురు ॥విశ్వ॥ 617

మనము విడుచుగాలి మహి వృక్షములు పీల్చి
తగిన ప్రాణవాయువుగ నొనర్చి
యిచ్చుచుండు మనకు నీశ్వరు కృపచేత ॥విశ్వ॥ 618

గొల్ల యిండ్లనుండు గొఱ్ఱెల గోత్రాల
వరుస చెప్ప గొల్లవాని కెఱుక
పరమ శివుని లీల భక్తుని కెఱుకరా ॥విశ్వ॥ 619

తెలిసి కలియరాదు కలిసి తెలియరాదు
తెలిసి కలిసిన విడఁదీయరాదు
అంత్యనిష్ఠురంబు నరయఁగ మేల్గాదు ॥విశ్వ॥ 620

అత్త పత్తియాకు హస్తంబు డాసిన
మగని రాకఁ గన్న ముగుదవోలె
ముడుచుకొనును ఎవని ముదల నౌదలఁదాల్చి ॥విశ్వ॥ 621

ఉండియుండి తొండ యూసర వెల్లియౌ
చేసిచేసి తపము సిద్ధుఁడగును
పండిపండి పెద్దపాము గామౌనురా ॥విశ్వ॥ 622

కొలుచున్నకొలఁది కట్టె వేడెక్కును
చదువుచున్నకొలఁది సారమొలుకు
పొందుచున్నకొలఁది భోగకామము హెచ్చు ॥విశ్వ॥ 623

ఎవ్వడేని క్రొత్తదేదైన మొదలిడ
వంకపెట్టుచుందురు వచ్చి చూచి
విజయమొంద వారె వేనోళ్ళ నుతియింతురు ॥విశ్వ॥ 624

ఊర తేరతిండి ఒగి మఠమ్ములఁ బండి
బ్రతుకువాఁడు పనికి వంచఁ దొడలు
బడుగుటింటికంటె గుడి సుఖముగ నుండు ॥విశ్వ॥ 625

మనసు మదము మచ్చమాపిన సుజ్ఞాని
కోప మంతలోన రూపుమాయు
గడ్డినిప్పు లెంతకాలము నిలుచురా ॥విశ్వ॥ 626

నూఱుగుడ్డ నేవఁడు నూటేండ్లు కట్టడు
పండుటాకు రాలకుండ దెపుడు
పుట్టువున్న యపుడు గిట్టుట యుండురా ॥విశ్వ॥ 627

బ్రహ్మశిరము గొట్టి పరమేశుఁడైనను
పునుక బిచ్చమెత్తుకొనఁగ వలసెఁ
గోప మెవరికైనఁ బాపకారణమగు ॥విశ్వ॥ 628

ఒత్తుచుందురి జనులు మెత్తనివానినె
అమిత కఠినుజోలి కంత బోరు
రవికిఁ జంద్రుకంటె గ్రహణాలు తక్కువ ॥విశ్వ॥ 629

ఎఱుకలేమి తనువె యే నని తలఁచుచు
మరణ భయము వలన మది కలఁగుట
త్రాడు జూచి నల్ల త్రాఁచనుకొంటరా ॥విశ్వ॥ 630

పరుల కుఱిచ నరుఁడు పౌరుషమున్నచో
లేవవచ్చు మించి పోవవచ్చు
ఎంత విసిరికొట్ట అంత లేవదె బంతి ॥విశ్వ॥ 631

పాదు నీళ్ళుపోయ ఫలములు నీకిచ్చు
కొడుకుఁ బెంచ నిన్నుఁ గొడుకు పెంచు
పిలిచి చక్కఁగానె పిలిపించుకొనుమురా ॥విశ్వ॥ 632

సాత్త్వికమున సదిగ సమకూడి నట్టుల
రాజసమునఁ గలిసి రావు పనులు
వేడిగాలి తగుల వాడిపోవు ముఖాలు ॥విశ్వ॥ 633

పైకిఁ గానఁబడక లోకమాడఁగఁ జేయు
మేనులందు మెఱయు ప్రాణశక్తి
రాగి తీఁగలోన రాజిల్లు విద్యుత్తు ॥విశ్వ॥ 634

ఇంతికూటి కొఱకు వరుగిడు ముందుగా
పెద్దిమూట కొఱకు వెనుక నుండు
మనుచు పెద్ద లనిరి అది నీ సుఖమునకే ॥విశ్వ॥ 635

వానకాలమందు వలయు కూరలు వేఱు
ఎండకాలమందు తిండి వేఱు
అట్లు కానియెడల నారోగ్యమే మాఱు ॥విశ్వ॥ 636

ఇంటనున్న నల్వు రేక మనస్సుతో
వరల గృహము గుట్టు బైటఁబడదు
గోచరింపఁ గలదె గుప్పెట వస్తువు ॥విశ్వ॥ 637

లోకమెల్లఁ దానె లోఁ గొనవలెనన్న
ఆశతో మెలంగు నట్టివాఁడె
తమ్మఁ గొడుకు మించఁవండ్రిఁ కోరుచునుండు ॥విశ్వ॥ 638

౬౩॥ పరులను బాధల పెట్టక
పరులను తనవలెనె చూచువాఁడె సుమతియగా
పరహితమె తనకు హితమగు
పరమత పహావంబు ధర్మపథమగు వేమా 639

౬౪౦॥ మగవాని చేతి బిడ్డలు
మగువ కరంబున్న ధనము మనఁజాలదయా
జగమున స్త్రీల సుఖంబులు
పొగనీడల పోలె క్షణిక భోగములు కవీ! 640

హరుఁడు మేన నిల్పె హరివక్షమున నుంచె
బ్రహ్మ వాక్కునందె పరగఁజేసె
ఆలిమీద ప్రేమ అందఱు కుందురా ॥విశ్వ॥ 641

గీ॥ కుజనుఁడు కుతర్కమును జేయు, సుజనుఁడెపుడు
సౌమనస్యముతో సత్యసార మెఱుఁగు
బంభరము పూవుఁదేనెకుఁ బరుగులిడఁగ
పేడపుర్వు సదా పోవుఁ బేడకొఱకు. 642

కం॥ గురువుల సేవింపందగు
గురువులు వచియించినట్లు గుఱి నిల్పఁదగున్
గురువుల దీవన పొందుము
గురుజన ధిక్కారమెంత కూడని దన్నా! 643

కం॥ పోరాని యిండ్ల కేగిన
రారాని నికృష్టనింద రావచ్చు సతుల్
గారవము చెడని రీతిని
నేరుపుతో మెలఁగు టెంతొ నీతిర వేమా! 644

శౌర్యశాలి పరుల శౌర్యచిహ్నంబింత
లెక్కసేయకెంతొ ధిక్కరించు
కాఱుమేఘముఱుము గర్జించు సింహము ॥విశ్వ॥ 645

వస్తువెట్టిదైనఁ బనికివచ్చును దీరు
వర్తిభవలన మింట రథము రవికి
ఒక్క చక్రమున్న నుపయోగపడతేదె ॥విశ్వ॥ 646

పరుగువారి మంచి పాలు త్రాగుటకంటె
నీరు త్రాగిరైన నిల్కడొప్పు
తగిన నడక గెలిచెఁ దాఁబేలు కుందేటి ॥విశ్వ॥ 647

తిన్నకుక్క తింటితిని పోయినంతన
కన్నకుక్కఁ ఒట్టి కట్టినట్లు
ఎదురుపడ్డవాని కేర్పడు చిక్కులు ॥విశ్వ॥ 648

గండిపడిన నదులు గ్రామాలఁ జెఱచును
చెఱచు కాపురములఁ జెడిన యువతి
దిటవులేని మంత్రి దేశమే చెఱచురా ॥విశ్వ॥ 649

తోలుబొమ్మలాటఁ జోలు సృష్టి విధంబు
బొమ్మవచ్చి యాడి బొమ్మపోవు
హరున కెఱుక లేక ఆకులల్లాడవు ॥విశ్వ॥ 650

నష్టమైనఁ గాని కష్టమైనను గాని
మాటకొఱకు నిలిచి మనుట లెస్స
వచ్చినష్టి వాదు చచ్చినఁ బోదురా ॥విశ్వ॥ 651

గిల్లి జగడమాడు నిల్లాలి యింటిలో
కల్లగాదు సుఖము గలుగఁబోదు
చెద్దకంపు పొదలఁ జీదర పుట్టదా ॥విశ్వ॥ 652

నవ్యభావకలిత నానార్థయుతమౌచుఁ
జరుగునట్టి చిన్న వాక్యమొంట
తొట్టిలోన క్షీరతో యధి నింపట ॥విశ్వ॥ 652

గీ॥ చీడపురుగుల నన్నింటి చిదిమివైచి
యెరువు వేయుట తగు మొక్క పెరుగుటకయి
అట్టులే చెడ్డగుణముల నణచి ముందు
పిదప సద్గుణ సంతతి పెంచుమన్న! 654

పరిసరంబుఁ బట్టి పనిపాట లలవాట్లు
పెక్కు గలుగుచుండు చక్క మిడుత
యెట్టిగడ్డినున్న నట్టి రూపము దాల్చ ॥విశ్వ॥ 655

కలువు బిడ్డ- వానకాలమ్ములో గొడ్డు-
పతికి వీలుకాని సమయమందు
నతిథిరాక -చాల యగచాట్ల బేరము ॥విశ్వ॥ 656

గుణ్ణమునకు నులవగుగ్గిళ్ళు జీర్ణము
సరగ జీర్ణమగును గరికి వెలఁగ
ఉగ్గుపాలు జీర్ణ మయ్యాల బిడ్డకు ॥విశ్వ॥ 657

పశుని భావమెల్ల పరికింపకే ముందు
తూలనాడుటంత మేలుగాదు
తరచి తఁచి జనుల తత్త్వమ్ము తెలియుము ॥విశ్వ॥ 658

కఁ॥ హాటకగర్భుని దనలో
నూటిగఁ గని నిత్యసత్యశుభమందిన వాఁ
డేటికి నితరము గోరుం
గోటికిఁ బడగెత్తి ముష్టికొఱకుం జనునే? ॥విశ్వ॥ 659

బ్రహ్మపదవి దొఱక బాహ్యమెవ్వడు గోరు?
పాలరాతి గోడఁ బగులఁ గొట్టి
మట్టిగోడఁ గట్టు మానిసి యుండునా? ॥విశ్వ॥ 660

రసములన్ని చిలుక రమణీయముగ గులుక
తేటఁతేనెలొలుక తెలుఁగుపలుక
దేశభాషలందు దెలుఁగు లెస్సనిరయా ॥విశ్వ॥ 661

ప్రాంతపడినయట్టి పంచాంగములు పోప
చుక్క లెటకుఁబోవు దిక్కు వదలి
తనువు మాయ స్థిమిత ధర్మముల్ మాయునా ॥విశ్వ॥ 662

వక్కలాకులుండి యొక్కింత సున్నంబు
లేకయున్న పండలేదు విడెము
తగిన ప్రేమలేని దాంపత్య మంతెరా ॥విశ్వ॥ 663

ధ్రువుఁడు తపసు చేసి ధ్రువమండలము బొందె
కడపె దండధరు మృకండుకొడుకు
తపము వలనఁ జేయఁదగని దేదియు లేదు ॥విశ్వ॥ 664

మంత్రివర్గమునకు మంత్రోపదేశమ్ము
సేయు జ్ఞాని యేమిసెప్పెనన్న
ప్రజల మేలుకొఱకె పనిచేయుమని పల్కు ॥విశ్వ॥ 665

పనియు పాటలేక మనసును దేహము
నురక యుంచెనేని దురితమనక
చెడ్డ కృత్యములకు శీఘ్రముగా లోఁగు ॥విశ్వ॥ 666

కుక్క దాలిగుంటఁ గూర్చుండి చోరత్వ
మబ్బె కూడదన్న యట్లు; కుమతి
విన్నయంతపేపు విజ్ఞుఁడుగా మండు ॥విశ్వ॥ 667

ఈల్లిసేయఁ పనిని తల్లియుఁ జేయదు
వేఁప చేదుక్రిములు రూపుమాపు
దేనఁబుట్టు పురుగు దాననే హతమగు ॥విశ్వ॥ 668

ఇల్లుజూచి పిదప నిల్లాలి చూడుము
గుణములరసి చెలిమి కూర్చుకొనుము
తల్లిగుణము జూచి పిల్లను దీసికో ॥విశ్వ॥ 669

తెచ్చి చచ్చినాఁడు చచ్చి తెచ్చినవాఁడు
ముచ్చటాడుకొనిరి మురిసి దివిని
దార్లు వేఱయైన ధర్మమొక్కటె గదా ॥విశ్వ॥ 670

ఎంతనీరుపోసి యెరువెట్లు వేసిన
రాలనున్న ఆకు రాలిపోవు
ఔషధంబు లీయ ఆయువు కలుగునా? ॥విశ్వ॥ 671

కన్య కోరుచుండు కడు రమ్యమగు రూపు
ధనము గల్గువాని తల్లిగోరు
యశముఁ గూర్చువాని నాశించు జనకుండు ॥విశ్వ॥ 672

పరునిమాట నమ్మి భార్యకు బిడ్డకు
చెఱుపు చేయఁ దలఁచు చెనఁటి యెవఁడు
ఎలుకకొఱకు నింటి కెవఁడు చిచ్చును బెట్టు ॥విశ్వ॥ 673

తల్లికున్న ప్రేమ పిల్లలకుండదు
ధరణివోలె నన్ని తల్లియోర్చు
తల్లిమనసు వెన్న పిల్ల మనసు ఱాయి ॥విశ్వ॥ 674

చెంతఁజేరువారు చెప్పెడి మాటలే
సత్యమనుచు పనులు సలుపు నృపతి
ఎత్తువారిచేతి పొత్తుల బిడ్డఁడు ॥విశ్వ॥ 675

పండ్ల చెట్ల దోటి పడవేసి కోతుఁడు
పెట్టు వాని బాధ పెట్టుచుందు
పాలొసంగు గోవు బంధబాధలు పడు ॥విశ్వ॥ 676

చదవి సద్గుణముల సాధించు ధీరుల
విలువ పరమమూర్ఖు తెలియ లేఁడు
గంధపుఁబొడి కావి గాడిదే మెఱుఁగును? ॥విశ్వ॥ 677

కోర్కెలారసి కొన్న కోలాహలము పుట్టు
గాలిసుడులు తిరుగ కదలి యుడలు
గర్వమడరచెడ్డ గగ్గోలు హెచ్చురా ॥విశ్వ॥ 678

దోషరహితు మీఁద దోషమారోపించి
పరిహసింపఁ బోయి పతితుఁ డగుట
కవిసి తన్నఁబోవ కాలు జారినయట్లు ॥విశ్వ॥ 679

పట్టుకొన్న దెల్ల బంగారమగుచుండు
కలసివచ్చునట్టి కాలమందు
ఆడఁబోవు తీర్థమది యెదురైనట్లు ॥విశ్వ॥ 680

'లంచగొండి' ధనము లాగుటకై లేని
తప్పుచెప్పి చేయితాన చాచు
వ్రేలు వంకబెట్ట వెన్న పూన లభించు ॥విశ్వ॥ 681

తిండిలేని ప్రజకు స్థిమిత మెట్లుండును
కడుపుఁ జిచ్చు తమ్ము కాల్చునవుడు
కాలుగాల పిల్లి కదలక నిల్చునా ॥విశ్వ॥ 682

గుణవిహీను లోటు కోవిదుల్ గమనించి
తిప్పమందు మంచి విప్పిచెప్పి
చెడిన అంగమునకె చేయుదురు చికిత్స ॥విశ్వ॥ 683

ముందె బెదరకుండ మూఁడడుగులడిగ
గుజ్జు ముజ్జగాల గుంజుకొనియె
పొట్టివాని కుండు పుట్టెడు బుద్ధులు ॥విశ్వ॥ 684

వింత యుక్తులన్ని వేశ్యమాత కెవండు
బోధసేయవలయు బాధయనక
తాత కెవ్వఁడైన దగ్గులు నేర్పునా? ॥విశ్వ॥ 685

గ్రీష్మఋతువునందు గ్రిందికేగిన నీరు
వర్ష కాలమందు వచ్చు పైకి
అండచిక్క నరుఁడు కొండెక్కి నిక్కురా ॥విశ్వ॥ 686

కయ్యమెపుడు గోరు గయ్యాళిగంపయౌ
నాతినాతె? చుప్పనాతిగాని
అట్టిదాని చెల్మి అగ్గిమండెడు కొల్మి ॥విశ్వ॥ 687

మంచిమాటలెల్ల మహిత మర్యాదకే
కోటివిద్యలెల్ల కూటికొఱకె
సుతులు కలుగుటెల్ల గతులు చేకుఱుటకె ॥విశ్వ॥ 688

విరహబాధచేత కరఁగెడివారికి
విధుని కిరణతతియు వేడియగును
పైత్యరోగి నోటఁ బంచదారయుఁ జేదె ॥విశ్వ॥ 689

నాల్క లేని గంట నాదమ్ము నీయదు
సుదతిలేని యింట సుఖము లేదు
తావిలేని పూవుఁ దాల్ప నిష్టము కాదు ॥విశ్వ॥ 690

కలుపుగోలుతనము కళలీను రతనము
ఖేదమొసఁగు రద్ది ఖేదబుద్ధి
దీక్షగలుగ నయము రక్షించు ననయము ॥విశ్వ॥ 691

పుట్టెఁ డాముదమున మునిఁగి బూడిదఁ బొర్ల
అంటవలసినంతె అంటుకొనును
ఆర్జనమ్మదృష్ట మనుసరించియె యుండు ॥విశ్వ॥ 692

ఇహపరమ్ములందు బహు సుఖములఁ బొందు
భోగి యొకఁడు పరమయోగి యొకఁడు
చెప్పఁదగినయట్టి శ్రీగలవారురా ॥విశ్వ॥ 693

పంది యీనుచుండ పదిపిల్లలను గూడ
ఏనుఁ గొక్కదాని నీనుచుండు
ఉద్ధరించు కొమరుఁ డొక్కఁడు చాలఁడా ॥విశ్వ॥ 694

కల్లగాదు చిన్నపిల్లల హృదయంబు
కపట శూన్యమగుచుఁ గాంచుచుండు
ముఱికి యంటనట్టి ముకురంబు రీతిరా ॥విశ్వ॥ 695

పెదవిమీఁద నవ్వు హృదయాన విసమును
కలిగి కపటి పైకి కానఁబడఁడు
నోరు మాటలాడ నొసలు హేళనసేయు ॥విశ్వ॥ 696

ఆశ్రయంబు లేక అభివృద్ధి శూన్యంబు
పండితులకు, లతకు వనితలకును
మెట్లు దొఱకకున్న మేడెట్లు లెక్కనౌ ॥విశ్వ॥ 697

పవనమందు నున్న ప్రాణవాయువు, తేమ
తగుళ్ళఁ దుప్పివట్టి తఱుగు నినుము
నరుఁడు వలపుగాలిఁ గరఁగుచుండును మెల్ల ॥విశ్వ॥ 698

అస్థిపంజిరమున ఆకార మేర్పడు
గుండెయాడు బొఱుచుండ నల్ల
ఊసురు లుండువఱకు ఉచ్ఛ్వాస నిశ్వాస ॥విశ్వ॥ 699

ఎన్ని తగవులున్న నెఱిఁగి చివఱకెట్లొ
ఎవనిపైపు వాఁడె యేగుఁ బుడమి
మెలిక తిరిగి కడకు చిలువ బొక్కంజేరు ॥విశ్వ॥ 700

ఆదిశక్తి యైన హైమవతిని బట్ట
అల జలంధరుండు కులుకు టెన్న
మిడుత యుంగలమును మ్రింగఁ జూచిన రీతి ॥విశ్వ॥ 701

ఎఱిఁగి పిన్న పెద్ద లేరీతి వర్తింపఁ
దగునొ యట్టులుంట ధార్మికమ్ము
తెగువ చేసెనేని తెడ్డె లింగముగదా ॥విశ్వ॥ 702

పైకిఁ గానఁబడక లోకమాడఁగఁ జేయు
మేనులందు మెఱయు ప్రాణశక్తి
రాగి తీఁగలోవ రాజిల్లు విద్యుత్తు ॥విశ్వ॥ 634

బఁతికూటి కొఱకు పరుగిడు ముందుగా
వెట్టిమూట కొఱకు వెనుక నుండు
మనుచు పెద్ద లనిరి అది నీ సుఖమునకే ॥విశ్వ॥ 635

వానకాలమందు వలయు కూరలు వేఱు
ఎండకాలమందు తిండి వేఱు
అట్లు కానియెడల నారోగ్యమే మాఱు ॥విశ్వ॥ 636

ఇంటనున్న నల్వు రేక మనస్సుతో
వరల గృహము గుట్టు బైటఁబడదు
గోచరింపఁ గలదె గుప్పెట వస్తువు ॥విశ్వ॥ 637

లోకమెల్లఁ దానె లోఁ గొనవలెనన్న
ఆశతో మెలంగు నట్టివాఁడె
తమ్ముఁ గొడుకు మించఁదండ్రికోరుచునుండు ॥విశ్వ॥ 638

కం॥ వరులను బాధల పెట్టక
పరులను తనవలెనె చూచువాఁడె సుమతియౌ
పరహితమె తనకు హితమగు
పరమత సహనంబు ధర్మపథమగు వేమా 639

కం॥ మగవాని చేతి బిడ్డలు
మగువ కరంబున్న ధనము మనఁజాలవయా
జగమున స్త్రీల సుఖంబులు
పొగనీడల వోలె క్షణిక భోగములు కవీ! 640

కట్టి విఱుగకుండ శెట్టియుఁజాకుండ
ఒప్పుతప్పు లెట్లు చెప్పఁగలవు
ధర్మమున్నవైపు ధైర్యముతోఁ బల్కు ॥విశ్వ॥ 710

మామయొక్క వైపు మగఁడొక్క వైపును
అత్తయొక్కవైపు మొత్తుచుండ
ఎట్టికోడలైన నేరీతి నోర్చురా ॥విశ్వ॥ 711

కల్లగాదు పరుల కాంక్షలు దీర్తురు
ధీరవరులు తమ్ము కోరకున్న
మేఘుఁడెవరు బిల్వ మేదిన వర్షించు ॥విశ్వ॥ 712

ధర్మనిరతిఁ బూని నిర్మలమతితోడ
దైవశక్తి నమ్మఁ దప్పకదియె
కంటిఱెప్పవోలెఁ గాపాడదా నిన్ను ॥విశ్వ॥ 713

గొప్పవానిఁ జూచి కొంచెపు నరులెట్లొ
వాగుచుందురి వావి వరుసలేక
కుంజరమును జూచి కుక్కలు మొఱుగవా ॥విశ్వ॥ 714

పరమమూర్ఖు చెంతఁ బరమాత్మఁగను యోగ
ఘనత యిట్టిదనుచు కనఁబరచుట
అంధునెదుట పెద్ద యద్దము చూపుట ॥విశ్వ॥ 715

కాలమునకు లొంగి కనుగల్గి మెలఁగుట
బాగు;శీతువేళ భాస్కరుఁడె
చలికి బాధపడుచు చయ్యన నేగురా ॥విశ్వ॥ 716

వరుసఁ దిన్నయంటి వాసాలు లెక్కించు
వారు కొందరుందురు వసుధయందు
సొమ్ము తిన్నవాఁడె బొమ్ము గుద్దినయట్లు ॥విశ్వ॥ 717

అడిగినంత యిచ్చు యజమాని యింటిలో
దొంగతనము సేయ దొరకొనుటది
పిదుకుకొనుట మాని పొదుగు కోసినయట్లు ॥విశ్వ॥ 718

పెద్దవారుగాని పిన్నవారలుగాని
హద్దుమీఱి యాడ హాని గలుగు
కట్టులేని నోరు గట్టుతెగిన యేరు ॥విశ్వ॥ 719

కష్టసమయమందె కష్టముల్ గలుగును
సుఖములందె గొప్ప సుఖము అబ్బు
ఎండకాలమందె మందుగాల్పులు వీచు ॥విశ్వ॥ 720

గొప్పవాని ప్రక్క కొంచెపు నరులున్న
లెక్క కెక్కకుంట అక్కజంబె?
సూర్యుడున్న దిక్కు చుక్కలు తోఁచునా? ॥విశ్వ॥ 721

సొమ్ములగును తీగ కమ్మచ్చు తం బడి
ఒదుగు శిక్ష బడ్డ ఒప్పులరసి
చిక్కుఁదీయ కురులు చక్కగా జడకొప్పు ॥విశ్వ॥ 722

మంచిమాటలు విని మన్నింపఁ డెంతయు
దుష్టబుద్ధి లొంగు దుష్టచేష్ట
వజ్రమరసి కోయవలె వజ్రముననెప్డు ॥విశ్వ॥ 723

దూరవస్తువెఱుఁగ దుర్భిణీ యంత్రమ్ము
ఆత్మరూపము గన అచలయోగ
మఖిల జనుల మంచి కడకువ చాలురా ॥విశ్వ॥ 724

లోతు తెలిసికొనక లోకులు మాటాడ
నిందసేయఁబోకు నివ్వెఱపడి
నిజము తెలియఁగలరు నిలుకడ యున్నచో ॥విశ్వ॥ 725

తుక్క తుప్కులనఁగ నుగ్రరణంబుల
సిక్కులరుల నురుము సేయఁగలరు
సిక్కులనఁగ వీరసింహములనఁ జెల్లు ॥విశ్వ॥ 726

తనకు నీయఁబోవ తాఁ దినవొల్లక
అదియె పరుని చేతి దడిగి కొనుట
రొట్టెఁ బెట్టఁ దినక తోలునాకిన యట్లు ॥విశ్వ॥ 727

రాజపుత్రునింట తేజోవిహీనుండు
పుట్టఁబోఁడు భీతి గిట్టఁబోఁడు
పులికి మేఁకపిల్ల పుట్టునా యెపుడైన ॥విశ్వ॥ 728

తిండిలేక చాల తిప్పలు పడువేళ
కర్మ రోగియగుట, కలువులోన
అధిక మాస మొకటి అరుదెంచి నట్టులు ॥విశ్వ॥ 729

కలుములన్ని తనకుఁ గలసివచ్చుచు నున్న
విబుధుఁడెపుడు పొమ్ము విఱుఁవబోడు
ఏర్లుచేర బొంగిపార్లునా వారిధి? ॥విశ్వ॥ 730

తొంటిబాధ యింటి కొంటికొయ్యలబాధ
పంటిబాధ పిప్పిపంటిబాధ
చంటిబాధ తోడ సమములు గావురా ॥విశ్వ॥ 731

శ్వనములందు పికము సానము శ్రావ్యము
కళలయందు లలితకళలు మెఱుగు
జగతి ప్రాణులందు మగజాతి అందము ॥విశ్వ॥ 732

ఓడవర్తకమున నొదవిన నష్టంబు
వడ్డదంపకమునఁ బాయఁ గలదె
జలధిలోని నీరు చలిమంట కింకునా ॥విశ్వ॥ 733

కొద్దినోము నోఁచి గొప్పఫలము గోరఁ
గలుగఁబోదు కర్మ తొలఁగఁ బోదు
పిండికొలఁది రొట్టె తిండికొలఁది కండ ॥విశ్వ॥ 734

ఆదరించి వృత్తి కవకాశ మిప్పించి
పట్టివాని కొక్క హానిసేఁత
అన్న మిడిన యంటఁ గన్నంబు వేయుట ॥విశ్వ॥ 735

దురభిమానమునకుఁ గరములోఁ బడిపోయి
తాఱు మాఱుపడుచుఁ దగవుతప్పి
తనదు మనసు మాఱ ధర్మంబు మాఱునా ॥విశ్వ॥ 736

ఒకనితప్పు పైకిఁ బ్రకటితమైన, వే
ఱొకని తప్పు లోన నొదిగియుండు
పార్థిమన్న మిట్టివల్లంబు లట్టుల ॥విశ్వ॥ 737

వార్ధిపోటు హెచ్చు బడబాగ్ని రేగిన
కోపమొదవఁ దనువు కొంత పొంగు
వేడిచేయ నుబుకవే లోహపుంగుండ్లు ॥విశ్వ॥ 738

ఖనవారికింత ఆకులో వడ్డించి
కానివారికిడును కంచుమందు
ఎడ్డెమనుజుఁ డేమి యెఱుఁగురా ధర్మంబు ॥విశ్వ॥ 739

వ్రాయవ్రాయ గొప్ప వ్రాయసకాఁడౌను
చేయఁజేయ నొడలి చేవ హెచ్చు
తఱచఁదఱచ దివ్యతత్త్వార్థవిదుఁడౌను ॥విశ్వ॥ 740

కామతృష్ణ తగిలి కలఁచె దేనిమనస్సు
రెచ్చగొట్టు నిమ్ము రేపుమాపు
జిలుకు గోకుకొలఁది జిలబొబ్బ రేగదా ॥విశ్వ॥ 741

ఎవ్వఁ డెంత పొంద నీశ్వరు దయవలె
పాంచభౌతికరము పలుచఁబడదు
నీరు చేఁప త్రాగ నీరధి తఱుగునా ॥విశ్వ॥ 742

అండలేనివాఁడె అణగారిపోవును
అండయుండె నేని కొండప్రాఁకు
విష్ణువుంటఁగాదె విజయుఁడు జయముందె ॥విశ్వ॥ 743

ఉల్లిపొరలమొత్త మూడదీసినయంత
జివఱకెద్ది చేతఁజిక్కినట్లు
ఆశలన్ని యుడుగ నవ్వల మోక్షమే ॥విశ్వ॥ 744

కిరణజన్యసంయోగంబు జరుగునపుడు
ఆమ్లజని యాకువిడి మాయమైనయట్లు
కుండలిని జెక్కఁబట్టుట కుదిరెనేని
మాయకోరికలన్నియు మాయమగును 745

త్రాగుబోతు నోటఁ దాఁటుమాఱగు మాట
జ్ఞానినోట నిలిచి పూనికఁగను
వ్యక్తి గౌరవంబు వ్యక్తమౌ మాటలో ॥విశ్వ॥ 746

తిండి తినుటకు వీలులేకున్న యెడల
వేమి లాభము నరునకు నెంతయుండి
తినినదానిని జీర్ణించుకొనినవాఁడె
అనఘుఁడని చెప్పుటకు సంశయంబె వేమా! 747

పెక్కు మంత్రసాను లొక్కెడఁ జేరిన
పెద్దప్రాణికెంతొ పెద్దచిక్కు
ఫలమొసంగుటరుదు బహు నాయకత్వంబు ॥విశ్వ॥ 748

నరునిఁజూచి పాము నరుఁడు పామునుఁజూచి
ప్రాణభయముతోడఁ బరుగు భంగి
పుణ్యపాపములకుఁ బొసఁగును వైరమ్ము ॥విశ్వ॥ 749

"కోడుకోడు" అన్న కొండిముడిచి యాఁగు
తేలుకేమి తెలియుఁ దెఱఁగుబాస
భయముచేతఁగాని భక్తిచేఁ గాదురా ॥విశ్వ॥ 750

పరులసొమ్ము మనకు బ్రాప్తింపవలెనను
ఆశయుండఁదగదు లేశమైన
కామవీవమైన కష్టార్జితము మేలు ॥విశ్వ॥ 751

అతి సమర్థుఁడైన యవనీశుఁడుండఁ డేన్
గువలయంబు వంచకులకుఁదక్కు
అడరి నక్కలేలు హరిలేని యడవిని ॥విశ్వ॥ 752

జీవనమ్ము నిచ్చు జీమూతమే పిడు
రాల్చియొక్కచెట్టుఁగాల్చివేయు
కానివేళ హితుఁడె కడకుఁ గీ డొనరించు ॥విశ్వ॥ 753

తనదు బూజుతాఁటఁ దాఁ జిక్కి ప్రేలాడు
సాలెపురుగు భంగి సంచితమున
జీవులన్ని జిక్కి జీవయాత్ర నటించు ॥విశ్వ॥ 754

ఆయువంతులు మనకృషి నాచరించి
వదలవలయును నేడవవంతు విధికి
కష్టపడుటకె చేతులఁ గాళ్ళ బుద్ధి
నిచ్చె భగవంతుఁ డని మది మెచ్చవలయు 755

నీవు సేయు పనుల నీ యదృష్టదశమ్ము
తోడుపడక ఫలము కూడదెపుడు
వట్టిచేతఁ బిండఁ బసరెట్లు వచ్చురా ॥విశ్వ॥ 756

క్రొత్తగుడ్డ తడిని కొంచముగాఁ బీల్చు
ప్రాఁతగుడ్డ పీల్చు బాగుగ తడి
ననుభవమున శక్తి యధికమౌట నిజంబు ॥విశ్వ॥ 757

సుందరాంగి తన్నుఁ జూచి మోహించిన
శుకుఁడొకండు భీష్ముఁడొకఁడు తప్ప
నిప్పువంటివాఁడు నీరయిపోవఁడా ॥విశ్వ॥ 758

చాలకాలముండుఁ జందనపుం గొయ్య
ఇనుము గట్టిదైన మనదుమట్టి
పాత్రమెఱిఁగియీవి క్షేత్రమెఱిఁగి విత్తు ॥విశ్వ॥ 759

తెలిసి కలియరాదు కలిసి తెలియరాదు
తెలిసి కలిసి యెదలు కలఁచరాదు
విశ్వగమనమెల్ల విధివిచిత్రముగదా ॥విశ్వ॥ 760

నరుల కేమి దేవ వరులకైనను గష్ట
సుఖములుంట మనము చూడఁగలము
ఈశుశిరము శశికి హెచ్చుతగ్గులు లేవె! ॥విశ్వ॥ 761

నిత్యసాధనమున నిపుణత హెచ్చును
నూరకున్న మొద్దు పారుచుండు
ప్రతిదినమ్ము నూఱఁ బదనెచ్చుఁ గత్తికి ॥విశ్వ॥ 762

కల్పాంగు సుఖము కలకాలముండదు
అమృతసుఖము నిల్చు ననవరతము
ఐహికంబు విచలమాధ్యాత్మ మచలము ॥విశ్వ॥ 763

ఆశలన్ని యుడిగి అచ్చలపూర్ణానంద
మందె నిలిచి యైక్యమైనవాఁడు
మోక్షమందుఁ గాని పుట్టఁడు గిట్టఁడు ॥విశ్వ॥ 764

వాయుకుండమెచట వారధిఁ బుట్టునో
అచట గాలివాన యతిశయించు
తోఁకచుక్క పుట్టఁ దోఁపవా యాపదల్ ॥విశ్వ॥ 765

ఆత్మశక్తియున్న యధికారి యాజ్ఞను
వేగ ననుసరింతురి వేయిమంది
ఒక్క బెట్టు నొక్క పెక్కు దివ్వెలు వెల్గు ॥విశ్వ॥ 766

పొసంగ వానవేళ పూఁదోట మొలచిన
మొక్కలన్ని పూలమొక్కలౌనె?
ఒక్క వంశ్య అందఱొకరీతి నుందురా ॥విశ్వ॥ 767

పానమన్న నొకఁడు గానమన్న నొకండు
చిత్రమన్న నొకఁడు చిత్తమిచ్చు
జిహ్వకొక్క రుచియు శిరమున కొకబుద్ధి ॥విశ్వ॥ 768

చెట్టు గొట్టుపిట్ట చెట్టుతొఱ్ఱగఁ జేసి
అందు దొఱకు పురుగులన్ని తినుచు
పిట్ట యెంత దాని పట్టుఁదలెంతరా ॥విశ్వ॥ 769

ప్రకృతియందుఁ బుట్టు పరమాణువునకైన
దేని సహజగుణము దానికుండు
పికము శుకము గాదు శుకము పికము గాదు ॥విశ్వ॥ 770

మంచిచెట్టలెన్న మతిలేని భూజమే
నిత్య మెండనుండి నీడనిచ్చుఁ
బరున కంతకంటె బరమార్థ మున్నదా ॥విశ్వ॥ 771

నేలయునికిఁ బట్టి నీటి వసతిఁ బట్టి
సీతువేఁడి వాన స్థితులఁ బట్టి
పరిసరమును బట్టి పెరుగును వృక్షముల్ ॥విశ్వ॥ 772

ఎచట బ్రతుకుఁదెఱువు లేర్పడియుండునో
యచట కేగుచుందు రఖిల జనులు
సూర్యరశ్మి వైపుఁ జొఱఁబడు మొక్కలు ॥విశ్వ॥ 773

పండ్లదారి నైన ముండ్లదారిని నైన
పాదరక్ష లున్న భయము సున్న
కలుగు సుఖము శాంతిఁ గలిమిలేముల జంతి ॥విశ్వ॥ 774

వర్ణ నాత్మకముగ వాక్కొను పండితు
లినుని కిరణవితతి నిమిడియున్న
సప్త వర్ణములనె సప్తాశ్వము లనిరి ॥విశ్వ॥ 775

వెఱవు తెఱవు లేని వెఱ్ఱిదద్దమ్మలు
కూడినట్టి కొంప కూలిపోవు
కంబములు తొలఁగఁ గప్పెట్లు నిలుచురా ॥విశ్వ॥ 776

చింతలేనివాఁడు శ్రీహరి తుల్యుఁడు
భ్రాంతిలేనివాఁడు బ్రహ్మ నిభుఁడు
భయములేనివాఁడు పశుపతి సముఁడురా ॥విశ్వ॥ 777

ధర్మసూక్ష్మమరయఁ దఱముగాదెల్లఱ
కందుకొనఁగఁ బ్రజ్ఞ యపరమ్ము
ప్రజ్ఞలేనివాఁడు సుజ్ఞాని కాలేఁడు ॥విశ్వ॥ 778

ఎగ్గుసిగ్గు లేని హీను రానిచ్చిన
పీఁటకిందిది మట్టి పిదిలఁ జేయు
ఘోటి యెచటనైనఁ గుద్దలింపదె నేల ॥విశ్వ॥ 779

ప్రిజ్ఞా ధురంధరుండగు
సుజ్ఞానికి నెచటనైన చోటుండునురా
జిజ్ఞాసువిది తలంచి బ్రి
హ్మజ్ఞాన సమాధి నంది నలరును వేమా ॥విశ్వ॥ 780

వదరుఁబోతు తోడ వాగ్మికిఁ బొత్తేడ
సానితోడఁ జెలిమి సాధ్వికేడ
మూర్ఖుతోడఁ బొందు మోక్షార్థి కేడరా ॥విశ్వ॥ 781

అంతరాత్మ తెలుపునట్టిది గట్టిది
యోగికైన పరమ భోగికైన
దాని బోధవిన్న ధన్యుఁడ వగుదన్న ॥విశ్వ॥ 782

వైరకారణమ్ము వాదియుఁ బ్రతివాది
వాక్కులరసి తీర్పు వాకొనఁదగు
పక్షపాతమెందుఁ బనికిరాదని విందు ॥విశ్వ॥ 783

వావివరుస లేకి వాస్తవ మెంచక
తిట్టునట్టి నోటిఁ దిరుగుకాలి
నూరకుఁడుమనుట యురిశిక్ష వేయుట ॥విశ్వ॥ 784

ఎట్టి సాహసమున నెసఁగు నరుండైనఁ
దాను జచ్చుమందుఁ దాఁ దినండు
పౌరుషంబుఁ జూప బడబాగ్ని మ్రింగునా ॥విశ్వ॥ 785

చేరుకొనెడివన్ని చెట్టులు చేమలు
గూడుకొనెడివన్ని గుండ్లునాగ
నెట్టివానిచెంత నట్టివాఁడె చేరు ॥విశ్వ॥ 786

జోలిమాలిన పని జోక్యంబు కలిగించు
కొనుట యెరికైనఁ గూడదన్న
మేకుఁబీకి కోతి మృతినొందలేదొకో ॥విశ్వ॥ 787

కం॥ విజ్ఞాన విలోకమునకుఁ
బ్రజ్ఞానమె బ్రహ్మమగుచు భాసిల్లంగా
సుజ్ఞానమె సూర్యోదయ
మజ్ఞానమె యంధకార మరయఁగ వేమా! 788

ఎందఱెన్ని మాట లేరీతిఁ బల్కిన
బీరువెన్నఁడైన వీరుఁడగునె!
నాటుకుక్కఁ దఱుమ వేటాడఁ జాలునా? ॥విశ్వ॥ 789

పిల్లవానిమీఁదఁ బ్రేమ యెక్కువ చూప
నెఱిఁగి వాఁడు మీఁదు కెక్కఁ దలఁచు
శిక్షణమునఁ గాని శీలమ్ము కుదరదు ॥విశ్వ॥ 790

పట్టువేల లెన్ని గొట్టులు తనకున్న
అనుభవమున కింత యందఁబోవు
మనసు లేని మగఁడు మంచము నిండురా ॥విశ్వ॥ 791

నవ్వు చేటుగూర్చుఁ నాలుగు విధములఁ
గోప మంతకంటె గోరతరము
శాంతమొండె సౌఖ్య సామ్రాజ్య సమ్రాట్టు ॥విశ్వ॥ 792

పొట్టకూటి చదువు మిట్టిపడం జేయు
గట్టిచదువు మనసు దిట్టపఱచు
నిండుకుండ కదల కుండు టాశ్చర్యమా ॥విశ్వ॥ 793

గ్రామసీమలందుఁ గాఁపులు కరణాలు
తప్పులరసి తీర్పు చెప్పిరేని
పాడిపట్టుతోడఁ బని యేమి యున్నది ॥విశ్వ॥ 794

వాయుకుండ మెచట వార్ధిఁ బుట్టిన నట
గాలివాన గొట్టు కల్లగాదు
ఎచట పాపమున్న నచట కష్టములుండు ॥విశ్వ॥ 795

జీవహింప మాని జీవింప వీలైన
జీవహింస నేల చేయువలయుః
భూతదయ యొకండు పుణ్యతమం బండ్రు ॥విశ్వ॥ 796

దైవభక్తి కలిగి తన్మయత్వము పొంద
సాధనమ్ము గాగ సలిపెదేని
కళలు కలలు గావు కైవల్య పథములు ॥విశ్వ॥ 797

జ్ఞానశూన్యమైన జాతి కత్యున్నత్య
పదవి దొరకదెంత పాటుపడిన
మణితెలుంగు రాయి మకుటము నెక్కునా ॥విశ్వ॥ 798

సింహముండు గుహను చెలఁగి ముత్యములుండు
వక్కబొక్క పీక తొక్కలుండు
గొప్పవారి బుద్ధి గొప్పయూహలె యుండు ॥విశ్వ॥ 799

చెడ్డచెలిమి చేసి శిశుపాలుఁ డుడుటన
హరిని దూరి ప్రాణహాని బొందె
పొంగుపొంగుటెల్ల పొయ్యి పాలగుటకే ॥విశ్వ॥ 800

దొంగబ్రతుకు బ్రతుక దొర సమ్మతింపఁడు
దొరగుణములు దొంగ యెఱుఁగలేఁడు
బూటకమున కెన్నొ బాటలు కలవురా ॥విశ్వ॥ 801

పోతుటీఁగయైనఁ బోరాని లంకకు
నాంజనేయుఁ డరిగె నబ్బురముగ
సహజశక్తి కొంత స్వామిభక్తి మరింత ॥విశ్వ॥ 802

బోధచేసి యెన్ని బాధలు పెట్టిన
సహజ గుణము మారజాల దెపుడు
కుక్కతోఁక నెవఁడు చక్కచేయఁగ నేర్చు ॥విశ్వ॥ 803

చదివి జీవితమున సద్గుణ జాలమ్ము
లమలు పరుపలేని యధము చదువు
కనులు లేనివాని కరదీపిక విధంబు ॥విశ్వ॥ 804

తులువ కప్పొసంగి పలుమారు లడిగిన
కయ్యమున కతఁడె కాలు త్రివ్వు
గఁచెమీఁది గుడ్డఁ గనిపెట్టి తీయరా ॥విశ్వ॥ 805

దేవ దానవులకుఁ దీఱని వైరంబు
కలుగఁ గారణంబు తెలియఁ గలమె ?
గుణము వేఱుగాని గురువొక్కఁడే గదా ॥విశ్వ॥ 806

ఆత్మశుద్ధి కొఱకు నన్వేషణము వీడి
బాహ్యచిహ్నములకుఁ బ్రాకులాట
గట్టి విడిచి పట్టి పొట్టుకుఁ బోట్లాట ॥విశ్వ॥ 807

భౌతికమునఁగాని పరమార్థమునఁగాని
బ్రహచర్య మిచ్చుఁ బరమ సుఖము
సుఖము కోరెదేని చూడరా బ్రహ్మము ॥విశ్వ॥ 808

అకుటింటి సుఖము హర్మ్యంబునకు లేదు
రాజెఱుంగఁడు మునిరాజు సుఖము
కష్టజీవి హాయి కలవాఁడు పొందునా ॥విశ్వ॥ 809

పువ్వు నొవ్వకుండఁ పుష్పంధయంబింత
తేనె ద్రాగి హాయి తిరుగుచుండు
ఎఱుక గలఁడు పశుల హింసించి బ్రతుకఁడు ॥విశ్వ॥ 810

న్యాయమార్గముననె నడవ దలంచెడి
వారిఁ గష్టపెట్టు వారు కలరు
ధర్మమునకు బలము తగినంత లేదురా ॥విశ్వ॥ 811

ఎంతయున్నఁ దనకు నింత లేదనుకొంచు
కుందువాఁడు సుఖముఁ నొందలేఁడు
చింతలేనివాఁడె సిరిగలవాఁడురా ॥విశ్వ॥ 812

గాలివానకైన రాలదు గిజిగాని
గూడు, తాటియాకు కొసన యున్న
పక్షి కెంత తెలివి పరమేశుఁ డొసఁగెరా ॥విశ్వ॥ 813

సాధనంబు లెన్ని సమకూడినను తజ్జ్ఞ
డుండని యెడల నుపయోగపడవు
తేఱు సరిగ చనునె సారథి లేకున్న ॥విశ్వ॥ 814

ఇల్లు వెండికొండ విల్లు బంగరుకొండ
ఈశుఁ డేల బిచ్చ మెత్తఁ జనెసె
విధి విధానమునకు వేఱుగా జరుగునా ॥విశ్వ॥ 815

ఒకఁడు చర్మమిచ్చె నొకఁడు మాంసంబిచ్చె
నొక్కఁ డస్థు లిచ్చె నొకఁడు ప్రాణ
మిడె, నుదారభావుఁ డీతనిదున్నదా ॥విశ్వ॥ 816

కలదు లేదని మదిఁ గలఁత చెందఁగరాదు
కలఁత చెంద గొప్ప ఘనత రాదు
లేమికంటె నోర్పు లేమి చిక్కులు పెక్కు ॥విశ్వ॥ 817

కోడి కూయుచుండె 'కొక్కొరొకో' యని
కాలమెఱిఁగి యెవఁడు మేలుకొలిపె
ప్రకృతిరూపుఁడైన పరమేశులీలరా ॥విశ్వ॥ 818

బీదవాని యింట బిచ్చమెత్తఁగ వచ్చు
ధనమదాంధుఁ జేరఁ దగదు కవికి
చెరెనేని వాఁడు ధీరుఁడు కాడురా ॥విశ్వ॥ 819

గొడ్డు త్రాగుచున్న మడ్డి నీరైనను
పికె యెండెనేని పీల్చు నరుఁడు
అవసరమ్మొకప్పు డాచార మెఱుఁగదు ॥విశ్వ॥ 820

సంస్థగాని గొప్ప సంసారమే కాని
ముద్దు గొల్పు దొక్క పెద్దలేక
మేరుపూస లేని హారము రీతిగ ॥విశ్వ॥ 821

పాలలోని కింత పంచదారము లేక
కొంద బలవటింపఁ గొంద బచ్చు
గంజిలోని కుప్పగల్లు తే కేడ్తురు ॥విశ్వ॥ 822

భేదబుద్ధి తోడ వాదము లాడుచో
మనసు కుటిల మెటుల మాసిపోవు?
పృష్ఠ తాడనమున నెట్లు దంతములూడు ॥విశ్వ॥ 823

దైవబలము కలిగి తారాపథంబున
నెగురుచున్నవాని నెదురు కొనుట
చుక్క కెదురు నిండు చూలాలి పయనమ్ము ॥విశ్వ॥ 824

లౌకికంబు లేని లేకికిఁ బ్రేమతో
బహు జనోపయోగ పదవి నిడుట
కోఁతికి జలతారు కుళ్ళాయఁ బెట్టుట ॥విశ్వ॥ 825

ఏ గ్రహంబు గాని ఏకాదశ స్థాన
మందుఁ జేరెనేని హాయి నొసఁగు
తెల్లయిసుక నూట తీపిగా నుండదా ॥విశ్వ॥ 826

అర్థ కామములటు లాత్మ విజ్ఞానంబు
బాహ్య సాధనముల వలను పడదు
మనసు పట్టి నిలుప మఱ యొక్కటున్నదా ॥విశ్వ॥ 827

పట్టుపురుగు ప్రత్తిఁ బుట్టింప జాలదు
ప్రత్తిచెట్టొ కింత పట్టు నిడదు
సాధ్యమైన పనినె సాధింతు రెవరైన ॥విశ్వ॥ 828

పండితుండె యైన వక్తృత్వ శూన్యుండు
పల్కలేఁడు సభను; నాల్కలేక
కంచుగంట యైన గణగణ మ్రోగునా ॥విశ్వ॥ 829

అరసి గింజ లిన్ని యన్ని రేపటి కెత్తి
చీమయైన బొరియఁ జేర్చుకొనును
మనుజుఁ డెట్లు భావి మనుగడ మఱచురా ॥విశ్వ॥ 830

పరుల నిందసేయు పాపంబు కలుగును
తన్ను తాను పొగడుకొన్న నఘమె
రెండు లేనివాఁడు దండిమనుజుఁ డన్న ॥విశ్వ॥ 831

పిటికి కండ యెంత నెఱుఁగని యాంధ్రుల
కలుకుఁ దనవు నేల గలిపెనేల?
కాలచక్ర మహిమ గమనింప శక్యమా ॥విశ్వ॥ 832

ఉష్ణదేశకాన వోద్భూత జనులెట్టు
లందమైన తనువు లొందగలరు
ఉగ్రమూర్తులైన నీగ్రోల జూడమా ॥విశ్వ॥ 833

దేహ సౌఖ్య మరసి దినమున కొకసారి
మెట్టవంట తిండి మెక్కవలయు
గట్టిగింజ తనువు దిట్టము సేయదా ॥విశ్వ॥ 834

పేనుకింత పెరిమ పెత్తన మిచ్చిన
హాని కలుగుఁ దలకు హాయి లేదు
ఖలుని పెద్దసేయఁ గలుగునా సౌఖ్యంబు ॥విశ్వ॥ 835

శాంతశమదమాది సద్గుణంబులు గల్గ
సౌఖ్య మందగలరు సర్వజనులు
దాన స్వర్గసీమ యౌను భూలోకంబు ॥విశ్వ॥ 836

గుణముచేత గాని కులముచే నెన్నఁడు
ఘనుఁడు కాఁడు మానధనుఁడు కాఁడు
ఏకలవ్యుఁ డెవ్వఁ డెఱుకఁడేఁడే కదా ॥విశ్వ॥ 837

రంగుమాసి గొప్ప రాసాయనికగతి
వజ్రి మొందరె దెంత పాటుపడిన
సిద్ధపురుషుల దృఢ చిత్తము మాఱదు ॥విశ్వ॥ 838

విత్తవంతుఁ డఖిల విజ్ఞాన ఖనియైన
కవికి మేలు గూర్ప గడగ డౌర
ధనము దాఁచుఁడేల తపసి వేస్తము గోరు ॥విశ్వ॥ 849

లోక సంగ్రహార్థ మే కవి వ్రాయునో
అతని దివ్య కవిత అమృత మొలుకు
స్వార్థపరుల రచన వ్యర్థమై తీరదా ॥విశ్వ॥ 840

గోత్ర వృద్ధి గోరి పుత్ర వాత్సల్యమ్ము
వీడజాల రెట్టి ఱేఁడులైన
ప్రాణమిచ్చెఁ గొడుకు బ్రతికింప బాబరు ॥విశ్వ॥ 841

గంజి లేని యింటఁ గడుపెడు ప్రజ గల్గ
తల్లిదండ్రులు పరితాపపడరు
దిగిన కాయలెట్లు తీఁగకు బరువౌను ॥విశ్వ॥ 842

పతిని ధిక్కరించు పడతి చేష్టలు గన్న
ఏరికైన రోఁతయే జనించు
పెదవి మించినట్టి రదము గాంచినరీతి ॥విశ్వ॥ 843

ఒకనితప్పు లొకని కొప్పులుగాఁ దోఁచు
ఒప్పులొకని వతఁడె తప్పులమను
పక్షపాతబుద్ధి పాపాల షద్దిరా ॥విశ్వ॥ 844

గుణిగుణమ్ము వొగడ గుణవంతునకుఁ జెల్లుఁ
బుండరీక గుణము పొవఁగ తెలియు
మానసౌకపంబు మాలకాకెఱుఁగునా ॥విశ్వ॥ 845

నాస్తికుండె గాని ఆస్తికుఁడే గాని
ఒక్కశక్తి యుంట కొప్పుకొందురి
ప్రకృతి యంచు వీరు పరమాత్మ యని వారు ॥విశ్వ॥ 846

కానిమాటలాడి జానెడు పొట్టకై
పరుల మోసగించి బ్రతుకఁ జూడ
దినము గడుచు గాని తనువెట్లు గడచురా ॥విశ్వ॥ 847

ఓర్పు నేర్పులు గల యోచన లేకున్న
మానవునకు విన్న మాటకంటె
చేటు గూర్చుచుండుఁ జెప్పెడి మాటలు ॥విశ్వ॥ 848

పైరు వాడిపోవు పడమటి గాలిచే
పైరగాలిచేత పైరు పెరుగు
దెసలు మారినంత వస యెంత మారెరా ॥విశ్వ॥ 849

ఎన్ని భాషలైన నెఱిగి యందలి సార
మాంత్రమునకుఁ జేర్పు మంతెగాని
తల్లిబాస విడుట తన్ను దా మఱచుట ॥విశ్వ॥ 850

అడిగికొనెడి వాని కరువది కూరలు
వండికొనెడి వారి కొండు కూర
పతికిఁ బ్రియుఁ డొకండు సానికిఁ బలువురు ॥విశ్వ॥ 851

పెట్టినన్ని నాళ్ళు పెండ్లని గోరుచు
పెట్టలేని వేళ తిట్టుచుండ్రు
లోక తంత్రమునకు లోఁబడ బోకుము ॥విశ్వ॥ 852

పండితునకు నైనఁ బామరునకు నైన
గుండె నిబ్బరంబు కూర్పు సుఖము
తత్తరమునఁ బనులు తారుమారగుచుండు ॥విశ్వ॥ 853

మండనమున గాని ఖండనమున గాని
మోద ఖేదములను పొందనట్టి
సాధుపుంగవుండు సర్వజ్ఞుఁడొక్కడే ॥విశ్వ॥ 854

చంకబిడ్డ కొఱకు చందమామను బిల్వ
దివిని విడిచి యెట్లు భువికి వచ్చు ?
మాయమాటచే నమాయకులకుఁ దృప్తి ॥విశ్వ॥ 855

సింగ మేన్గు తలను చీల్చ నేగును గాని
కడుపుఁ జిచ్చు గడ్డి కఱవఁ బోదు
సజ్జనుండు కష్ట సమయాన లోగునా? ॥విశ్వ॥ 856

విదురనీతి వినక వదరుచు కురురాజు
సర్వనాశకుఁడయి యుర్విఁ బడియె
చెప్పువారు లేక చెడిపోవ రెవ్వరు ॥విశ్వ॥ 857

ఊరిమీఁద వేర యూరు పడిన వాక
కాసు వడగ బోదు కరణముపయి
పరుల డాయు మిత్తి పరశివు డాయునా ॥విశ్వ॥ 858

దొరతనమ్ము గలఁగఁ దొత్తున కైనను
మ్రొక్కిల చేతులెత్తి మొక్కవలయు
స్థాన మహిమగాని తన మహిమా యది ॥విశ్వ॥ 859

సహజ దుష్టబుద్ధి సజ్జన సహవాస
మెంత కాలమున్న నేమి ఫలము
మల్లి ప్రక్క పెరుగ నుల్లి కంపెటు మాయు ॥విశ్వ॥ 860

పక్షపాత బుద్ధి పాపాత్ములకె యుండు
సత్యనిష్ఠ యుండు సజ్జనులకు
భక్తివరుల కుండుఁ బరమేశుపై దృష్టి ॥విశ్వ॥ 861

ఆత్మజాతు లెన్ని యగచాట్లు పెట్టిన
సహనభావమూని సంతసింతురి
ఎవరికంపు వారి కింపుగా నుండదా! ॥విశ్వ॥ 862

దేహి దుర్గుణములు దైహికమే గాని
ఆత్మ కెన్నఁడైన నంటఁబోవు
ఏటికున్న వంక నీటికి మండునా ॥విశ్వ॥ 863

మాటలాడ నేర్వ మసలదు పోట్లాట
తినుట నేర్వ రోగ మణగి పోవు
తగిన కృషిని సల్ప దారిద్ర్య ముండదు ॥విశ్వ॥ 864

చక్కెరపొడికంటె 'శాక్రీను' కడుతీపి
ఆలుకంటెను వెలయాలు తీపి
కలినిజంబు కంటె కల్లయే కడు తీపి ॥విశ్వ॥ 865

నీతినిచయమెల్ల చేతులలో నున్న
ఘనత కలుగు ననుట కల్లగాదు
అమలమైన తిండి ఆరోగ్య మొసఁగదా ॥విశ్వ॥ 866

బహు విధమ్ములైన పరివర్తనములచే
బొగ్గె వజ్రమైన పోల్కి, నరుఁడు
షద్గుణాళి సరిగ సాధింప సాధువౌ ॥విశ్వ॥ 867

విష్ణురూపుఁడైన కృష్ణునంతటి వాఁడె
బోయ బాణహతినిఁ బొందవలసె
వంతు వచ్చెనేని గంతువేసినఁ బోదు ॥విశ్వ॥ 868

ఎఱుక లేక నీవ ఏ తప్పు చేసిన
తెలిసి పరితపింపఁ గలితొలంగు
దాసు తప్పులన్ని దండముతో సరి ॥విశ్వ॥ 869

దాతచెంత దాన ధర్మమ్ములం గల
శోభ చెఱచునట్టి లోభులుంట
పండ్లచెట్టు చుట్టు ముండ్లపొద గలట్లు ॥విశ్వ॥ 870

అర్ద్రి హృదయమందు నవతరించెడి ప్రేమ
ఈశు గుణము గాన నేలు జగము
ప్రేమ మనఁగ వేరు కామము వేరురా ॥విశ్వ॥ 871

ప్రాజ్ఞ కోటి మధ్య బహుకాల ముండినన్
తెలియలేఁడు వారి తెలివి మూర్ఖు
తెడ్డు పాకగుణము తెలియఁగ జాలునా ॥విశ్వ॥ 872

ధైర్య శౌర్య నిధియు దైవోపహతుఁడగు
సమయమందుఁ జిక్కుఁ జవటకైన
తేలు బూజుపడిన పాలీడు చంపదా ॥విశ్వ॥ 873

చింత ముదురు కొలది చేవ హెచ్చుగ నుండు
వేశ్యమాత జిగురు వేశ్యకంటె
మత్తు మిక్కుటము మగు మద్యమ్ము పులిసిన ॥విశ్వ॥ 874

మ్రొక్కువాని నణఁగఁ ద్రొక్కెడి నీచులు
కలరు, లొంగినట్లు కనఁబడునెడు
కుక్క కసరి యులచి నిక్కి పైఁబడఁజూచు ॥విశ్వ॥ 875

ఉత్త మాధములకు నుండు భేదములెన్నొ
మనుజు ముఖమునందె మనకుఁ దెలియు
వాడలున్న యునికి గోడలు చెప్పవా? ॥విశ్వ॥ 876

పాప పుణ్యములకు రూపు లేకున్నను
ఫల మొసంగుచుండుఁ దొలఁగకుండ
తెలియఁబడని యాత్మ త్రిజగము ల్ద్రిప్పదా? ॥విశ్వ॥ 877

ఒకరి జన్మసుకృత మొకరికి నొదవదు
గురువు మించు శిష్యవరులు కలరు
అనిలుకంటెఁబైకి నావిరి పోవదా? ॥విశ్వ॥ 878

పలువనైన నమ్మి పని సేయువచ్చును
పలువకంటె సాదు పలువ తులువ
కప్పకూఁత పాము ముప్పొనగూర్చురా ॥విశ్వ॥ 879

గొప్పవాఁడు పోవఁ గొలఁదివానికి గూడ
గొప్పవాని వెలుఁగు కొంత కలుగు
సూర్యుఁ డస్తమింప జ్యోతిర్లత వెలుంగు ॥విశ్వ॥ 880

మాతృ కరుణతో సమానమైనది లేదు
కొడుకు బయటినుండి కొంపఁ జేర
తల్లి పొట్టఁ జూచు నిల్లాలు చేఁ జూచు ॥విశ్వ॥ 881

పనికిమాలినట్టి పందకు నడుమనే
కలిమి కనిగినంత కనులు తిరిగి
అర్ధరాత్రియందు నడుగుచు గొడుగును ॥విశ్వ॥ 882

ఘనుల బోధ, బుద్ధి కలుషమ్ము లడగించి
నిర్మలమ్ము సేయు, నీటి బురద
చిల్లగింజ సొద చేరదా యడుగున ॥విశ్వ॥ 883

లోకవర్తనమ్ములో లీనమై యున్న
మంచి చెడ్డల విభజించు జ్ఞాని
పాలు నీరు వేరు పఱుప హంసకుఁ జెల్లు ॥విశ్వ॥ 884

ఎట్టివారితోడ నేపని దొరకొన్న
కిలెఱింగి పేయ మేలు కలఁగు
గంత గట్ట నెద్దు గానుగఁ ద్రిప్పదా? ॥విశ్వ॥ 885

కాలవశము చేత ఘనునకుఁ బతనమ్ము
కలుగ, తొలఁగఁ జేయవలయు ఘనుఁడె
ఏనుఁగెత్తు వడ్డ నేన్గె యెత్తవలయు ॥విశ్వ॥ 886

కఠిన వర్తనమును ఖండింప వలెనన్న
కఠిన మార్గమునకుఁ గడఁగ వలయు
విసపు రోగమునకు విష మమృతంబౌను ॥విశ్వ॥ 887

ఐకమత్య మొదవ నన్యోన్య సౌహార్ద
వర్తనంబు లేని వారి గృహము
కలిపిలాని యట్టి కప్పల తక్కెడ ॥విశ్వ॥ 888

భోగలాలసునకు రోగ భయంబుండు
మోహనాంగి కుండు ముదిమి భయము
కర్మఠునకు క్రూర కర్ముల భయముండు ॥విశ్వ॥ 889

చేత మొప్పవట్టి చేతకు భీష్ముండు
గురువుతోడ నైన గుద్దులాడెఁ
బరముఁ గోరి తండ్రిఁ బ్రహ్లాదుఁ డెదురఁడా? ॥విశ్వ॥ 890

బంధము ___ నొపఁగు పరమాత్ము శ్రీకృష్ణుఁ
గట్టఁ గౌరవుండు దిట్టపడుట
తమ్ము గట్టఁ ద్రాళ్ళు తాఁ దెచ్చుకొనుటరా ॥విశ్వ॥ 891

శకుని మైత్రి చేసి సహజశక్తిని బాసి
గడ్డుతోవఁ బడెను గౌరవుండు
పురులు తీవపెట్టఁ దెరువు తప్పి చరించు ॥విశ్వ॥ 892

గొఱ్ఱెదాటు మూక గుణము గ్రహింపదు
మంచివాని హితము నెంచఁబోదు
పుంజు కెంపుఁ గంది గింజ గాదని త్రోయు ॥విశ్వ॥ 893

శాంతికాముఁడైన సమతత్వ బుద్ధితో
చెలిమి సేయుదే నృసింహమైన
భక్తుఁ బ్రోచి వైరి వధియించె శ్రీహరి ॥విశ్వ॥ 894

పరమ మైత్రియందు వైరమ్మునందును
సుజను మనసు చొఱదు వృజినమునకు
సరస పదముఁ ద్రిప్పి చదివిన సరసయె ॥విశ్వ॥ 895

ఎదురుకుతికలైన నెదురుకాళ్ళం బుట్టి
నట్టివారు తోము టదియ మందు
ఉష్ణ ముష్ణమునసె యొప్పు శీతలమౌచు ॥విశ్వ॥ 896

ఎదఁ జెలిమి నాఁడు నాటికిఁ
జెదరినచెలి విడుటయెంతొ శ్రేయస్కరమౌ
కదలిన పిమ్మట రదనము
వదలుటయే మేలటంచు వాకొను వేమా ? 897

పట్టుపట్టి విద్దె పగలెల్లఁ జదివిన
రేయి మిగుల నిదుర కాయనేల
నిద్ర మానెదేని నీరస మెచ్చురా ॥విశ్వ॥ 898

నిమ్మచెట్టు నీడ నిలిచిన నరునకు
మండుటెండఁ గాఁగు మానవునకు
స్థిమితమందు మనసు సమమౌనె బాహ్యన ॥విశ్వ॥ 899

పుట్టె డావుదవుఁ బొల్లాడినను దవ
కెంత యతుకఁ దగువొ యంతె యతుకు
తొంటి నోముఫలము కంటె నెక్కుడు రాదు ॥విశ్వ॥ 900

కం॥ కడు కష్టమ్మైన పైనను
బుడమిఁ బ్రీతికి చెడినవాని పొంతకరుగుటే
యొడఁదకు సుఖమిదు నెన్నఁడుఁ
జెడి బ్రీతికినవాని చెంతఁ జేరకు వేమా! 901

ధర్మమెఱుఁగకుండఁ దనవారికే కీడు
తలుప మూర్ఖు పరుల చంకఁ జేరు
కొయ్య చెట్లఁ గొట్ట గొడ్డట దూఱదా ॥విశ్వ॥ 902

పట్టి విద్దె నొజ్జ కొట్టిన మాత్రాన
ముప్పదేమి మనసు నొప్పియేల ?
చేడుకుట్టు వలనఁ జేలంబు చెడునొకో ॥విశ్వ॥ 903

వానవచ్చు రాకఁ బ్రాణముచమపోక
నెవ్వడైన ముంద యెఱుఁగఁ గలఁడ
హరుని మహిమఁ దెలియ నరుని తెలివి యెంత ॥విశ్వ॥ 904

కొన్ని వేళలందుఁ గ్రూరుఁడు దశవెల్గ
పజ్జనుండు చాల సంకటపడు
రాముఁ డడవిపాలు రావణుఁ డిల నేలు ॥విశ్వ॥ 905

చేతమొక్క జాయి చేనిమొక్కలి జాయి
వేఱయనుట వట్టి వెఱ్ఱిగాదు
కవలకుండకున్నె కాశింత భేదంబు ॥విశ్వ॥ 906

పాలపండ్లు వేఁపపండ్లొక్కతీగ నుండు
తినినయంత రుచుల తీఱు వేఱు
నరులయందు మంచి నరులట్లు తెలియుము ॥విశ్వ॥ 907

అంతరాత్మ కంటె అధిక గురుఁడు లేఁడు
సతికి మించినట్టి సఖుఁడు లేఁడు
దానమునకు సరి నిధానము లేదురా ॥విశ్వ॥ 908

ఒక్కఁడున్న మనసు చక్కఁగా నిలుచును
ఇద్దఱున్న సుద్ది పెద్దదియగు
మంది యెక్కువైన మతమునకే చేటు ॥విశ్వ॥ 909

ఎంత నీచమునకు నేనియు బాల్పడు
వాని బ్రతుకు బ్రతుకె వసుధయందు
సిగ్గుకొఱక చీర శృంగారము కొఱక ॥విశ్వ॥ 910

అధముఁడైనవాని కప్పిచ్చి యడిగిన
దెబ్బలాడు గాని, డబ్బునీఁడు
సొమ్ముపోయి కడకు దిమ్ముపట్టును సుమ్ము ॥విశ్వ॥ 911

చలనచిత్రిచయము చక్కనాడెడి వేళ
మూఁగబొమ్మలాట ముదమొదవదు
పాయసమ్ముకంటె వరికూడు రుచియౌనె ॥విశ్వ॥ 912

గ్రామమందొకండు కలుషాత్ముడుండిన
గ్రామమెల్లఁ జెఱచుఁ గల్లగాదు
చెడ్డకోఁతి దాన చెఱచురా వనమెల్ల ॥విశ్వ॥ 913

నీతిబోధ వినక నిత్యమ్ము మనసులో
కల్మషంబు పోదు కడుగకున్న
పాత్రకైన లోన పాచి పట్టునుగదా ॥విశ్వ॥ 914

దారిఁ జూపు గురుఁడు దవరు నిచ్చునతోలె
బట్టుఁబట్టి నీవ చెట్టు నెక్కు
అమృతఫలము నంది అనందమొందుము ॥విశ్వ॥ 915

కామ మనఁగ వేఱ కడలి కవ్వల లేదు
నీ మనస్సునంద నిలిచి యుండు
కామముడిపి ముక్తి కాంత చెంతను జేరు ॥విశ్వ॥ 916

పెద్ద వృక్షమునకుఁ పిన్న ఫలంబులు
పిన్న తీఁగ కింత పెద్ద పండ్లు
హానికలకుండ బూనఁ జేసిన దెవఁడు ॥విశ్వ॥ 917

స్పడుచుండిన
ము నీకు
ంది ఫలములు ॥విశ్వ॥ 918

యము పొంద
క్షమగుట
ను దూర్చుట ॥విశ్వ॥ 919

పర్వతమ్మునందుఁ బరమాణువందును
చీమయందు ఘోర సింహమందు
నిండియున్న వాఁడు దండి దేవుఁడె గదా ॥విశ్వ॥ 920

శౌండికు కరమందు నుండు పాలపిడత
కలుముంత యనుట కల్లగాదు
సానియింటి చాన సతియని యందురా ॥విశ్వ॥ 921

గిల్లి జగడములనె యెల్లప్డు కూర్చెడి
మనుఁజుఁ డొక్కఁడున్న మనసు చెడును
ఇంటి కింతకంటె తంటాలు లేవురా ॥విశ్వ॥ 922

చేతులార నీవు చేసికొన్నదె గాక
కర్మ ఫలము వేఱె కలుగఁ బోదు
ద్రుపద సుతకు నృపతి తొడసూప తొడవిగ్గె ॥విశ్వ॥ 923

మనసు తనదు కొలఁది మఱచి సమాధిలో
బ్రహ్మయంతు దెలియఁ బయనమగుట
ఉదధి లోతు గనుట ఉప్పు బొమ్మరుగుట ॥విశ్వ॥ 924

వర్షమంతలేని వర్షాన నష్టప్డు
మెట్టవంట కొంత నట్టువడును
నీటిమీఁద వంట నిర్భాగ్యునకుఁ బండు ॥విశ్వ॥ 925

వలయు రీతి నాడ వాక్స్వేచ్ఛ నరికట్టి
పాలనమున సభ్య పదవి నిడుట
పీడఁ జేసి పెద్ద పెండ్లముం గట్టుట ॥విశ్వ॥ 926

నరులు విడుచుగాలి తరులు పీల్వందగుఁ
దరులు విడుచుగాలి నరులకుఁ దగుఁ
ప్రకృతి మర్మ మరయఁ బరమాద్భుతంబురా ॥విశ్వ॥ 92

సంఘసేవ సేయఁ జనుదేర వలెనన్న
ఓర్చుకొనుట ముందు నేర్చుకొనుము
లోతునీళ్ళ దాట ఈఁత కావలెగదా ॥విశ్వ॥ 928

చిక్కమందు నున్న చక్కెఱ పొట్లమ్ము
బొక్కె చీమ కెవఁడు చక్కఁ దెలిపె
నిత్య మహిమగాక నిస్తంత్రి యున్నదా? ॥విశ్వ॥ 929

కామతృష్ణ తగిలి కలఁచెదేని మనస్సు
రెచ్చగొట్టు నిన్ను జేపుమాపు
జిలకు గోకుకొలఁది జిలబొబ్బ రేగదా? ॥విశ్వ॥ 930

పాడి వీడి పేదప్రజ గొట్టుకొని తిని
చివఱ కష్టదశకు చిక్కి నరులు
వెల్లువఁ బడిపోవు పిల్లులవలె నుంద్రు ॥విశ్వ॥ 931

ఆడుదాని మాట ఆపదలకు బాట
మంచిగురుల మాట మణుల మూట
అంతరాత్మ మాట అమృతంపు టూటరా ॥విశ్వ॥ 932

తనకుఁ బెఱకు హాని దపుటూహ జనియింప
అప్పుడ అణఁచి మేలు నందవలయు
పుట్టగానె దూడ గిట్టలు దీయరా? ॥విశ్వ॥ 933

ఆలి నణఁపలేక అప్పు తీర్పఁగలేక
ఎన్న వెనుక ముందు ఎవరు లేక
విసివి యొక్కొకండు వేదాంతివలె నుండు ॥విశ్వ॥ 934

కలమతంబులన్ని గాలించి చూచిన
పరమె మనకు బోధ పఱుపఁ జూచు
గతులు వేఱుగాని గమ్య మొక్కటె గదా ॥విశ్వ॥ 935

మాటలాడకున్న మౌనినాఁ జెల్లిన
అమితమూర్ఖఁ దపసి యనఁదగుఁగద
మాటలాడకున్న మనసాడకుండునా ॥విశ్వ॥ 936

లోతు లెఱిఁగి పరుల గోతఁ ద్రోసెడి ధూర్తు
చేరనిచ్చి గుట్టు చెప్పుటన్న
దారిదొంగకుఁ దన ధనము జూపినయట్లు ॥విశ్వ॥ 937

ఏన్గు నెక్కుచుండ నినునితో మావటిఁ
డతని కితఁడు సాటె? హరుతలఁ గల
యుడుపతి సరియౌనె యుమ్మెత్త యటనున్న ॥విశ్వ॥ 938

చర్మ శుద్ధియగును స్నానమ్ము చేసిన
గేము శుద్ధియగును గోమయమున
ఆత్మ శుద్ధియగును అచలబోధనుధను ॥విశ్వ॥ 939

అని లమావిరున్న అగపడదెప్పుడు
కాని, ఘనము గాగఁ గానఁబడును
పుణ్యఫలము గూడ పూర్తియైననె తోఁచు ॥విశ్వ॥ 94

ఆత్మ నెఱిఁగి యైహి కాశ పీడినవాఁడు
పుట్టఁబోడు జగతిఁ గిట్టబోఁడు
పొట్టుతీయు గింజ మొలకెత్తఁ జాలునా? ॥విశ్వ॥ 941

చిమ్మువాఁడు గూడ సింహాసనం బెక్కఁ
గోరుఁ, గాని కోర్కె తీరుటెట్లు ?
డుడ్డు దొఱకఁ గలదె తెడ్డంత సులువుగా ॥విశ్వ॥ 942

మాట కోటదాట మన సిల్లుదాటని
ఉత్తరుని కరాన కత్తియుంట
పేడివాని మూతి పెనుమీస మున్నట్లు ॥విశ్వ॥ 943

ఉన్నదాని యునికి ఉండక తప్పదు
లేనిదాని యునికి లేదు జగతి
దేహ మస్థిరంబు దేహి సుస్థిరమగు ॥విశ్వ॥ 944

దప్పి దీరకున్న తాపంబు పుట్టును
కోర్కి దీరకున్న కోప మొదవు
ఆశ దీరకున్న అవని జన్మము గల్గు ॥విశ్వ॥ 945

తెలిసి చేసిన మఱి తెలియక చేసిన
పాపఫలము పొంద వలయుఁబ్రాణి
శిశువు నిప్పు దాక చే కాలకుండునా? ॥విశ్వ॥ 946

కులధర్మము నశియించిన
కులకాంతల వర్తనమ్ము కుటిలమ్మయి దు
ష్ఫలితమ్ము నిచ్చుఁ గావునఁ
గులధర్మము వీడు టెంత ఘోరము వేమా ! 947

త్రిగుణ రహితమైన దివ్య తత్త్వముఁ బొంది
పాప పుణ్యములను వదలు యోగి
సుజనుఁ డతఁడె గాన సుఖదుఃఖములు లేవు ॥విశ్వ॥ 948

అన్ని తెలిసిగూడ అజ్ఞానమునఁ బడు
ఘనులు కొందరుంట కల్ల గాదు
గాధిసుతుఁడు మేనకకుఁ జిక్కి పొక్కఁడే ॥విశ్వ॥ 949

బలవిహీనులైన పలుపు రేకమ్మైన
భీమబలు జయింప వీలు గలుగు
గడ్డివెంటిగనయి కరిని బంధింపదా ॥విశ్వ॥ 950

చిలుక కీఁకరంగె శ్రీరామ రక్షయౌ
కమఠమునకు రక్ష గట్టి బొచ్చె
సజ్జనునకు సత్య శాంతమే రక్షణ ॥విశ్వ॥ 951

కోణములను జెక్కి రాణించు రతనము
పుటముఁ బెట్టఁ బైడి పొలుపు హెచ్చు
కష్టములకు నోర్వ ఘనుల కీర్తి వెలుంగు ॥విశ్వ॥ 952

ముకుర తలము మురికిఁ, బొగ నిప్పు, మావిచే
గర్భమందు శిశువు గప్పఁబడిన
గతిని గప్పఁబడును గామముచేఁ దెల్వి ॥విశ్వ॥ 953

శీతకాలమందు స్వేదరంధ్రమ్ములు
ముడుచుకొనుట జెమట వెడలనట్లె
ఆత్మతత్త్వమంద కనుమానములు పోవు ॥విశ్వ॥ 954

తగనివేళ తానె తన యంగములనెల్ల
కూర్మ మెట్లు ముడుచుకొనునొ యట్లె
విషయలోలత విడి విమలాత్ముఁడౌ జ్ఞాని ॥విశ్వ॥ 955

నల్లకుండలోని తెల్ల యన్నము వలె
దేహమాత్మనుండు తెలిసికొన్న
ఒకటి యస్థిరమగు ఒకటి స్థిరమ్మగు ॥విశ్వ॥ 956

ముందు పోవువాఁడు మొనగాఁడునాఁదగు
వెనుక పోవువాఁడు ఘనుఁడుగాఁడు
స్థాపకుని యశంబు దక్కునా పెఱలకు ॥విశ్వ॥ 957

సూర్యరస్మి రోగ సూక్ష్మజీవులఁ జంపు
ఔషధంబు సరగ వ్యాధిఁ జంపు
అంతరాత్మ బోధ మఘములఁ జంపురా ॥విశ్వ॥ 958

గాజు కవలిదెసకుఁ గాంతి పోవఁగఁ జాలు
జాతి కవలిదెసకు రాఁగలదొకొ
మంచి మాట మూర్ఖు మనసున దూరునా ॥విశ్వ॥ 959

చావశిశువు, మంత్రసాని కట్నము పోదు
రోగిచావ, వెజ్జురో తొలగదు
సిద్ధి కాకపోవ జీతము కాకునా ॥విశ్వ॥ 960

పందెమందుఁ జేరి పరుగెత్తు వారల
నితరు లురక ప్రోత్సహించునటుల
కలలు శకునములను గర్తను బురికొల్పు ॥విశ్వ॥ 961

కంచుకోట యున్న ఘనరక్షణం బున్న
శత్రు లున్న పతికి శాంతి సున్న
లోనలేని శాంతి లోకాల దొఱకునా ॥విశ్వ॥ 962

మాట మాట కలియ మనసులు పరియుగు
మాట మాట కలియ మనసు కలియు
మాట మనసు కలియ మంచి మైత్రి ఘటిల్లు ॥విశ్వ॥ 963

అనికిఁ దోడుకొనండు అసహాయశూరుండు
చలికిఁ దోడుకొనవు పరిగఁబాలు
మనసు తోడుకొనదు ఘనయోగనిష్ఠలో ॥విశ్వ॥ 964

మాట కంచుకోట మాట ముక్తికి బాట
మూట మూట మంచి మాటఁ దెచ్చు
మాట నేర్వమి నవమానము సిద్ధము ॥విశ్వ॥ 965

చంద్రలోక యాత్ర సాగించినంతనే
ఇంద్రభోగ మనుచు నెంచనేల?
నరకమునకుఁ ద్రోయు నైతిక పతనంబు ॥విశ్వ॥ 966

ఆత్మయందు బుద్ధి అతికిపోయిన యంత
ఆత్మగుణము బుద్ధి కంటుకొనును
జలము పాలలోన కలిసిన రీతిరా ॥విశ్వ॥ 967

ఇంద్రియములు గొప్ప యెన్న దేహముకంటె
వానికంటె మనసు దానికంటె
బుద్ధి; దానికంటె శుద్ధాత్మ గొప్పది ॥విశ్వ॥ 968

దండి సత్యమునకు రెండు నాల్కలు లేవు
పాపమునకు గుండె బలము లేదు
దైవసేవ కెపుడు తఱుగింతయును లేదు ॥విశ్వ॥ 969

సున్నమందు నొకటి యున్న సంఖ్యగ నగు
ఒంటి తొలఁగ బిందు వొకటి నిల్చు
ప్రకృతి తొలఁగ నిల్చు పరమాత్మ యొక్కటి ॥విశ్వ॥ 970

ఇరుగు చల్లనంచుఁ బొరుగు చల్లనయుండు
దీప మిడిన యంత దేవుఁ గొల్వ
దాని వలన నిమ్ము దైవము దీపించు ॥విశ్వ॥ 971

కం॥ ఒకరికి సాయము చేయుచు
నొకరి వలన సాయమంది యోర్పునేర్పం
బ్రకటించుము సకలార్థము
లొకటొక్కటి పరగ సాధు వొందును వేమా 972

లక్ష్యశుద్ధి లేక లక్ష్మి చేకూరదు
చిత్తశుద్ధి లేక శివుని గనఁడు
శుద్ధి లేక మందు సుగుణంబు నిచ్చునా? ॥విశ్వ॥ 973

ప్రతిసుఖ మొక చువ్వ ప్రతిదుఃఖ మొక చువ్వ
అవియు పంజరముగ నమరియుండ
చిల్కవోలె నాత్మ చిక్కి ముక్తిని బాయు ॥విశ్వ॥ 974

శాస్త్రబద్ధమైన చక్కని పాలన
వాస్తవిక విఘాత పథముఁ జనక
ప్రజల జీవితంపుఁ బ్రతిబింబ మగుచొప్పు ॥విశ్వ॥ 975

ఎచట నుద్భవించి యెటఁ బ్రవహించినఁ
గడకుఁ జేరు నదులు కడలి; నట్లె
ఈశుఁజేరు నెవ్వఁ డెట్లు ప్రార్థించిన ॥విశ్వ॥ 976

ఔర్వ శిఖల వేడి యగుటెఱుంగని వార్ధి
గడ్డి నిప్పుచేతఁ గ్రాగనట్లె
ఖలుఁడు సేయునింద కలఁచదు బుధు మది ॥విశ్వ॥ 977

ఆదియందు నాట అంత్యమందు సురట
అనుటఁ దెలియకుండ ఆడుటన్న
గణగుణ వ ఱ యుక్తయ కైత సెప్పిన రీతి ॥విశ్వ॥ 978

పెండ్లిగొండ్లి గాదు వెయ్యేండ్ల వంటౌట
నౌకరి మంచిచెడ్డ లాకరు తెలియ
నాడు తెగెడి వఁట ఏడు చెప్పుల జోళ్ళ ॥విశ్వ॥ 979

పరమ నిర్మలాత్మ బాహేంద్రియమ్ముల
లోఁగియూఁగుఁ దనదు లోతు మఱచి
మద్యమానినట్టి మనుజుని రీతిగా ॥విశ్వ॥ 980

కర్మ కల్పితమ్ము కాయమ్ము తత్కర్మ
మంతరింప నొక్క యాత్మ నిలిచి
పరితపించుచుండు పరమాత్మఁ జేరఁగ ॥విశ్వ॥ 981

ఒకడి బానిసైన ఒక టధికారియై
మనసు తనువు రెండు మసలుచుండు
మనసు బానిసైనఁ గనలేవు బ్రహ్మము ॥విశ్వ॥ 982

కంటిపాప లేని కనులున్న ఫలమేమి?
మనసు నిల్పలేని మౌనమేల?
గుణము శుద్ధిగాని గురువేల గురుతేల? ॥విశ్వ॥ 983

పంటచేని పైకిఁ బశువుఁ దోలెడివాఁడు
పశువుకంటె హీన పశువు గాఁడె?
పంటకుప్పకగ్గిఁ బఱపువాఁడెవఁడురా ॥విశ్వ॥ 984

మచ్చుతునకవంటి మనుజుఁ డొక్కఁడు చాలు
వంగడంపుఁ బేరు వసుధ వెల్గ
జలధిపేరు నిల్ప చంద్రుఁ డొక్కఁడె చాలు ॥విశ్వ॥ 985

ఆత్మ గతము గాన నాద్యమై సంస్కృతి
తనువుకంటె ముందుఁ దనరునట్లు
పరుష పరశఘులకుఁ బరగు బిందువు ముందె ॥విశ్వ॥ 986

అగ్ని పుటము గొన్న అచలాపుటము గొన్న
సూర్యపుటము గొన్న శుద్ధియగును
అట్లె మనుజు తత్త్వ మరసి మంచికిఁ ద్రిప్ప ॥విశ్వ॥ 987

పావకోళ్ళు దొడిగి పచ్చడమును గప్పి
కుండలములు పెట్ట గురుడు గాఁడు
అంబు బట్ట నంద అర్జును లగుదురా? ॥విశ్వ॥ 988

చింతపండు పెట్టి చేతికొలఁది తోమ
పుత్తడిత్తడి జిగి పొల్పు పరగ
హెచ్చులొచ్చు లెఱుఁగ బచ్చు గావలెఁగదా ॥విశ్వ॥ 989

బాహ్యవర్తనంబు బాగుగా లేదేని
మనసులోని నడక మంచిదగునె?
వంట నేర్వకున్న వైష్ణవం బబ్బునా? ॥విశ్వ॥ 990

సత్య శాంత సహిత శమదమాన్వితమైన
విమల మనసునుండి వెడలు మాట
మలిన రహితమైన వెలిసైకతపు టూట ॥విశ్వ॥ 991

ఒక్క తనువునుండి యుద్భవించినవయ్యు
కుడి యెడమలకింత నుండు తేడ
ఎడమచేతఁ బెట్ట నెవరైన మఱతురు ॥విశ్వ॥ 992

కం॥ సామ్యమసామ్యము గమ్యము
సామ్యమ్మని యనుటెగాని జరుగదు ప్రకృతిన్
సౌమ్యముగ విమర్శించిన
కామ్యంబది యెల్లలోక కళ్యాణంబే 993

కం॥ టక్కరి యక్కఱ దినముల
నెక్కడ నక్కినను వచ్చి యీశుఁడవనివే
చక్కఁగ నక్కఱ దీఱిన
నక్కఱ కంటువకు సైన నడ్డము తగులున్ 994

కొమ్మ గొలుసు లేని గొప్ప యూయెల వయి
రూప నామ మహిమ రూఢిపడక
ఊఁగుచున్న యట్టి ఉత్తముఁ డెవఁడురా ॥విశ్వ॥ 995

ప్రళయము కాలమందు ప్రాణుల హరియించి
నిల్పి కుక్షిఁ దిరిగి సల్పి సృష్టి
కర్మగతిని ద్రిప్పు గారడీ డెవఁడురా ॥విశ్వ॥ 99'

ప్రతిపదంబు వాడి వ్యర్థము గాకుండ
గతిని గలుగఁజేయుఁ గవివరుండు
వైద్యుఁ డెఱిఁగి గుణము ప్రతి యొక్క వాడఁడా? ॥విశ్వ॥ ౯౯౭

రెండు వైపులందు నుండిన సౌజన్య
మలరు మైత్రి; రెంటఁ దొలఁగెనేని
కుడియెడముల మూఁత కొఱతైన మద్దెల ॥విశ్వ॥ ౯౯౮

సౌజన్యము సౌశీల్యము
రాజిలు రమణీయ రమణి రంజితపతియై
పూజితపథమున భర్తకు
నోజం బొనగూర్చి రాజయోగిం జేయున్. ౯౯౯

పెట్టిపుట్టినాఁడు పుట్టిపెట్టినవాఁడు
ముందువెనుక భోగ మందగలరు
లేనివాని కెపుడు లేవురా భోగముల్ ॥విశ్వ॥ 1000

నీరు నీరువైపు నెమ్మదిగఁ బ్రాకుఁ
దల్లివైపు బిడ్డ తరలిపోవు
భక్తి గలుగు నాత్మ పరమాత్మఁ జేరురా ॥విశ్వ॥ 1001

సాధుజనుల సేవ సన్మార్గముల త్రోవ
దైవసేవ ప్రకృతి తరణ నావ
ఆత్మతత్త్వ సేవ అచలసిద్ధుల కోవ ॥విశ్వ॥ 1002

పరమహంస వగుట భక్తితో మ్రొక్కెద
యోగశక్తి తోడ నొక్కమాఱు
దేవదేవుఁ జూడ దివ్య దీవన లిమ్ము ॥విశ్వ॥ 1003

కం॥ వందనము జగద్గురునకు
వందన మఖిలాండకోటి భరితాత్మునకున్
వందనము మోక్షదాతకు
వందన మఘహరునకనుచు వాకొను మనసా॥ 1004

ఒకరు నీకు నెద్ది యొనరింప వనరెదో
ఆచరింపఁబోకు నద్ది పెఱకు
అన్నిధర్మము లిందు అమరియున్నవి సుమ్ము 1005

బాల్యమునకు విద్య దారి తీయఁగరాదు
వృద్ధి పొందవలయు వృత్తివిద్య
శుభము లెసఁగ జనులు సుఖముండ వలయురా 1006

ఎత్తుకేగు కొలఁది ఎన్నొ వస్తులు పక్షి
కొంచెఁగలిగినట్లు కవివరునకు
వివిధశాస్త్ర చర్చ వేయి భావములబ్బు ॥విశ్వ॥ 1007

వేడ్క యిమిడియున్న విద్యత్కవీంద్రుఁడేఁ
గష్టపడుట నిజము కావ్య సృష్టి
బలముగల పడఁతికిఁ బ్రసవ వేదనలేదె ॥విశ్వ॥ 1008

కరుణ రసముచేత సరసహృదయమట్లు
మెత్తఁబడదు కఠిన చిత్తమనసు
కల్లు కరఁగ దుప్పు గల్లు గరఁగినట్లు ॥విశ్వ॥ 1009

అర్ధరాత్రి గోడ నటుద్రవ్వె దీలన
గోడ గట్టితనము చూడనుట
దూడ మేఁతకొఱకు తాడి నెక్కితినంట ॥విశ్వ॥ 1010

కాంచనాలయమ్ము గ్రంథాలయమ్మది
కార్యదర్శి యర్చకప్రవరుఁడు
వివిధ పుస్తకముల విజ్ఞాన దేవతల్ ॥విశ్వ॥ 1011

ఎఱిఁగి కొల్వ నరుల కిహపర సుఖముల
కాలయమ్ము పుస్త కాలయమ్ము
దాని సేవసేయు ధన్యుండు పూజ్యుండు ॥విశ్వ॥ 1012

శాస్త్ర పుష్పమధువు శాంతముగాఁ గ్రోలి
కైత తేనెతుట్టె కవియొసంగ
రసికుఁ డరసి దాని రసమాని మెచ్చురా ॥విశ్వ॥ 1013

అంధకారమందు నడవిఁ జిక్కినవాఁడు
క్రూరజంతులరచు మ్రోఁతగాక
అచటవినఁగలాఁడె త్యాగయ కీర్తనల్ ॥విశ్వ॥ 1014

చక్క సాగదెప్పు డొక్కని బాణమే
గాలివాన వేళఁ గడలినావ
దిక్కు లంగరౌను చుక్కానుకొఱగాదు ॥విశ్వ॥ 1015

గొప్ప వారిలోని తప్పులు పట్టితా
గొప్పవాఁడు గాఁగఁ గోరునొకఁడు
వానిలోట్లు ప్రజలు వాకొనుచుండరా ॥విశ్వ॥ 1016

పురుగు తొలుచు చార పొసఁగ వర్ణముగాదు
పక్షిగాదు గాలిపట మెగిరిన
వట్టి పికియేదొ పాడఁ దత్త్వముగాదు ॥విశ్వ॥ 1017

దోసు దోమ పోరఁ దోఁచదెవ్వఁకిని
ఏనుఁగేన్ను పోర నెఱుకపడును
గొప్పవారి స్పర్థ కువలయంబెగఁ బాఁకు ॥విశ్వ॥ 1018

బాల్య యౌవనముల భదశ్రిపడినవాఁడు
చరమ దశలఁ జాల సౌఖ్యమందు
ఆనకట్ట నీటి నాపి పంటల నీదె ॥విశ్వ॥ 1019

ఎద్దు వెంటబండి యేల నడవకుండు
తల్లి వెంట నేల పిల్లపోదు
రాజు వెంట నేల రైతేగకుండును ॥విశ్వ॥ 1020

గొప్పవానిఁ జూచి కొంచెపు బుద్ధితో
హీను లరకసేయు హేళనమ్ము
కుంజరమును జూచి కుక్కలు మొఱుగుట ॥విశ్వ॥ 1021

తల్లి విడిచిదేని తల్లిపొదుగా చేరఁ
గాలఁదన్నుఁ గాని పాలనిడదు
ఆత్మహితుని వీడి యన్యుఁజేరిన నంతె ॥విశ్వ॥ 1022

అరయ వారుని దృష్టి కధికారి దృష్టికిఁ
దొలఁగి మెలఁగుటెంతొ తెలివియనిరి
ఇనుని స్థితి నెఱింగి చనుట లెస్సొంగదా ॥విశ్వ॥ 1023

మలఁగల దశకంటె మైదానమున నది
నిబ్బరంపుశోభ నెగడినట్లు
నరుఁడు చివఱి దశల నడత శాంతినిజూపు ॥విశ్వ॥ 1024

వయసు, యోగ్యుఁడైన వానిలోటును దిద్దు
అనుభవంపు సార మందఁజేసి
వేఁపకాయ చేదు విఱుగు పండు కొలంది ॥విశ్వ॥ 1025

కొడుకు పుట్టెనన్నఁ గడు సంతసింతురు
మూఢమదుతురేల కూఁతురన్న
దివ్వె నిలుపఁ గొడుకె దిక్కని కాఁబోలు ॥విశ్వ॥ 1026

కడుపు చున్నయమ్మ కనక తప్పదు, వండు
కొనినయమ్మ తిండి తినకపోదు
పుట్టకుండ చింత పెట్టిన యమ్మకు ॥విశ్వ॥ 1027

మాటలాడనేర్వ మనకుఁదగవు లేదు
తినుటనేర్వ రోగ మనుటలేదు
దురిత చింతలేక దుఃఖమే లేదురా ॥విశ్వ॥ 1028

వాదబలమెయున్న వాదిబలంబున్న
పాడిపట్టు న్యాయ వాదివలయు
పరిగనున్న మంత్ర సాని కాన్పునకుండు ॥విశ్వ॥ 1029

నూరినూరిదాపు తుంత తుంతలపై పు
చేరుచుండు ముఁదము గోరుచుండు
నీరు నీరువైపు పాఱుట చూడవా ॥విశ్వ॥ 1030

సత్య మెఱిఁగి ధర్మ సందేహమును దీర్పు
పిన్న పిన్నగాఁడు పెద్దగాని
కర్ణుఁడున్న సభ వికర్ణుని మెచ్చరా ॥విశ్వ॥ 1031

హద్దు మీఱినట్టి అతివ పుట్టిన యింటి
మెట్టినింటి కీర్తి మట్టిసేయు
ఏఱు స్వేచ్ఛఁ బొంగ నిరుగట్లకును హాని ॥విశ్వ॥ 1032

జమ్మి విస్తరాకు నెమ్మిఁ గుట్టఁగవచ్చు
లెక్క పెట్టవచ్చు చుక్కలెన్నొ
కపటి యెడఁద లోతు గమనింప లేమురా ॥విశ్వ॥ 1033

పాలఁ బూలఁ బోలు బాలల హృదయాలు
సున్నితములు దైవ సన్నిభములు
వారిమేలు దేశ వైభవంబుల చాలు ॥విశ్వ॥ 1034

ప్రేమ తల్లిప్రేమ పెట్టు సవతితల్లి
పెట్టుఁ జూపునట్టి దిట్టయుందురి
వారితోడ చెల్మి వ్యర్థ వాక్కులకల్మి ॥విశ్వ॥ 1035

లోక వాంఛలెన్నొ లోగడ్డ కట్టిన
కడకు ముక్తి నెట్లు పడయఁ గలవు
శిలను దెప్పఁజేసి జలధి నెవ్వడుదాఁటు ॥విశ్వ॥ 1036

ఆశ్రయింప గొప్ప యండఁ జూపినవాని
సరకు గొనక సేగి నలుపుటరయ
నిక్కి చెట్టునెక్కి నిచ్చెనఁ దన్నుట ॥విశ్వ॥ 1037

సత్ప్రవర్తనగల శాస్త్రవేత్తఁ దొలంచి
అజ్ఞునేతఁజేయు టన్నునెన్న
మూతి కళ్ళెమూడ్చి మూడికిఁ బెట్టుట ॥విశ్వ॥ 1038

అల్పుఁజేరి యెంత యుడుగులొత్తిన గొప్ప
వాని కొల్వు ఫలము వడయలేము
గొడుగు నట్లు పుట్టగొడుగు నీడిచ్చునా ॥విశ్వ॥ 1039

దివ్యగుణ విరాజి దేశసేవారతుఁ
కష్టధూమ మెపుడు కప్పలేదు
ధూమ మబ్బు సతము బాధింపఁ జాలునా ॥విశ్వ॥ 1040

పనులు దీరుదాఁక పాపసేవయుఁ దీరఁ
జిత్త మతని కెరియ పేగి సేఁత
ఏఱుదాఁటి తెప్ప కిఁగల మిడుటరా ॥విశ్వ॥ 1041

అరుగఁ గలదు బల్లి యద్దము పైపైన
సింహమెక్కలేదు చెట్టునైన
స్రష్ట సృష్టిలోని శిష్టత కలదయా ॥విశ్వ॥ 1042

పలుపుఁ ద్రెంచుకొన్న పశువు వంటి మనస్సె
అడ్డమైన గడ్డి కాపవడును
దానిఁ గట్టివెయఁ దగినది జ్ఞానమే ॥విశ్వ॥ 1043

దొంగ దొంగఁ జేర దొరదొరఁ జేరుట
చిత్రమైన ప్రకృతి సిద్ధగుణము
నత్తగుల్ల లొకట నవరత్నము లొకట ॥విశ్వ॥ 1044

ఒక్క రూపమందు నుడిగిన శక్తివే
ఱొక్క రూపునందు నుజ్వలమగు
తపసి తనువు తగ్గ దైవశక్తి పెరుఁగు ॥విశ్వ॥ 1045

నీటికుండ దొక్క నియమితాకారంబు
ఐన నుపరిభాగ మంత సమమె
దైవతత్త్వ మహిమ దఱచఁగా నంతెరా ॥విశ్వ॥ 1046

తనకుఁ దెల్విలేమిఁ దలఁచి చింతింపక
హానిసేయఁ దగునె జ్ఞానికెన్నఁ
ద్రాడు లోటుబోవఁ దగున బావిని ఖూడ్వ ॥విశ్వ॥ 1047

కామధేను వున్న గల్ప వృక్షంబున్న
ఆశదీఱకున్న హాయి సున్న
ఇంద్రుఁడన్ని యుండి యెన్నిసార్లెగ్గొందె ॥విశ్వ॥ 1048

మానవులను మంచి మానవులుగఁ జేసి
దైవతత్త్వమునకు దారిఁ జూపు
గురువు గొప్పఁదనము గుర్తింప రందఱు ॥విశ్వ॥ 1049

లక్ష్యమెఱుఁగ నట్టి లక్షణ జ్ఞానంబు
అనుభవంబు లేని ఆత్మబోధ
మర్మ మరయకుండ మఱఁడ్రిప్పు చుండుట ॥విశ్వ॥ 1050

దోచఁ దిన్నకడుపు దొంగ పడిన యిల్లు
వేశ్య కన్ను పడ్డ విటుని యొడలు
ద్వీపము మిగ్రింగి నట్టి వెలగ పండే గదా ॥విశ్వ॥ 1051

మంచివాని మనసు మంచి వాఁడెఱుఁగును
కపటి తంత్రి మెల్ల గపటి యెఱుఁగు
పాము కాళ్ళ యునికి పామె యెఱుంగురా ॥విశ్వ॥ 1052

కొనికాలమందుఁ గర్మబంధముఁ జిక్కి
ఘనుఁడు హీనునట్లు గానఁబడును
నలుఁడు బాహుకుఁడయి నరునొరుఁగొల్వఁడా ॥విశ్వ॥ 1053

ఐకమత్యమునకు ఆరోగ్యమునకును
దూరమైన బ్రిదుకు భారమగును
అన్నియమరి యున్న అందఱు మొనగాండ్రె ॥విశ్వ॥ 1054

ఘనుని యండ లేమిఁ గళయందు నిధియైన
నొప్పి చూపలేఁడు గొప్ప కృతుల
ద్యుమణి లేక మణులు ద్యుతి పెల్లుచూపునా ॥విశ్వ॥ 1055

రాములమిత దీక్షఁ బ్రాణ మర్పింపఁగా
ఆంధ్రరాష్ట్ర మొదవె ఆంధ్రులలర
త్యాగ మొకరిదైన భోగ మింకొకరిది ॥విశ్వ॥ 1056

ఎద్దు ద్రొక్కినట్టి యెండు గడ్డినిదెచ్చి
దున్న మూతి కడకుఁ ద్రోయు రైతు
తల్లి యెఱిఁగి పెట్టు తనయుల తత్త్వంబు ॥విశ్వ॥ 1057

చదువు నెలకుఁ గ్రొత్త సాముదినము క్రొత్త
పూటపూట జపము పూన్కి క్రొత్త
ఎఱుక దెలుపు నీతు లెప్పుడు క్రొత్తరా ॥విశ్వ॥ 1058

కార్తిమూల మెఱుపు కాఱుమబ్బులఁ గూర్పఁ
పైరగాలి వానిఁ బాఱఁ ద్రోలు
పెట్టుమన్నచేతి నెట్టిన విధమురా ॥విశ్వ॥ 1059

శీతకాలమందు స్వేద రంధ్రములు
మూఁడుచుకొనుటఁ జెమట వెడల దింత
అచల గురుఁడుదెల్ప కజ్ఞత వెడలదు ॥విశ్వ॥ 1060

పక్షపాత మెడఁదఁ బ్రబలి పల్కిన పలు
కెద్దియైన నతని బుద్ధిలోని
తాఱుమాఱు గాక తత్త్వమ్ము మాఱునా ॥విశ్వ॥ 1061

వాంఛ కందని రస వాదమందుఁ జెడిన
వాఁడు వైద్యమందుఁ బ్రముఖుఁడగుట
కౌజు కొఱకు వేయఁ గాఱు కోడి పడుట ॥విశ్వ॥ 1062

ఎండనున్న మొక్క దండిగాఁ బెరుఁగును
నీడనున్న మొక్క చీడవట్టు
పడి మొలచిన మొక్క పాటికి వచ్చురా ॥విశ్వ॥ 1063

చాలకాల ముండుఁ జందనపుం గొయ్య
ఇనుము గట్టిదైన మనదు మట్టిఁ
బడవ నేలఁబోదు బండి నీటనుబోదు ॥విశ్వ॥ 1064

రాజకీయమందు రాజిల్లఁ దలఁచిన
ఓర్పుకొనుట ముందు నేర్చుకొనుము
ఓర్పు నేర్పులున్న నొదవును నభివృద్ధి ॥విశ్వ॥ 1065

రాజురూకలన్ని రమణీయమగు ధర్మ
డోలికలకు రత్న మాలికలకుఁ
గాక పేదవాని కడుపు గంజికిఁగాదు ॥విశ్వ॥ 1066

చిలుము వదలినంత సీద్రము వదలి న
ట్లయకెవ్వడీశుఁ దలఁచెదేని
పావపుంజమెల్ల భస్మమై పోవురా ॥విశ్వ॥ 1067

పదవిమీఁది మోజు ప్రజలమీఁదనులేని
నాయకునకు నోటు నీయరాదు
ఇత్తురేనవాని తొత్తులుగా సెంచు ॥విశ్వ॥ 1068

స్వపరి పాలనమ్ము సుపరి పాలనమని
అనిరి పెద్దలెల్ల అద్ది సత్య
మంచుఁ జూపలేని యధికార మెందుకు ॥విశ్వ॥ 1069

మద్యపాన మిచ్చు మైకమ్ము మొదలంట
అడఁచి వేయఁగలదు కుడితినీరు
సాధు బోధ యణఁచు సంసార మోహమ్ము ॥విశ్వ॥ 1070

సింహమునకు గ్రామ సింహము సరిగాదు
గుట్ట సాటిగాదు కులగిరులకు
పరమహంస సాటి వరులెవ్వరుంగారు ॥విశ్వ॥ 1071

సంద్రమీఁద వచ్చు సంసార మీఁద రా
దనెడి మాటలోని యర్థ మెఱిఁగి
కడచి బ్రదికితిమని గంతులు వేయకు ॥విశ్వ॥ 1072

కంచుకోట యైన గాలము దీఱిన
మంచు గుట్టవోలె మాసిపోవు
దైవశక్తి ముందు తనశక్తి యెంతరా ॥విశ్వ॥ 1073

ఆత్మశక్తి లేని యధముని శాపాలు
గాలి బుడ్డలోని గట్టితనము
తాలుగింజ నాటఁ దగ మొలకెత్తునా ॥విశ్వ॥ 1074

పులల పోటియాఁగ పులులెన్నఁడును గావు
ధీర సాటిగాఁడు భీరువెపుడు
సింహమునకు గ్రామ సింహము సాటియా ॥విశ్వ॥ 1075

రంగుమాయగొప్ప రాసాయనికపరి
వర్తనంబు లేదు వజ్రమునకు
సిద్ధ పురుషుల దృఢ చిత్తము మాఱదు ॥విశ్వ॥ 1076

పైరు తీరుచూచి పంట యంచనవేసి
సేద్యకాఁడు ముంద చెప్పఁగలఁడు
శిశువు గుణము లరసి చెప్పవచ్చును భావి ॥విశ్వ॥ 1077

మూఁడు దశల భక్తి ముక్తి నాసింపక
కొసకువానిఁగోరి కొంట కీటి
కఱవు వచ్చినపుడు చెఱువు త్రవ్వించుట ॥విశ్వ॥ 1078

బుధ వరుండులేని పురిఁ బది శ్లోకముల్
పలుకువాఁడె గొప్ప పండితుండు
గోవులేనియూర గొడ్డె గోమాతరా ॥విశ్వ॥ 1079

తప్పుఁ దానొనర్చి ధర్మాత్ముపై నెట్టి
నిక్కి తులువ రచ్చ కెక్కుటన్న
మగనిఁగొట్టి మగువ మొగసాల కెక్కుట ॥విశ్వ॥ 1080

కరుణ రసములేని కఠినాత్ము దరిఁజేరి
కష్టపడిన ఫలము గలుగ దెపుడు
రాతిచెట్టు రాల్ప రాలునా ఫలములు ॥విశ్వ॥ 1081

గాలివాన మేడ గలవాఁడు తొనకఁడు
అండయున్న బ్రదుకు హాయిమెండు
ఒత్తుడున్న వాఁత మెత్తగా జరుగును ॥విశ్వ॥ 1082

రత్నగర్భ యనెడి ప్రఖ్యాతి గల భూమి
గూడులేక ప్రజలు కుందుటన్న
నీరులేదు త్రావఁ బేరు గంగానమ్మ ॥విశ్వ॥ 1083

నీతిపరుని నీచు నిందింపఁ గడకది
తిరిగివచ్చి తనదు పరువె తీయు
ఎదురుగాలి కుమియ అది మోముపైఁబడు ॥విశ్వ॥ 1084

ఊన్నయూరఁ దనకు నుద్యోగ మిచ్చినఁ
జేయఁ దలఁచి వేళ చేయననుట
మంచమున్న చోట మగువ నీళ్ళాడుట ॥విశ్వ॥ 1085

దుండ గీండ్రవలన దొడ్డవారికిఁ జెట్ట
గలుగఁ దగిన శాస్తి సలుపఁడేని
జేఁడు జేఁడు గాఁడు ప్రేతాధిపతి గాని ॥విశ్వ॥ 1086

మూర్తి చెలువు కొంత కీర్తి విస్తారమ్ము
కూతఁఘనము పిట్ట కొంచమైనఁ
బికము పాటకెవఁడు ప్రియపడ కుండును ॥విశ్వ॥ 1087

లేనివాని కింత లేదన కుండ నీ
వాదుకొనుట మేలు పొదుకొనుట
పెట్టనీకు మరలఁ బుట్టునందురు బుధుల్ ॥విశ్వ॥ 1088

పరుల మేలుచూచి పరితపించుచు లేని
నిందలను సృజించి నీచుఁడడఁగుఁ
జెట్టఁ బుట్టునగ్ని చెట్టునే కాల్పదా ॥విశ్వ॥ 1089

సజ్జనుండు మెందు సద్బోధ చేసిన
కఠిన చిత్తు మనసు కరఁగదెపుడు
గానమునకు చింత కాయలు రాలునా ॥విశ్వ॥ 1090

దుష్టతతి మెలఁగుచు దోషిని కానని
నచ్చఁ జెప్పనెట్లు నమ్ము జగము
మద్యశాల నుండి మధువు గ్రోలననుట ॥విశ్వ॥ 1091

పండితోత్తముండు వసియించు తావునఁ
బామరుండు నీతి పలుకఁ టెన్నఁ
గమ్మరి గల వీధిఁ గత్తుల నమ్ముట ॥విశ్వ॥ 1092

సోలకమున రోగి తేలుకోఁ జాలఁడే
గ్రీష్మ మందు మిగుల గిజగిజ యను
సమయమబ్బ మంచి సాధించు కొనుటొప్పు ॥విశ్వ॥ 1093

శక్తిలోన జీవమున్నది చూడఁగా
భక్తిలోన ముక్తి వరగుఁ దెలియ
సత్త్వ వర్తనమున సాధించుమా శక్తి ॥విశ్వ॥ 1094

తత్త్వ మెఱుఁగకున్నఁ దగఁగావికట్టిన
ఘనుఁ డటంచువాని గౌరవింత్రు
కోనలున్న పుట్టఁ గొనరి పూజింపరా ॥విశ్వ॥ 1095

గ్రామనేత యమిత కలుషాత్ముఁ డైనఁ ద
ద్గ్రామ మెల్లఁజేయుఁ గల్మషంబు
మొదటి గొఱ్ఱెదాఁట మొత్తము దాఁటురా ॥విశ్వ॥ 1096

వాది బలము చేత వాద మెట్టులఁ ద్రిప్ప
నట్లె తిరుగుచుంట నరయఁ గలము
బురదఁ గంబ మరయఁ దిరుగదా యెటులైన ॥విశ్వ॥ 1097

పరుగువారు వాఁడె పడిపోవు నొకవేళ
మెల్ల నడుచువాఁడె చల్లఁజేరుఁ
బందె మందు గెలిచెఁ గుందేటిఁ దాబేలు ॥విశ్వ॥ 1098

లోభి కెంతగొప్ప లాభంబు గలిగినఁ
దినఁడు తాను వరుల దినఁగనీఁడు
కోఁతి కబ్బినట్టి కొబ్బరి బొండ్లమే ॥విశ్వ॥ 1099

ధర్మ విదులు బుధులు దయతోడఁ దెలిపినఁ
జెవుల సోఁకనీక చెనటి చెడుట
వెజ్జుమాట రోగి యుజ్జన సేయుట ॥విశ్వ॥ 1100

పైఁడి గిన్నెలోన పాల్పోసి పెంచినఁ
బావమనక పాము పడగవిప్పుఁ
గుమతి కుపకరింపఁ గ్రూరత్వమునె చూపు ॥విశ్వ॥ 1101

పాలుత్రాగి పాము భయద విషంబిడు
పశువు కసవుమేసి పాలనిచ్చు
జన్మగుణము మార్చ జలజజు తరమౌనె ॥విశ్వ॥ 1102

ఇల జనించుఁ దావి యెలగోలు జల్లున
ముదము గలుగఁ బుట్టు మొలకనవ్వు
ధర్మదృష్టి యున్న దైవకళల్వెల్గు ॥విశ్వ॥ 1103

తెచ్చికొన్న చోటఁ దెలివితోఁ దలయొగ్గి
చెప్పవలయు మాట చెల్లువలకు
చెప్పలేని మనుజుఁ డప్పుచేయుటె తప్పు ॥విశ్వ॥ 1104

సాధు జనవరేణ్యు బాధింపఁ జూడకు
తెలియకుండ నిన్నుఁ దిరిగికొట్టు
దుమ్ము సూర్యుపైకి చిమ్మ నీపైఁబడు ॥విశ్వ॥ 1105

బూతుకున్న విలువ నీతికి లేనప్డు
దేశమాత యెట్లు తేజరిల్లు
తరణియిచ్చుఁ గాని తమమిచ్చునా వెల్గు ॥విశ్వ॥ 1106

ఆత్మశుద్ధిఁ గలుగు ఆనందమును వీడి
బాహ్యశుద్ధిఁ బరము పడయఁ గనుట
పంట విడిచిపెట్టి పరిగ యేరినయట్లు ॥విశ్వ॥ 1107

శాంత శమదమాది సద్గుణి నాఁదోఁచు
ధర్మరాజరి యమ ధర్మరాజు
పైకి బత్తిలోన పదనైన కత్తిరా ॥విశ్వ॥ 1108

ఈఁగిచేయి యెపుడు దాగదు, యుద్ధాన
శౌర్యశాలి యెపుడు జాఱఁబోఁడు
పరమహంస యెపుడు బంధాఁ జిక్కఁడు ॥విశ్వ॥ 1109

చంద్రుఁ జూడఁ గనులు చల్లఁగా నుండును
సూర్యుఁ జూడఁగనులు చుఱచుఱమను
తన్నుఁ దానుచూడ దైవమై తగవెల్గు ॥విశ్వ॥ 1110

ఆత్మ దాగియున్న అఖిలేశుఁ గనలేక
బయట వెదుకనేమి ఫలము? బిడ్డ
నూర వెదతినట్టు నూయేల నిడుకొని ॥విశ్వ॥ 1111

విష్ణి దేవుఁడనెడి వైష్ణవ వరునితో
శివుని దివ్యమహిమ చెప్ప నతని
పంటి క్రింద ఱాయి పడిన చందఁబౌను ॥విశ్వ॥ 1112

బోడి తలకు గొప్ప భూషలు గూర్చిన
అందమట్టులుండ హాస్యమొదవు
విద్యలేనివాని వింత వేషఁబట్లు ॥విశ్వ॥ 1113

ఒకరిమేలు చూచి యుత్సాహ పడితివా
నీదుమేలు చూచి నిఖిలజగము
సంతసించు నంట సత్య దూరముగాదు ॥విశ్వ॥ 1114

మనము తెచ్చికొన్న మతము లెన్నేనున్న
లేదు మూలసూత్ర భేదమనుచు
మనుజ సేవపేయు మానవతావాది ॥విశ్వ॥ 1115

ఆదిమానవ తతి అడవి జంతువులట్లు
మనెడివేళఁ గలవె మతములిన్ని
తెలివిహెచ్చి లేని తిప్పలు దెచ్చెరా ॥విశ్వ॥ 1116

ఈసు రోసము: అకు దాసులై ప్రజలున్న
దేశమందు శాంతి తేజరిలునె
వాయుకుండమున్న వార్ధిచందమెగదా ॥విశ్వ॥ 1117

పాపపుణ్య చయము పరదేశమున లేదు
నీదు చర్యలందె నిండియుండు
అనుభవమును బట్టి ఆత్మకుఁ దెలియును ॥విశ్వ॥ 1118

వరిగతి శీలమైన పాశ్చిమంచికాచార
ముండ దెల్లకాల మొక్కరీతి
మార్పు నడ్డుపెట్ట మానవ శక్యమా ॥విశ్వ॥ 1119

ఇచ్చుకొన్నయమ్మ పుచ్చుకొన్నమ్మయు
బాగుగానె కడకు వరగుచుండ
నెదురుపడిన యమ్మ కేర్పడునావద ॥విశ్వ॥ 1120

గొప్పవాని గుణము గొప్పవాఁడెఱుఁగును
శఠుని దుర్గుణమ్ము శఠుఁడెఱుఁగు
యోగి దివ్యమహిమ యోగికే తెలియును ॥విశ్వ॥ 1121

బలియుతోడఁ బోర బలహీనుఁ డేగిన
భంగపడును గాని బాగుపడడు
మిడుత లింగలమును మ్రింగఁబోయిన రీతి ॥విశ్వ॥ 1122

ఎవని వలనమండు టెండలు కాయునో
కురియు వానివలన కుంభవృష్టి
కపరు కొన్నవాఁడె కొసకు లాభముగూర్చు ॥విశ్వ॥ 1123

పోతుటీఁగయైన బోరాని చోటికి
విటుఁడు పోవుటన్న వింతగాదు
కోటగుట్టు దాసి కొనగోట నుండుట ॥విశ్వ॥ 1124

సత్యమునకు బాట చక్కగా నొక్కటే
బూటకమున కెన్నొ బాటలుండు
సతికి మగఁడొకండె సానికి పెక్కురు ॥విశ్వ॥ 1125

వానవచ్చు రాక ప్రాణము పోయెడి
పోక చెప్పఁగలుగు ప్రోడయెవ్వఁ
డంత జ్ఞానమున్న నాతండె యీశుండు ॥విశ్వ॥1 126

కూడొకింతవేయ కుక్క తోఁకాడించు
లంచమీయఁ గుఱకు లంచగొంఁడి
దోఁచిపెట్ట మిగుల తోషించు వెలయాలు ॥విశ్వ॥ 1127

కూడులేని వాఁడు కూటిలోఁ దనిపన
నన్నియున్న వాని కాసమెండు
కన్నయమకె వాపు తిన్నమ్మకే వాపు ॥విశ్వ॥ 1128

మున్నె పుణ్యకర్మ ములుసేయకీనాఁడు
గొప్ప సౌఖ్యములను గోరికొనుట
విత్తకుండఁ గోయ వెడలిన చందంబు ॥విశ్వ॥ 1129

సాధ్యమైన దాని సాధింప వచ్చు న
సాధ్యమెట్లు మనకు సాధ్యపడును
ఏన్గు నెవఁడు పెట్టు నేకుల బుట్టిలో ॥విశ్వ॥ 1130

తీవ్ర చర్యఁ బరపి తీడ్రించి దొంగను
బట్టి కున్న దొరకుఁ బరువులేదు
కుట్టకున్నఁ దేలుఁ గుమ్మరి పుర్వండ్రు ॥విశ్వ॥ 1131

ఆసలేని వాని కరివర్గమే లేదు
సత్యశక్తి కెపుడు చావులేదు
కంజ వైరిలేమి గ్రహణమే లేదురా ॥విశ్వ॥ 1132

పంజరమున నుంచి పండ్లతోఁ బెంచినఁ
జిలుక పోలెఁ గాకి పలుకఁ గలదె
మునికి మోక్షమబ్బు మూర్ఖున కబ్బునా ॥విశ్వ॥ 1133

తనదు మేలుకోరి ధర్మ యుక్తంబుగా
సంచరింపఁ గీడు జరుగఁ బోదు
నోరు మంచిదైన నూరు మంచిదగును ॥విశ్వ॥ 1134

ఆదరించి యెవని కవకాశ మిత్తుమో
వాఁడె కడకు మనకు కీడుఁ దలఁచు
ఇంటఁ దిన్న వాఁడె ఇంటి వాసములెన్ను ॥విశ్వ॥ 1135

చెమటఁ దీసి పైచి సిరినొందవలెఁగాని
తిరిప మెత్తనేమి జరుగు సుఖము
కొన్నఁ దీరుఁగాని కొసరినఁ దీరునా ॥విశ్వ॥ 1136

గొప్పవాని యెదుట నెప్పుడు హీనుఁడు
నిల్వఁబోఁడు నిల్చి గెల్వఁబోఁడు
సూర్యుఁడున్న యపుడు చుక్కలు తోఁచునా ॥విశ్వ॥ 1137

రోగ మెపుడు దాఁప కేగి వెజ్జుకుఁ జెప్పు
వేని వేగఁ దెచ్చు హాని నీకు
మూసిపెట్టి నంత పాసిపోయిన రీతి ॥విశ్వ॥ 1138

చతుర మతులు సేయఁ జాలని కృత్యముల్
చెలఁగి మందులెట్లు సేయఁగలరు
మదగజములు పొఱ మశకముల్ నిలుచునా ॥విశ్వ॥ 1139

తుష్టి గలుగఁ జేయు పౌష్టి కాహారమ్ము
చిక్కదేని ప్రాణి చిక్కిపోవు
నీరులేని చేను నిల్వున నెండదా ॥విశ్వ॥ 1140

చేతగాని పనులు చేయలే కొరులను
దూలనాడ నేమి మేలు కలుగు
ఆడలేక మద్దె లోడని యన్నట్లు ॥విశ్వ॥ 1141

మెట్టపంటఁ దిన్న గట్టిపడు తనువు
జ్ఞాని బోధ విన్న జ్ఞానమబ్బు
మంచి నడత యున్న మదికి సుఖంబుండు ॥విశ్వ॥ 1142

కత్తిబట్టుచేతఁ గలముఁ బట్టుటెగాదు
జరుగ జరుగఁ దెలివి పెరిఁగి పెరిఁగి
హలముఁ బట్టుచేతఁ గలమును బట్టిరి ॥విశ్వ॥ 1143

వెన్కముందు లింత వీక్షింపఁ జాలక
సౌని వలకుఁ జిక్కు వాని బ్రదుకు
కల్లుకుండఁ బడ్డ బల్లి చందమె గదా ॥విశ్వ॥ 1144

శివుని గొల్వ కితర చిల్లర దేవుళ్ళఁ
గొనరి నీవు నిచ్చ గొల్చుటెన్న
తల్లి కన్నులిడక దాసిని గొల్చుట ॥విశ్వ॥ 1145

తెలివి గలఁడె యైన ధీరత్వమున్నన
సాధ్యమెట్లు తనకు సాధ్యపడును
శిలను దెప్పఁజేసి జలధి నీఁదఁ గలాఁడె ॥విశ్వ॥ 1146

కొమ్మ చివఱనుండి కోకిల కూసిన
శ్రావ్యమగుట జనము సంతసించు
కలుగునొక్కొ ముదము గాడిద యఱచిన ॥విశ్వ॥ 1147

కొడుకు చెడ్డఁడైన కూటికిఁ గొఱతయౌ
కూఁతురట్ల యైన ఖ్యాతి తఱుగు
ఆలు చెడ్డదైన అష్టమ శనిగదా ॥విశ్వ॥ 1148

దూషణమును గాని భూషణమ్మును గాని
శత్రునైనఁ బరమ మిత్రునైన
సమతఁ జూచునేర్పు సాధించు టొకయోర్పు ॥విశ్వ॥ 1149

తనువు తత్త్వ మరసి తగిన యాహారమ్ము
తీసికొన్న నరుఁడు తేజరిల్లు
ఎఱిఁగి పైరుతీరు ఎరువు వేయుట లెస్స ॥విశ్వ॥ 1150

ఏమిలేని వాని నెవ్వఁడే నొకపెద్ద
ఆదుకొన్న వతఁడు పాదుకొమను
చెట్టు చిక్క తీఁగ చేరదా కొపకొమ్మ ॥విశ్వ॥ 1151

ఆలుసుతులు చెప్ప నట్లుఁడిరా సౌఖ్య
గోపురమ్ము వాని కాఁపురమ్ము
ఎదురు నడుతురేని యదె యమలోకమ్ము ॥విశ్వ॥ 1152

లోభి నిత్యదాన లోలుఁడై వర్తిల
మూఁగ మాటలాడ సాగినట్లు
ధారెడారి వర్షధారలు పడినట్లు ॥విశ్వ॥ 1153

కండ బలిమి కలిమి దుండగ ముల్నోయు
చెనటి కెపుడొ దెబ్బ చేటు ప్రభుత
మొఱకుటెద్దుఁ బట్టి ముకుత్రాడు వేయరా ॥విశ్వ॥ 1154

దేహి దేహమందె దేవుఁడు వెల్గుట
తెలియ కందు నిందు తిరుగుటన్న
నటకుఁడు తెఱనున్న నటు నిటు వెదకుట ॥విశ్వ॥ 1155

వెన్నపుట్టు దాఁక వీక్షించు చుండినఁ
జెఱకు తియ్యఁ దనము చెదరిపోవు
ఆలసించినంత అమృతమ్మె విషమగు ॥విశ్వ॥ 1156

ఎంత యోర్పు తోడ నెందఱు సెప్పిన
హీనగుణము జడుఁడు మానఁలేడు
తప్పు వాఁచుఁ జేరుఁ గమలము న్గోరునా ॥విశ్వ॥ 1157

బిడ్డ లోట్లు ముందె పితరులు దిద్దక
గురుఁడె దిద్దునంట కూడదెపుడు
కంద కుండని జిల కత్తి పీఁటకు నేల ॥విశ్వ॥ 1158

ఓనమాలు చదివి యానవాలను జూచి
ఆత్మ నెపుడు దాని యందె నిలిపి
పరము గోరు నరుఁడె వరశివయోగిరా ॥విశ్వ॥ 1159

ఎవని కెప్పు డెద్ది హితమగు నదిసెప్ప
కేదొ చెప్ప ఫలిత మేమికలుగు
ఆజ్య మీయఁ దప్పి కాఁకునా పెరుఁగునా ॥విశ్వ॥ 1160

జీవయాత్ర కనువు చిక్కని తావున
నొప్పు మీఱఁ బ్రాణి యుండుటెట్లు
ఉప్పునీటి కుప్ప కప్ప వసించునా ॥విశ్వ॥ 1161

అక్కఱున్న యప్పు డతివిన యమ్మతోఁ
జేరి యద్ది తీర సేగి సేఁత
రేవు దాఁటినంత నావఁ గాల్చిన యట్లు ॥విశ్వ॥ 1162

పరుల పల్కులన్ని పరమ సత్యములను
గ్రుడ్డి నమ్మకమ్ము కూడదెపుడు
భావదాస్య మెంత పనికి మాలిన దయా ॥విశ్వ॥ 1163

క్రూరు లెంద తైన గుణవంతుఁ బోలరు
భీరు లీడుగారు ధీరు తోడ
దొంగ లెంద తైన దొరకు సాటగుదురా ॥విశ్వ॥ 1164

తోడి నరుని జూడు తోఁ బుట్టువట్టుల
నతఁడు గూడ నిన్ను నట్టె కన్న
అన్ని ధర్మములకు ఆలంబనంబది ॥విశ్వ॥ 1165

మనసులోన యొకటి మాటాడునది యొండు
చేఁత యింక నొకటి చెనఁటి బ్రదుకు
కసవు గప్పియున్న కాసారమే గదా ॥విశ్వ॥ 1166

తప్పు దా నొనర్చి ధర్మాత్ముపైఁ బెట్టి
నిక్కి తులువ రచ్చ కెక్కుటన్న
మగని గొట్టి మగువ మొగసాల కెక్కుట ॥విశ్వ॥ 1167

తప్పులేని వాఁడు తలవంపఁ బనిలేదు
ముప్పురాదు వాని గొప్పచెడదు
చిక్కుఁ జిక్కి యిల్లు సేరఁడా పరివరుఁడు ॥విశ్వ॥ 1168

ఛాత్రు నట్లు బుధుని సన్నిధి యెదొ నేర్చి
అతని కెంతొ కడకు హానిసేఁత
యన్న మిడిన యింట కన్నము వేయుట ॥విశ్వ॥ 1169

నిజము చెప్పువేళ నీళ్ళు నములుటేల
సత్యమొండె దైవ సమమటండె
సత్యవాది కీర్తి శాశ్వతంబుగ నిల్చు ॥విశ్వ॥ 1170

ఏది యెట్టులైన నేమి నాకనియెడి
మనుజుఁ డెట్టు పరిగతి మనఁగలండు
మన్నుదిన్న పాము వలెఁ దిరి పడియుండు ॥విశ్వ॥ 1171

నాకమందు గొనుట నరకంబు పొందుట
తత్త్వ చింతచేత తఱచి చూడ
మతములోన లేదు మతిలోన యున్నది ॥విశ్వ॥ 1172

ఉప్పునీరు త్రావ దప్పిక దీఱదు
కఱవు దీఱఁబోదు పరిగ యేర
అంగిలార్చఁబోదు దొంగతనము సేయ ॥విశ్వ॥ 1173

యౌవనంబు నరుల కక్షయ మనరాదు
వ్యాధి పొంచియుండు నాయువెన్న
ఓటి కుండలోని నీటి విధంబురా ॥విశ్వ॥ 1174

గర్భ నరకమందుఁ గాసెలి యిలబడి
మురిసి మోహవార్ధి మునిఁగె దేల?
ముఱికి బొంది కింత ముచ్చట యేలరా ॥విశ్వ॥ 1175

శుద్ధశక్తి నాత్మ వృద్ధి క్షయంబులఁ
బొరయ దెప్పుడరయ ముసలి తనము
తనువు పొందుఁగాని మనసున కున్నదా ॥విశ్వ॥ 1176

ప్రాణములను దీయుఁ బడమటి పవనము
ప్రాణమిచ్చు చుండు పైరగాలి
స్థాన మహిమగాని తన మహిమా యది ॥విశ్వ॥ 1177

ధర్మమనక పాప కర్మంబు లెన్నక
తానొనర్చి నట్టి తప్పులన్ని
తాను మఱచి పోవ దైవంబు మఱచునా ॥విశ్వ॥ 1178

వయసు నెన్న నేల పరమ సుజ్ఞానికి
పతిని గొల్వ సతికి వ్రతములేల
గుణము మంచిదైన కులముతోఁ బనియేమి ॥విశ్వ॥ 1179

అజ్ఞుఁ డంచుఁ దెలిసి యధికార మర్పించి
అతని చేఁత నిచ్ఛ నరయుచుంట
పీఁట వెంటఁ గొనుట పీతాంబరం బిచ్చి ॥విశ్వ॥ 1180

తపను కిరణములకుఁ దన వీపు మాడిన
నీడెకాదు ఘనుఁడు నీళ్ళనిచ్చు
ఉత్తముండు పరుల కుపకరించును నిట్లె ॥విశ్వ॥ 1181

తనదు తప్పులన్ని తానాత్మ నెఱిఁగియు
ఒప్పులంచు మార్చి చెప్పుచుండు
ఒకఁడు గాకయున్న నొకఁడైననెఱుఁగఁడా ॥విశ్వ॥ 1182

ఎవఁడు సృష్టిసేయు నెవఁడు పోషించును
ఎవఁడు లయ మొనర్చు నెఱిఁగి యట్టి
శివున కెఱుకలేక చీమైనఁ గుట్టదు ॥విశ్వ॥ 1183

పోతుటీఁగ యైన బోరాని చోటికి
విటుఁడు పోఁగలండు వెల వెఱింగి
ఆఁడుదాని మాయ యంతింత యనరాదు ॥విశ్వ॥ 1184

అమరులట్లు మాట లాడుచు నుందురు
వెడగు దైత్యులట్లు నడచు చుందురు
నీతులన్ని యుసుక నేల వానేగదా ॥విశ్వ॥ 1185

పాపపుణ్యములను బాటింపకై హిక
సుఖమె సుఖమటంచుఁ జూచువాని
నియమ నిష్ఠలన్ని నిష్ప్రయోజనములు ॥విశ్వ॥ 1186

మురుగు నీట మెలఁగి తరలిన వీచూలి
యింపనట్టి చెడ్డ కంపుగొట్టు
చెడ్డవారి చెలిమిఁ జేకూరు గుణమటు ॥విశ్వ॥ 1187

విత్తమున్న వేళ వత్తురు మెత్తురు
లేనివేళ నొక్కఁడు కానరాఁడు
చెఱకు రసపుఁ గుండఁ జేరునీఁగలు మెండు ॥విశ్వ॥ 1188

ఎన్నొ జీవులున్న నేతెగ కాతెగ
కలసి మెలసి తిరుగు కాననమున
గుణముఁ బట్టి నరులు కూడుదురా రీతి ॥విశ్వ॥ 1189

ఆలుబిడ్డలనఁడు హాని వృద్ధులనండు
బట్టలనఁడు మేలి చుట్టలనఁడు
మన్నుమిన్ననండు మాయదారి మగండు ॥విశ్వ॥ 1190

అణువు నణువుఁ జేరి యబ్జ జాండంబయ్యె
జలధి యయ్యె బిందువుల కలయిక
పదము పదము చేరి భాషగా రూపొందె ॥విశ్వ॥ 1191

ఎరలభింపఁ గుక్క లెగఁజిమ్ముఁ బోట్లాటఁ
గలసి మెలసి తినును గాకిగుంపు
మనుజులందు నిట్లు మనుచుండు రెండటు ॥విశ్వ॥ 1192

సహకరించు దన్క సహచరుండుగ నుండి
అక్కచెల్లెఁ దీర హాసిసేఁత
అమ్మపాలు ద్రావి యొమ్మన గ్రుద్దుట ॥విశ్వ॥ 1193

పూలనున్న గాలి చాల సువాసన
మురుగునీటి గాలి ముఁక్కు వగులు
ఘ్రాణశక్తి గాని తనశక్తి గాదురా ॥విశ్వ॥ 1194

ఒనకఁదనదు మీఁది యున్నతోద్యోగిని
మంచిచేసి కొని గడించు నతఁడు
కొల్చు గాదె క్రింది కొక్కు విధంబురా ॥విశ్వ॥ 1195

ధర్మ సూక్ష్మ చయము దాఁపక తెలిపెడి
సరస భావకేంద్రు సత్కవీంద్రు
కలము మహిమఁ దెలియఁ దలమె పామరులకు॥విశ్వ॥ 1196

తప్పొనర్చి పైకి ధైర్యముతో నున్న
నెంతొ బాధపెట్టు నంతరాత్మ
పొంగముఖము, నలుపు, తోఁబుట్టువులె గదా ॥విశ్వ॥ 1197

కులపతికి నైనఁ గోటీశ్వరున కైన
నేదొ చింతయుండు నెఱిఁగె దేని
చింతలేని నరుఁడు చిక్కఁడు ధరలోన ॥విశ్వ॥ 1198

తన కుటుంబమునకుఁ దా వెల్గు నిచ్చెడి
సూర్యునట్లు దనరు సుజన వరుఁడు
చెనటి చీఁకటివలెఁ జెట్ట చేకూర్చురా ॥విశ్వ॥ 1199

అనుభవజ్ఞులైన ఆచార్య వర్యుల
పూజచేసి వృద్ధి పొందఁదగును
గురుల ధిక్కరింపఁ గూడదెన్నండును ॥విశ్వ॥ 1200

కష్ట సుఖములందు ఘనతను గోల్పోక
స్థిరతనున్న వాఁడె ధీర వరుఁడు
ఎండ వానల గిరి యుండదా యొకరీతి ॥విశ్వ॥ 1201

చిలుక పలుకులట్లు పలికిన మాత్రాన
మంచివాఁడ టంచు నెంచరాదు
వర్తనమును బట్టి వాకొనఁజెల్లును ॥విశ్వ॥ 1202

శ్రేణిగట్టి చనును చీమలు, కొంగలు
బారు తీరి మింటఁ బాఱుచుండు
కొంచ నరున కట్టి క్రమశిక్ష లేదురా ॥విశ్వ॥ 1203

ప్రకృతి పుస్తకమ్ము పరమేశ్వరుఁడు కర్త
నరుఁడు పాఠకుండు తర తరముల
నంతరాత్మ వాని కాచార్య వర్యుఁడు ॥విశ్వ॥ 1204

గూటి గ్రుడ్ల నొకఁడు వాటముగాఁ దీయు
నొడిఁగలట్టి గ్రుడ్ల నొకఁడు దీయు
నేల వేయకుండు రెత్తుకు పైయెత్తు ॥విశ్వ॥ 1205

తల్లి దండ్రి మిత్రుఁ డెల్లవేళలఁ గాచు
వారి వారికున్న స్వార్థ పరత
చెలుల యట్లు పరులు చేరుచు నుందురు ॥విశ్వ॥ 1206

పెద్దలాడు మాటఁ బెడచెవిఁ బెట్టుచుఁ
గండ కావరమున ఖలుఁడు మెలఁగి
తేవలేని నాఁడు కావరేయని మ్రొక్కు ॥విశ్వ॥ 1207

లోభి మరణమునకు లోకము శోకింప
దమిత దాత చావ నడలు జగము
మణికి నేడ్చుఁగాని మసిపాత్రి కేడ్చునా ॥విశ్వ॥ 1208

రాణి గారవించుఁ దేనెటీఁగలు తుట్టెఁ
గరిపతి చనుబాటఁ గరులు చనును
తల్లిమాట వినఁడు తనయుఁడు నరులలో ॥విశ్వ॥ 1209

మంచిసేయ నీకు మంచి సంప్రాప్తించు
చెడ్డసేయ నీకు చేటు కలుగు
తిన్నదేదొ యదియ త్రేఁపు వచ్చునుగదా ॥విశ్వ॥ 1210

చెంతనున్న గొప్ప శివలింగమును జేర
దున్న బురద రుద్దు కొన్నయట్లు
ఖలుఁడు లేని వద్ది ఘనుల దూషించును ॥విశ్వ॥ 1211

ప్రాణికోటి లెల్ల భగవంతుఁ డొక్కఁడే
పతికిఁ బతియొకండె సర్వమునకు
కాంతి నిచ్చువాఁడు కమలమిత్రుఁ డొకండె ॥విశ్వ॥ 1212

కోటి లాభములను గోరికొంటయె గాని
ఒక్కటైనఁ దనకు దక్కదన్న
రేఖ చక్క లేక శ్రీలెట్లు దక్కును ॥విశ్వ॥ 1213

గిల్లి జగడమాడు కితవుల మాటకు
విలువ నీకు వారిఁ గలయఁ బోకు
బురద ఱాయివేయ మోమెల్లఁ జిందురా ॥విశ్వ॥ 1214

జంకువాఁడు పనిని సాధింపఁ గాలేఁడు
శ్రద్ధ కలఁడ యేని జయము వడయు
ఒడలు వంచిచేయ అడలును పనిగూడ ॥విశ్వ॥ 1215

ఔషదంబు లేవి ఆయువు నీయవు
మనుజు రోగమునకె మందుగాని
అవియుఁ బారదింత ఆయువు లేనిచో ॥విశ్వ॥ 1216

ఒకఁడు బాగుసేయు ఒక్కఁడో గౌనరించు
ఒకని కొక్కఁడెట్టు లుద్ధియగును
సమము లెట్టులౌను జడికారు వడకారు ॥విశ్వ॥ 1217

రైలు పెట్టెనున్న ప్రజలకు మఱకాఁడు
కానరాని యట్ల కానరాఁడు
జగము నడుపునట్టి భగవంతుఁడును గూడ ॥విశ్వ॥ 1218

ముత్య మగును జినుకు ముత్యపుఁ జిప్పలో
నీళ్ళఁ బడ్డ చినకు నీళ్ళఁ గలయు
బోధ సార్థకమగు బుద్ధిమంతుని యెడ ॥విశ్వ॥ 1219

విత్తులేని చెట్టు విశ్వమెల్లను నిండె
ఫలము పామరుండు వడయలేఁడు
తమ్ముఁదాను తెలిసి కొన్నవానికె దక్కు ॥విశ్వ॥ 1220

చల్లగాలి తగుల జలదము వర్షించు
బాల నిదురపోవు జోలపాడ
రో వెలంది మెచ్చు రొక్కము పెక్కియ ॥విశ్వ॥ 1221

శిలల తోడ రూపు శిల్పి చక్క నమర్చు
మాటతోడ రూపు మలచు సుకవి
సృష్టిసేయు రూపు స్రష్ట సంకల్పాన ॥విశ్వ॥ 1222

కొన్ను కొమ్మనకును గండంబు స్త్రీలకు
నదికి నదికి బెడద నావికునకు
అడుగడుగున హాని అనిమొన భటునకు ॥విశ్వ॥ 1223

దుస్తు లెటులయున్న దస్తూరి యెటులున్న
నజుని వ్రాంత మంచి దైనయెడల
నన్ని చక్క దక్కు నతఁ డందలంబెక్కు ॥విశ్వ॥ 1224

ఎంత తెలివియున్న నెంత బలఁబున్న
తన కదృష్ట రేఖ తనరదేని
నత్తివాని చేతి హొత్తముతే గదా ॥విశ్వ॥ 1225

ఖలుని మనసు నందు మెలఁగెడి దుశ్చింత
వరుణ కేరికంతు పట్టదెపుడు
గాలి లీనమైన ధూళిరీతిగ నుండు ॥విశ్వ॥ 1226

చేత మెతుకులున్నఁ జేరును గాకులు
లేనివేళ నొకటి కానరాదు
స్వార్థపరత నుండు జన్మముతో జీవి ॥విశ్వ॥ 1227

గర్భ వాతమున్నఁ గడుగట్టిపడునాభి
క్రౌర్యమున్న మనసు గట్టిపడును
నాడు గట్టిపడును నరుల యైక్యతయున్న ॥విశ్వ॥ 1228

సుజను మైత్రి సర్వ శుభముల నిచ్చును
చెనటి చెలిమి మిగుల చేటుదెచ్చు
అమృతమిచ్చు సుఖము హాలాహలంబీను ॥విశ్వ॥ 1229

తెలివి సుంతలేని దేబెకుఁగడు గొప్ప
విద్దనేర్పు యత్న మద్ది కాకిఁ
బంజరమున నుంచి పలుకులు నేర్చుట ॥విశ్వ॥ 1230

సింహమునకు సాటి చిట్టెల్క యెట్లౌను
కుక్క యెట్లుసాటి గుఱ్ఱమునకు
భీరు వెట్లుసాటి ధీర రత్నమునకు ॥విశ్వ॥ 1231

సకలజనులు మెచ్చు చందన వృక్షంబు
పన్నగములఁ గూర్చు కొన్నయట్లు
కుతల పతులు గూర్చు కొందురు కుమతుల ॥విశ్వ॥ 1232

మంచి చెడ్డ సుంత మదినెంచ కేరికే
నపకరించు వాఁడ యణఁచఁ బడును
మొఱకుటెద్దుఁ బట్టి ముకుఁదాడు వేయరా ॥విశ్వ॥ 1233

ఆదినుండి శత్రు వైనను నరయుక
యమిత బలుని జెనకు టన్న నెన్న
మిడుత యంగలమును మ్రింగఁబోయిన రీతి ॥విశ్వ॥ 1234

విశ్వ మానవులకు విజ్ఞాన మెదిగిన
నెంచఁ బెరుఁగలేదు మంచి తనము
వాత దేహ మెంత వచ్చిన ఫలమేమి ॥విశ్వ॥ 1235

శివుఁడు కాచుచుండ సింగపు వాకిటన్
హరి వధించె దైత్యు నదటు గాంచి
గర్వ మెవరికైన సర్వంబు చెఱచును ॥విశ్వ॥ 1236

వ్యసనములకుఁ జిక్కి వ్యయ మొనరించెడి
నరునకెట్లు దక్కు వర సుఖంబు
కాకి చేరఁగలదె ఘన మానసమునకు ॥విశ్వ॥ 1237

మందులకును దోడు మంత్రంబు తగిలినఁ
జక్కఁబడును వ్యాధి సత్వరముగ
రాజుతోడ మంత్రి రాజిల్లి నట్లుగ ॥విశ్వ॥ 1238

పూలపై నొకప్డు నేలపై నొకవేళఁ
బవ్వళింప వలసెఁ బ్రభుఁడు నలుఁడు
దైవమహిమ దాఁటఁ దరమె యెవ్వరికైన ॥విశ్వ॥ 1239

అధిక ధనము గొప్ప యధికారమున్నచో
గారవింతురి చాల ఘనుఁడటంచు
మంచితనము నెవఁడు మన్నించు జగతిలో ॥విశ్వ॥ 1240

ముందు గతులు గనరు కొందఱు మూఢులీ
యైహికమున మగ్నమగుచు నుందు
రనుభవించు నప్పు డన్నియుఁ దెల్లమౌ ॥విశ్వ॥ 1241

మత్కుణముల వలన మంచమునకు ముప్పు
దుష్టు వలన ముప్పు శిష్టతతికి
బాధ పులుల వలన సాధు జంతువులకు ॥విశ్వ॥ 1242

తప మొనర్పఁ బాప తతి యెల్లఁదఱగును
గరఁగఁ గనటువోవుఁ గనక మునకు
శిక్షణమునఁ జెడు న శించు బిడ్డలకును ॥విశ్వ॥ 1243

మంచికంటెఁ జెడ్డ నెంచు చుందురు మున్ను
దుష్టుఁడన్న భీతిఁ దొలఁగు చుండ్రి
తావి కంటెను జెడు తావి ముందుగఁ బర్వు ॥విశ్వ॥ 1244

శౌర్యశాల యైన సమయము దప్పిన
న్యూన తేజునట్లు కానిపించు
మబ్బు వెన్కనున్న మార్తాండు నట్టులు ॥విశ్వ॥ 1245

సత్యవాక్కు, నిరత సత్త్వ వర్తనమును
జీవులందుఁ గరుణ చెలఁగెనేని
ముక్తికాంత వలచి ముదమునఁ జేరురా ॥విశ్వ॥ 1246

దేహ మోటికుండ మోహమింద్రి ధనసు
జవ్వనంబు వాక సత్తి వెఱపు
మిత్రి పొంచియుండు మేల్కొంట మంచిది ॥విశ్వ॥ 1247

కమలమున్న కొలను కళకళ లాడును
చంద్రుఁడున్న మిన్ను చక్కవెలఁగు
గృహిణి మంచిదున్న గృహము ప్రకాశించు ॥విశ్వ॥ 1248

పాలతోడ గొప్ప పాముకు బెంచిన
శత్రువగును గాని మిత్రమగునె
దుష్టుతోడఁ జెలిమి దుష్ఫలమే యిచ్చు ॥విశ్వ॥ 1249

జూదమాడి ధర్మ జుండు న లుండును
ఇడుమ లెన్నొ పడరె యడవులందు
అన్యజనుల మాట అడుగంగ నేలరా ॥విశ్వ॥ 1250

పుట్టఁ ద్రొక్కిన జిల బొబ్బలు పుట్టును
అడుసు ద్రొక్క మలిన మంటుకొనును
ఖలుని యిల్లు ద్రొక్క కలుషంబు లంటురా ॥విశ్వ॥ 1251

వేదికలను నెక్కి వేదవాక్యము లాడి
దిగిన వెన్కఁ గట్టు తెగిన నీరు
వలెఁజరించు నట్టి పాపాత్ము లుందురు ॥విశ్వ॥ 1252

దోమ పడినకన్ను దొగరెక్కి నీర్కారు
కామకేళి నరుఁడు కరఁగిపోవు
పాపఫలము కతనఁ బతనమౌ జనతతి ॥విశ్వ॥ 1253

ముందు గతులెఱుంగ కెందఱో రాక్షసుల్
త్రుళ్ళి యరుల చేతఁ ద్రెళ్ళిరి గద
నరులు వారికంటె వంచన శాలులా ॥విశ్వ॥ 1254

ఇంత కూడుగుడ్డ కేవృత్తిలో నున్న
ధర్మ మెఱిఁగి మనుట తగు నరునకు
వృత్తిలోట చిత్తవృత్తిలోటే గాని ॥విశ్వ॥ 1255

జాతి భేదమైన నీతి భేదంబైన
మనము దెచ్చుకొన్న మార్పులెగద
మనసు మంచిదైన మహిమకు లోటేమి ॥విశ్వ॥ 1256

విశ్వకర్త సర్వ విశ్వంబు లోపల
పాలలోని వెన్న భంగినుండు
తఱచి చూచినట్టి తత్త్వజ్ఞుఁడెఱుఁగును ॥విశ్వ॥ 1257

మింట నడక, తేరి కొంటిచక్రము, కుంటి
సారథి రవిగతియు సాగుసతము
సాధనముల కేమి సామర్థ్య మున్నచో ॥విశ్వ॥ 1258

సాగుచున్న బండి సాగనిచో మొండి
యెవని బాణమైన నెప్పుడైన
బాణుఁ డడఁగలేదె భవు భటునిగఁ జేసి ॥విశ్వ॥ 1259

ఒకదినాన ఱాయి ఒకరోజు రత్నము
ఒక్కనాఁటి రత్న మొకటిరాయి
కాలమహిమ దెలియఁ గా నేరితరమగు ॥విశ్వ॥ 1260

ఒకటి ధర్మమైన దొకటి యధర్మము
సరిగ నెఱుఁగ ఘోర శత్రు వధము
రాజుసేయ నొప్పు లైతుసేయఁగఁ దప్పు ॥విశ్వ॥ 1261

మంచు గడ్డలైన మంట నిప్పుకలైన
తనువు సోఁక సుఖము తనరఁ బోదు
మితము దప్పదేని స్థితియైన నంతెరా ॥విశ్వ॥ 1262

దేవుఁడె చటనుండుఁ దెలియుట లేదని
విశ్వమెల్ల నీవు వెదకనేల
కరుణ రసము పండె కాఁపుర ముండురా ॥విశ్వ॥ 1263

పూజనీయు లైన పుణ్యాత్ములను గని
వెక్కిరించు నట్టి నిక్కుపోతు
కొలఁది కాలమునకె కుళ్ళింగి కృశించురా ॥విశ్వ॥ 1264

పిల్లగఱగు వాఁడు పిల్లకు నేడ్చిన
కాటివాఁడు నేడ్చె కాసుకొఱకు
ఎవనిమేలు వాఁడె ఎప్పుడు చూచురా ॥విశ్వ॥ 1265

నిశిని మాటలెల్ల నిద్రకుఁ జేటగు
పగటి మాటలెల్ల పనికిఁ జేటు
పంజ మాటలెల్ల సత్ప్రార్థనకుఁ జేటు ॥విశ్వ॥ 1266

కనులు తానుమూసి కొని పిల్లి పాల్ద్రావి
తన్నుఁ గనరటంచుఁ దలఁచినట్లు
కులట తనదు నడత తెలియ లేరనుకొను ॥విశ్వ॥ 1267

చినుకు చినుకు నడుమఁ జనెనట మాదేర్రియుఁ
డశనిఁ బట్టెనంట అర్జునుండు
నరున కెంతశక్తి పరమేశుఁ డిచ్చెరా ॥విశ్వ॥ 1268

మిత్రవర్యుఁడైన శాత్రవ వరుడైఁన
బంధుపైన నాత్మ బంధుపైన
పెట్టినఁ దినువారు తిట్టినఁ బడఁబోరు ॥విశ్వ॥ 1269

పరశురాముఁ డమిత భయపడ భాషింప
రాముఁడల్లి శాంత రసముఁజూపె
జలద ముఖముఁ గాని శరదభ్ర ముఖమువా ॥విశ్వ॥ 1270

పలురకాల మొక్క చిలువయి జనియించి
కలసి మెలసి మనుట కనుటలేదె
సంఘజీవి నరుఁడు సమర మేలరకోరు ॥విశ్వ॥ 1271

ఉల్లి మల్లిగాదు మల్లి యుల్లియుఁ గాదు
చెఱకుగాదు నంట చెఱకరయఁగ
పంది నందిగాదు నంది పందియుఁ గాదు ॥విశ్వ॥ 1272

పాపులనఁగ వేఱె పరదేశమున లేరు
పుణ్యులట్ల వారిఁ బోలుచుండ్రి
మేడియట్ల కుక్క మేడియు నుండదా ॥విశ్వ॥ 1273

చిన్నచీమ మొదలు శ్రీమంతు వఱకును
ప్రాణ మొకటన్న భావమున్న
హింస నెట్లు తా సహించు మంచి నరుండు ॥విశ్వ॥ 1274

ఒక్క శాసనమున నుర్వీ తలంబున
పలువురెంతొ సుఖము పడయఁ గలరు
ఒక్క బెట్టునొక్క పెక్కు దివ్వెలు వెల్గ ॥విశ్వ॥ 1275

కాకిముక్కు నందుఁ గలి దొండపండును
మిసిమి మీఱు ఫేడి మీసకట్టు
కోఁతితలఁ గలట్టి కుళ్ళాయి యొకటెరా ॥విశ్వ॥ 1276

కులమతముల నెంచి గుణమెంచక ఖలుండు
గ్రుడ్డి పూవనఁగడు దొడ్డపూవు
వాని వాక్కు వేద వాక్యమండ్రు కొందఱు ॥విశ్వ॥ 1277

కష్టసుఖము లందుఁ గడఁగి యాదుకొనెడి
చెలికిఁ దనదు గుట్టు చెప్పుకుంట
మంత్రహాని యొద్ద మర్మంబు దాఁచుట ॥విశ్వ॥ 1278

ఇలపయిఁగల యట్టి యసుక రేణువులెన్నొ
లెక్కపెట్టవచ్చు చుక్కలెన్నొ
ఖలుని మనసు దెలియఁగా శక్య మగునొకో ॥విశ్వ॥ 1279

ఆలుమగల మనసు లమలమ్మై యతికిన
కాఁపురంబు సుఖద గోపురంబు
బుధులదృష్టి నదియె భూలోక నాకము ॥విశ్వ॥ 1280

క్రూరుఁ డొక్కరుండు గుణవంతుఁ డొక్కఁడు
దొంగ యొకఁడు గొప్ప దొరయొకఁడు
సమత జగతి నెట్లు సాధింప వీలౌను ॥విశ్వ॥ 1281

బండితోలు నొకఁడు పైమానికుఁ డొండు
సమత యెట్లు జగతి సాధ్యపడును
బలియొకండు మిగుల బలహీనుఁ డొక్కఁడు ॥విశ్వ॥ 1282

పండితుండొకండు పామరుఁ డొక్కఁడు
మనసు లెట్లు కలసి మనఁగలారు
ఒకఁడు పరముఁ గోర నొకఁడిహమును గోరు ॥విశ్వ॥ 1283

వందయున్న నూఱు వందలు కోరును
కోటియున్న నూఱు కోట్లు కోరు
ఆశ కంతులేని అల్లాడు లోకము ॥విశ్వ॥ 1284

దేహమునకు నెంత ఆహార మక్కఱో
అంతె తినుట మంచి దధికమైన
కడుపునొప్పి పుట్టి కలుగును వ్యాధులు ॥విశ్వ॥ 1285

గోవుతోడ సాటి గొడ్డెన్నఁటికిఁ గాదు
తల్లిసాటి మాఱుఁ దల్లిగాదు
జీవనదుల సాటి సెలయేఱులును గావు ॥విశ్వ॥ 1286

మంది పెరిఁగెనేని మనదె రాజ్యముగదా
యన్నదృష్టి తోడ నున్నప్రజలు
తనదు ధర్మములను దలఁతురా వలతురా ॥విశ్వ॥ 1287

కూడబెట్టు నట్టి గుణవంతుఁ డొకఁడున్నఁ
బాడుచేయు నట్టి వలువ యొకఁడు
ఇర్వురకును సమత యెట్టుల యొనఁగూడు ॥విశ్వ॥ 1288

తల్లిపోల్కి నున్న తనయుఁడు ధన్యుండు
తండ్రిపోల్కి నున్న తనయ ధన్య
తన్నుదాను దెలియు ధన్యుల ధన్యుండు ॥విశ్వ॥ 1289

పిన్న పెద్ద భేద మున్నది సున్నయ్యె
వినుట చెప్పుటన్న విలువ యడఁగె
కడకు లోకమేమి కానున్నదో గదా ॥విశ్వ॥ 1290

నలుఁడు కొఱుచిచ్చు నడుమనున్న ఫణిని
వెలికిఁదియఁ గాటు వేసెనుగద
ఖలుని కుపకరింపఁ గలుగు ఫలంబిట్లు ॥విశ్వ॥ 1291

ఏగు ముక్కునందు నే వేళ్ళు వెట్టిన
మాట మఱవవచ్చు మనసుఁ బట్టి
బురదఁ గంబ మరయఁ దిరుగును సెటులైన ॥విశ్వ॥ 1292

తుమ్మ జమ్మిగాదు దూత భూపతిగాఁడు
జాఱయైన కులట సాధ్విగాదు
సహజ దుర్గుణుండు సాధూత్తముఁడు గాఁడు ॥విశ్వ॥ 1293

తేజమున్న మాత్రి తెలివున్న దనలేము
జీవకళ మొగానఁ జెందుచున్న
పాలరాతి బొమ్మ పలుకనా సొగసున్న ॥విశ్వ॥ 1294

ఇసుకనున్న మిడుత యిసుక రంగుగ నుండు
గడ్డినున్న మిడుత గడ్డిరంగు
మచ్చనాల్కవాని మాట యట్టుల యుండు ॥విశ్వ॥ 1295

నడత బాగులేని నరు గౌరవంబెన్నఁ
బేరు గొప్పెగాని యూరుదిబ్బ
యెఱిఁగెనేని లోక మెన్నదు పెద్దగా ॥విశ్వ॥ 1296

నీతి నియమములకు నిలబడ నేరని
పాతకుండొకప్ప పరిజులు చుండుఁ
గొఱుచిచ్చు గ్రీష్మ కాలము నంబలె ॥విశ్వ॥ 1297

జనన మాదితుదికి మనవంతు గలపుణ్య
రాశిగాని పాప రాశిగాని
మనమ చేసికొన్న మంచి చెడ్డలెగదా ॥విశ్వ॥ 1298

సౌధమునకుఁ జుట్టు జాలకాలుండియు
మూసియున్న నేమి ముదము గూర్చ
సద్గుణములు లేని చదువరి చందంబు ॥విశ్వ॥ 1299

పిచ్చి మొక్కలెన్నొ పెంచక పోయినఁ
బుట్టి పెరుగుచుండు నట్టె మనకుఁ
దెలియకుండఁ దగని యలవాటు లేర్పడు ॥విశ్వ॥ 1300

వృశ్చికమ్ము విషము విఱుగును మంత్రాన
నహివిషంబుతొలఁగు నౌషధమున
మనుజు చేదుపాయు మార్గమే లేదురా ॥విశ్వ॥ 1301

లోకనాటకంబు లోలో విమర్శించి
కడకు బూటకంబు గాఁ దలంచి
తన్నుఁదాను దెలిసి ధన్యుఁడౌ శివయోగి ॥విశ్వ॥ 1302

కన్నులున్న వాఁడె కాంతి లాభము పొందు
గ్రుడ్డివానికేల దొడ్డ వెలుఁగు
గుణము కుదరకున్న గురువేల యేద్వనా ॥విశ్వ॥ 1303

వేడి కిరణములను వేడ్కతో గ్రహియించి
శీత కిరణములను శశి మనకొసఁగుఁ
గష్టములకు నోర్చి ఘనులు మేల్సేయరా ॥విశ్వ॥ 1304

చండశాసనమను శస్త్రాస్త్రములు లేక
రాముఁడైనఁ బరశు రాముఁడైనఁ
బాలనంబుసేయఁ జాలఁడు ప్రజలను ॥విశ్వ॥ 1305

కుత్సితుఁడొకప్డు గొప్పవారికిఁ గూడ
హానిచేసి ప్రాణ హాని పొందు
కుట్టినగుని చీమ కూలుటగన లేదె ॥విశ్వ॥ 1306

కొమ్మకొమ్మయొచటొ గొప్ప రాపిడిపొందఁ
గలిగినట్టి నిప్పు కాల్చునడవి
మత విరోధమొదవ మనుజుల గతియంతె ॥విశ్వ॥ 1307

ప్రొద్దుపొడువఁ దమ్మి పూవులు వికసించుఁ
జంద్రుఁగనఁగఁ గలువ సంతసించు
నెవరి వారి వార లీరీతిఁ జూడరా ॥విశ్వ॥ 1308

తప్పువేగఁజెప్పు గొప్పను జెప్పఁడు
వెక్కిరించు బాటఁ జక్కఁజేయఁ
డసహనంబునరున కా జన్మసిద్ధమా ॥విశ్వ॥ 1309

రైతులున్న యెడల రాజొకఁడుండును
ప్రజలులేని యెడల రాజులేఁడు
రాజు సుగిణియైన రాజ్యము శోభిల్లు ॥విశ్వ॥ 1310

కన్నతల్లి కంటెఁ గాపాడు వారేరు
తగిన భార్య కంటె వాసి యెవరు
మిత్రవరుని కంటె మేల్గూర్చు నెవ్వఁడు ॥విశ్వ॥ 1311

చిల్లిగవ్వయైనఁ జేయని మానవుం
డొక్కవేళ గద్దె నెక్కుచుండు
కాలమహిమఁదెలియఁ గాఁ జాలరెవ్వరు ॥విశ్వ॥ 1312

సంధిరోగినోట సర్పంపుగరళము
ఒప్పునమృతమట్లు లొక్కవేళ
యుద్ధమందుఃఖడ్గ ముపకరించినయట్లు ॥విశ్వ॥ 1313

ఉన్నవానికెన్నొ యుండునాఁడుదుడుకు
లున్నవానిపైపె యుండుఁ జూపు
ఊరి రాలఁగొట్టరా వండ్ల చెట్టును ॥విశ్వ॥ 1314

ధర్మమున్నచోట దైవబలంబుండు
కోపమున్నచోట పాపముండు
కూర్మియోర్మియున్న గుతలము స్వర్గమో ॥విశ్వ॥ 1315

మృతినిబొందినట్టి మృగరాజుకంటెను
బ్రదికియున్న లేడి బలము గలది
ఈని ధనికుకంటె నిచ్చు పేదమె మేలు ॥విశ్వ॥ 1316

తప్పుదారిఁద్రొక్కెఁ డెప్పుడు సుజ్ఞాని
సత్యమార్గమందె చనుసాధ్వి
తోయజహితుఁడెప్డు తూర్పున నుదయించు ॥విశ్వ॥ 1317

స్వల్ప వాంఛయున్న సామాన్యజనునకు
గొప్పవాని కుండు గొప్పయాశ
చిన్నపక్షి తాను చిన్నగూడే కట్టు ॥విశ్వ॥ 1318

ఆశ్రయంబు నీకు ననుకూలముగనున్న
నెంతదూరమైన నేగవచ్చు
పడవ చిల్లిపడినఁ బయనంబు సాగునా ॥విశ్వ॥ 1319

పాతప్రక్కలోభి దర్శనీయుఁడుగాఁడు
ధన్యప్రక్క కులట గణ్యగాదు
రవ్వప్రక్క రాయి రాజిల్లఁజాలునా ॥విశ్వ॥ 1320

కాలువంకరున్నఁ గన్నుగ్రుడ్డిదియైన
కడుపు మంచిదైన గలుగు సుఖము
చెఱకు వంకరున్న శిరమున మోయరా ॥విశ్వ॥ 1321

న్యాయమెఱిఁగికాదు సాయమొనర్చుట
గుణము చూచికాదు కులము చూచి
దేశమెట్టి స్థితికి దిగజారి పోయెరా ॥విశ్వ॥ 1322

గుణము లెట్టులున్నఁ గులమతభేదముల్
క్రుళ్ళి కంపుగొట్టెఁ గుతలమెల్ల
వలచి తెచ్చుకొన్న వనిత భూతంబయ్యె ॥విశ్వ॥ 1323

తోడలేము నీరు తోయధి యింకఁగా
లెక్క పెట్టలేము చుక్కగమిని
కపటి దుర్గుణములు కనిపెట్టఁగా లేము ॥విశ్వ॥ 1224

మేడిపండువోలె మెఱయుచునున్నను
ఘనునకైనఁ జింత కలదు మదిని
కొఱఁతలేని వాడు కుతలంబునన్ లేడు ॥విశ్వ॥ 1325

తిండికున్నవాఁడు తినలేక యేడ్చున
లేనివాఁడు తిండి లేక యేడ్చు
నలువమహిమఁ దెలియ నరుఁడెంతవాఁడురా ॥విశ్వ॥ 1326

పండు చిక్కవలెకు బహుధర్మ సూక్తులు
పండుదొలిక చేతి నిండ పట్టు
పట్టు చిక్కెనేని పలుకఁడు పరులతో ॥విశ్వ॥ 1327

గనులయందు జాతి గలసి యుండును బైడి
వెలికి దీసి దాని వేరుసేయ
విలువ హెచ్చి రాజు తలపైకి నెక్కదా ॥విశ్వ॥ 1328

సద్గుణంబుతోడ సాటియైనదిలేదు
హింసకంటెఁ బాప మేదిలేదు
సత్యనిష్ఠకంటె పవిత్రత మేలేదు ॥విశ్వ॥ 1329

త్రిపురరాక్షసులనఁ దిరిగుణములనుకొను
వాని గెల్చినట్టివాఁడు శివుడు
శివునితత్త్వ మెఱుగ సిద్ధుడై వెల్గురా ॥విశ్వ॥ 1330

సర్వదైవశక్తి సత్యంబులో నుండు
ఎల్ల పాపఫలము హింసనుండు
స్వర్గసుఖము పరమ శాంతచిత్తులకుండు ॥విశ్వ॥ 1331

బీదబిక్కలందు వికలాంగు లందును
నిండు ప్రేమచూపు చుండుమయ్య
కడుపు నిండెనేని కైలాసమనుకొంద్రు ॥విశ్వ॥ 1332

మానవుండు ధర్మ మర్మంబు లెఱుఁగక
యిష్టమైనట్టు లెగరెనేని
స్వర్గనరకములను జవిచూచు నిచ్చలు ॥విశ్వ॥ 1333

గిల్లిజగడమాడు కిగ్గాండ్రతోఁజెల్మి
సేయరాదు వారి డాయరాదు
కలిసితిరుగ హాని కలుగుట నిక్కమ్ము ॥విశ్వ॥ 1334

అనుభవింపలేని యాస్తి యుండిననేమి
తీరఁగలదె తృప్తి తేటిచూడ
అందనట్టి పండ్ల నరయు చందమెగదా ॥విశ్వ॥ 1335

పాతకంబనఁగఁ బరదేశములలేదు
చేఁతలందెయుద్ది చేరియుండు
చేఁతమంచిదైనఁ జేకూరు పుణ్యంబు ॥విశ్వ॥ 1336

జన్మమందుఁగల్గు సద్గుణదుర్గుణాల్
మాన్పఁ దరముగాదు మానవులకు
సురగుణంబు వేఱు సురగుణంబది వేఱు ॥విశ్వ॥ 1337

విశ్వరక్షకుడగు విశ్వేశుఁ గొల్వక
లోకజాలమందె లోఁగియుంట
గూబవెల్గుఁగనక కుహరాన మన్నట్లు ॥విశ్వ॥ 1338

ఇల్లువెడలనీక యెంత బోధించిన
మందుఁడెట్టుఘన కవీంద్రుఁడగును
నీళ్ళుచిల్కివ నవ నీతము వచ్చునా ॥విశ్వ॥ 1339

పాపమున్న చోట భయముంట సత్యము
కోపమున్న చోట పాపముండు
కోప పాపములక కుంఠిత మైత్రిరా ॥విశ్వ॥ 1340

అక్షరంబురాని యతఁడు హస్తంబున
భారతంబుపట్ట ఫలమదేమి
అంధుచేతి పెద్ద యద్దము రీతిరా ॥విశ్వ॥ 1341

ఆంగ్ల రాజ్యమిచట నంతరించెనుగాని
హూణభాష నిలిచి యుండఁ గలిగెఁ
జూలుబొట్లు పడును జూ వాన పోయిన ॥విశ్వ॥ 1342

ఆదుకొన్న వాఁడె హరిహరరూపుఁడు
ముదము గూర్చువాఁడె ముఖ్యబంధు
వదసి కాచువాఁడె ఆత్మమిత్రుఁడురా ॥విశ్వ॥ 1343

నీతిలేనివాని స్నేహమ్ము చేసిన
వాఁడు కూడనట్టి వాఁడెయగును
గ్రుడ్డివెంటనరిగి గోతిలోఁ బడినట్లు ॥విశ్వ॥ 1344

పండితుఁడెగాని పామరుఁడేగాని
యేకదీక్షతోడ నీశుఁగొల్వ
దివ్యలోకమందు దేవదేవునిదయ ॥విశ్వ॥ 1345

ప్రేమయున్న చోట బంధువులుందురు
ధర్మమున్న చోట దైవముండు
పాపమున్న చోట బహుభీతియుండును ॥విశ్వ॥ 1346

మేటిదొంగ కెపుడు మిత్తి నెత్తినయుండు
కాలగళునినెత్తి గంగయుండు
గర్వమున్నవాని కనులు నెత్తినయుండు ॥విశ్వ॥ 1347

కీడుకొఱకె ధూమ కేతువు జనియించు
కీడుకొఱకె గూబ గీమునెక్కు
కీడుకొఱకె కృష్ణుఁ గీచకుఁడర్థించె ॥విశ్వ॥ 1348

వేణునాదమునకు బ్రేపల్లె గోవులు
విన్న కృష్ణుచుట్టుఁ జేరు కరణి
సిద్ధునుడివినఁ బ్రజ చేరుట లెస్సరా ॥విశ్వ॥ 1349

తఱచితత్త్వమెల్లఁ దన్నుఁదానెఱిఁగిన
ధన్యుఁడగును లోక మాన్యుఁడగును
అట్టివానిమాట అలపైఁడిమూటరా ॥విశ్వ॥ 1350

నీతినియమములకు నిలయమౌ గృహమున
లక్ష్మి నృత్యమాడు లలిత గతుల
ధర్మహీనునింటఁ దనరు దారిద్ర్యంబు ॥విశ్వ॥ 1351

చెడ్డవాని చెల్మి చేయక తప్పదేఁ
గొలఁది మైత్రి నెఱపు కొనుట లెస్స
విడెము కొఱకొకింత వడయును సున్నము ॥విశ్వ॥ 1352

సరళవాగ్వినోదు జనులాదరింతురు
పరుష వచన గరుణఁ బలుకఁబోరు
శుకము మీది ప్రేమఁ జూపరు కాకిపై ॥విశ్వ॥ 1353

చేసినట్టి మేలు చిన్నదియే యైన
మంచి మానవుండు మఱచి పోఁడు
తాటివిత్తు నాటఁ దరతరాల ఫలంబు ॥విశ్వ॥ 1354

తగిన దానమిచ్చి ధనిపేద యైనను
పెరుఁగుఁ గాని కీర్తి తఱుగఁ బోదు
సొనవరుగ మణికి సద్యశ మబ్బును ॥విశ్వ॥ 1355

పైకి వకరిమున్న బాగుగా నున్నను
పనినిఁబట్టి వేరు పడయఁ గలుగు
వీణ ముదము గూర్పు బాణము హింసించు ॥విశ్వ॥ 1356

భానురశ్మి సోక దేని మొక్కెదుగదు
గురువు లేక విద్య కూడదు వెన
భక్తి లేదయేని భవువర మొదవదు ॥విశ్వ॥ 1357

భవుని వలన వరము భస్మాసురుఁడు పొంది
చేయి పెట్టఁదలఁచె శివుని తలనె
చేటు కాలమునకు చెడ్డబుద్ధులు పుట్టు ॥విశ్వ॥ 1358

అల్పుఁజేర ఘనుని యశమడు గంటును
కొయ్యతెప్ప మీఁదఁ గూర్పె నినుప
స్థంభమైన నరయ జలముపైఁ దేలదా ॥విశ్వ॥ 1359

చెడ్డ మానవులకు జేయరాదు వకృతి
సజ్జనుల కొనర్ప జరుగు శుభము
అవుఁ బెంచవచ్చు నహిఁ బెంచవచ్చునా ॥విశ్వ॥ 1360

విశ్వసింపఁ దగు వివేకియే మిత్రుండు
కూడుపెట్టు వాఁడె కొడుకు సతము
పతికి సౌఖ్యమిచ్చు పడఁతియే సద్భార్య ॥విశ్వ॥ 1361

చెఱకు పుష్పమన్నఁ జేకొనరెవ్వరు
ఉల్లమలరఁ గొందురు మల్లెయన్న
గుణముఁబట్టి కలుగు ఘనత దేనికినైన ॥విశ్వ॥ 1362

జీవి తొలుత కోరు జీవనాధారంబు
వరుస భోగములను వాంఛసేయు
అంతెగాక మోక్ష మర్థించుటరుదురా ॥విశ్వ॥ 1363

పాలునీరు వేఱు పఱచ హంసకుఁ జెల్లు
కొంగ సేయఁగలదె కోరిపిలువ
జ్ఞానితెలుపు లోక కర్మంబు మర్మంబు ॥విశ్వ॥ 1364

కంపనమున సద్దు గలిగిన యట్లను
కంపవలనఁ బుణ్య గరిమ గలుగు
మృదుల హృదయమందె మొదవును ననుకంప॥విశ్వ॥1365

వనము లున్నచోట వానలు కురియును
భక్తియున్న దైవ శక్తియుండు
శ్రవణ ధాతువున్న శబ్దము వినఁబడు ॥విశ్వ॥ 1366

పాప పుణ్యములను బరిశీలనము చేసి
ప్రకృతియిచ్చు నీకు ప్రతిఫలంబు
దాని దాఁటిపోవఁ దరమౌనె నరునకు ॥విశ్వ॥ 1367

పరమ కరుణతోడ భాగ్యాధి దేవత
తలుపుతట్టు నొక్క తడవ యెఱిఁగి
తీసెదేని నీక దృష్టము వట్టురా ॥విశ్వ॥ 1368

పాఁతగుడ్డ విడిచి నూతన వస్త్రంబు
కట్టుకొన్న కరణి కర్మజీవి
తనువు విడిచి వేఱ తనువునఁ జేరురా ॥విశ్వ॥ 1369

పుష్పమధువు కొఱకు పుష్పంధయము చాల
దవ్వునాక వచ్చి త్రావినట్లు
గురువు కడకు విద్య కొఱకు శిష్యుఁడువచ్చు ॥విశ్వ॥ 1370

పొట్లవిత్తు నాట పుట్టదు కాకర
చవట పుట్టఁబోఁడు శౌర్యఖనికి
మునికి రక్కసుండు పుట్టుట కల్లరా ॥విశ్వ॥ 1371

మతము లెన్నియున్న మహిమాన్వితము లైన
మూల సూత్రములకు మొక్కినవియె
జాతులెన్ని యున్న నీతిభేదము సున్న ॥విశ్వ॥ 1372

అరిగి చూచిరార లాకాశ నౌకలో
శాస్త్రవేత్త లిట్టి సాహసమున
నరున కెంతశక్తి పరమేశుఁ డిచ్చెరా ॥విశ్వ॥ 1373

పరిజలమేలు కొఱకె పరిభవించె నమకొని
నఱకఁబోరు వనము నరసి జనులు
అడవిలోన గొప్ప యైశ్వర్య మున్నది ॥విశ్వ॥ 1374

ఛేద భేదములకు కీలక స్థానము
మనసుగాన దాని మర్మమెఱిఁగి
చిక్కఁ బట్టెదేని చిక్కును సౌఖ్యంబు ॥విశ్వ॥ 1375

సర్వ జీవరాశి సర్వేశు సంతాన
మంచు మంచితనము మించ జ్ఞాని
చూపులందె కరుణ చూపుచు నుండురా ॥విశ్వ॥ 1376

కొండెగానికి పిస ముందును నాలుక
కాముకునకు నుండు కన్నులందు
అహులకెపుడు కోఱ లందు విషంబుండు ॥విశ్వ॥ 1377

కాని కాలమందుఁ గడుబుద్ధి శాలికేఁ
గష్ట నష్టములను గలసివచ్చు
రాముఁ డడవికేగె రాజ్యము విడనాడి ॥విశ్వ॥ 1378

ఱెక్కలున్న వంచుఁ జుక్కల దారికి
నెగురఁ గలదె పక్షి యెట్టిదైన
ప్రాణిశక్తి యెంత ప్రకృతి శక్తుల ముందు ॥విశ్వ॥ 1379

ప్రాణ వాయువునకు వాసన వర్ణముల్
లేని చందముననె లేవు ఋషికి
మనసునందు గొప్ప మైత్రి విరోధముల్ ॥విశ్వ॥ 1380

పెద్దకొడుకు మీఁదఁ బ్రేమ తండ్రికి నుండు
తల్లికుండు చిన్న తనయు మీఁద
మధ్యములను గండ్రు మధ్యస్థమగు దయ ॥విశ్వ॥ 1381

వార్థి దాఁటిపోయి వధియించి రావణు
రమణిఁ దెచ్చికొనియె రాఘవుండు
శౌర్యశాలి పనిని సాధింప కుండునా ॥విశ్వ॥ 1382

చంద్రమండలంబుఁ జక్కఁజేరెను గాని
సూర్య మండలంబుఁ జొఱఁగలాఁడె
యలవిగాని దాని నాచరింపఁ డెవండు ॥విశ్వ॥ 1383

నేతృ పదవియందు నిలువఁ దలంచినఁ
గూర్పుకొనవలె మంచి గుణ గణంబు
ధర్మమున్న చోట దైవ బలంబుండు ॥విశ్వ॥ 1384

కనవు చివఱి మంచు కణము ముత్యఁజౌనె
నేతిబీరఁ గలదె నేయి, కపటి
పూఁత మాటలందుఁ బొసఁగునా సత్యంబు ॥విశ్వ॥ 1385

దుండ గీండ్రతోడ దోస్తిగా నుండిన
మంచివాని కైన మాటవచ్చుఁ
గాకి గుంపున మగ కోకిల యున్నట్లు ॥విశ్వ॥ 1386

చుక్కకెదురు నిండు చూలాలు పోరాదు
పగటినిద్ర యువకుఁ బనికిరాదు
మగువ బాధపెట్ట మగనికిఁ దగదురా ॥విశ్వ॥ 1387

కుంతికంటెఁ గర్ణుఁ గురురాజు పోషించెఁ
గొన్నివేళ లందు దిన్న నరయ
నైనివాని కంటెఁ గాని వాఁడే మేలు ॥విశ్వ॥ 1388

మనసు కసటు వాపి మంచి మార్గము సూపి
యుద్ధరించు జ్ఞాని యుండెనేని
దైవరూపుఁ డంచుఁ దలఁచి చేరఁగఁ జెల్లు ॥విశ్వ॥ 1389

ఒకఁడు పైకి వేఱ యొకఁడు క్రిందికి జుత్తు
పెంచి తగవులాట పెంచుకొనుట
దివము నందలి పితృ దేవతల్మెత్తురా ॥విశ్వ॥ 1390

ఎక్కియున్న కొమ్మ నెఱుగఁక కొట్టినఁ
బడక యెట్టులుండుఁ బుడమి మీఁద
కనక యగ్గిఁదాక కాలక యుండునా ॥విశ్వ॥ 1391

హెచ్చు తగ్గులన్ని యిహమునకే చెల్లు
రాజుగాని పేద రైతుగాని
తప్పు చేసెనేని దండించు దేవుఁడు ॥విశ్వ॥ 1392

మచ్చుముక్క వంటి మాట యొక్కటి చాలు
పనికిరాని వెన్ని పలుకనేమి
పెక్కు రాలకంటె నొక్క రత్నము చాలు ॥విశ్వ॥ 1393

కొడుకుపుట్టఁ డోన కూడు పెట్టు నటంచుఁ
దలఁచు టెంతొ వెఱ్ఱి తనము గాదె
చెట్టు మొలచి నంతఁ జేపడునా పండ్లు ॥విశ్వ॥ 1394

చెడ్డవారు తాము చెడిపోవుటే గాక
మంచివానిఁ జెఱచు మనుజు లుందు్రు
పాపములకు నెల్ల భైరవుఁ డొకఁడుండు ॥విశ్వ॥ 1395

తోలుతిత్తి తనువు తొమ్మిది కంతలు
వేళ నెఱిఁగి యుసురు వెడలిపోవు
గాలిబుడగ యెంత కాలము నిల్చురా ॥విశ్వ॥ 1396

ఆలుమగల మనసు లతుక కుండిన యిల్లు
నిఖిల కష్టములకు నిలయమగును
నైక మత్యంబున్న నదియె స్వర్గంబగు ॥విశ్వ॥ 1397

సంగరహితుఁ డైన సాధూత్తముని చెల్మి
మోక్ష సౌధమునకు మొదటి మెట్టు
మెట్లదారి చిక్క మెల్లఁగాఁ బైకెక్కు ॥విశ్వ॥ 1398

కలిమియున్న చోటఁ గాయ కష్టములేమి
గాఢనిద్ర లేక కలలు వచ్చు
కలలు వచ్చినంతఁ గలవర పడనేల ॥విశ్వ॥ 1399

ధర్మమూర్తి యైన తత్వజ్ఞు సద్బోధ
తాలురాశి గాదు మేలురాశి
యతని పదము లంట నంటును మోక్షంబు ॥విశ్వ॥ 1400

బిచ్చగాని కొక్క పిడికెఁడిచ్చినఁ జాలు
నల్లుఁడెట్లు తృప్తి నందుదాన
నెవరికెంత విలువ నీలగ్గొ తెలియుము ॥విశ్వ॥ 1401

సద్గురుండు సేయు జ్ఞానోపదేశాన
నెడద పక్వమగుట యెంతసేపు
మంట పరిగఁ దగుల నంటెంత సేపురా ॥విశ్వ॥ 1402

మాటవాఁడు మంచి మాట కేడ్చుచు నుండ
మూటవాఁడు పెద్ద మూటకేడ్చు
మనుజ జాతి యొకటె మనసులు వేఱయా ॥విశ్వ॥ 1403

కట్టుకున్న వాఁడె కాలరాచుచు నుండఁ
జూచువారి కెంతొ చులకనయగు
రక్షకుండె కడకు భక్షకుఁడైనట్లు ॥విశ్వ॥ 1404

వాదమందుఁ జెడిన వైద్య రత్నుఁ బగు
నాజిఁబడిన స్వర్గ మందుకొనును
భోగమెల్ల జాఱ యోగిగా మాఱురా ॥విశ్వ॥ 1405

పొలు గాఱుచున్న పడఁతి మోముంగన్నఁ
బరమహంస కైన భ్రాంతి గలుగుఁ
బరులమాట వేఱ పలుకంగ నేలరా ॥విశ్వ॥ 1406

శతమఖుండు స్వార్థ మతి ధర్మమును వీడి
కర్ణుబలముఁ జూచి కన్నుగుట్టి
దానమనుచు వచ్చి ప్రాణము తీసెరా ॥విశ్వ॥ 1407

పట్టభద్రుఁడన్నఁ బొట్టభద్రుఁడు గాక
మనుజులోని జ్ఞాన మహిమఁ దెలుపు
చిహ్నమగుట దాని సిద్ధించుకొనఁ జెల్లు ॥విశ్వ॥ 1408

ఆత్మలోన యిమిడి రందఱు దేవతల్
దీని తెలియకున్నఁ దెలివి సున్న
ఆత్మదర్శ నంబె యానంద కందంబు ॥విశ్వ॥ 1409

అచ్చి వచ్చిన దొక యడుగేఁ డైనంజాలు
లోటులున్న పెద్ద లోగిలేల
ప్రేమఁజూచు కొడుకు పిన్నయైననుు నేమి ॥విశ్వ॥ 1410

మందు నెడల మంచి మాట వ్యర్థంబగు
వస్తుబింబ మెంత పాటుపడిన
మణిని వెలుఁగుఁ గాని మట్టిని వెలుఁగునా ॥విశ్వ॥ 1411

అరఁటిపండు మీఁద నమరి యుండెడి తోలె
గుజ్జులోని వాత గుణముఁ బాపు
సంఘ దోషములను సజ్జనుఁడే పాపు ॥విశ్వ॥ 1412

పరులబిడ్డ మావి పండులా గుండిన
నెవరిబిడ్డ వారి కెంతొ ముద్దు
ఇట్టిప్రేమ లేక సృష్టియే జరుగదు ॥విశ్వ॥ 1413

కోటిరూకలున్నఁ గొట్టులాడెడి యింట
శాంతి సుంతలేదు దాంతిలేదు
పోరులేని గంజి పుడిసెఁడైనం జాలు ॥విశ్వ॥ 1414

కలసిమెలసి యున్న ఘన ఋషీంద్రు మహిమఁ
దెలివిలేని వాఁడు తెలియలేఁడు
పెనము తెలియఁ గలదె పెసరట్టు బహురుచి ॥విశ్వ॥ 1415

ధేనఁబుట్టు పుర్వు దాన నశించును
గపటి కపటి చేత గాయపడును
అల్లుకొన్న బూజె హాని సాలీనికి ॥విశ్వ॥ 1416

కనులున్న యపుడె కాటుక వలయును
కురులు గల్గినపుడె కొప్పు వలయు
ధనము కూడినపుడె దానంబు వలయురా ॥విశ్వ॥ 1417

వదరుఁబోతు తోడ వాదాడ ఫలమేమి
యసలువిడిచి వడ్డి నాడుచుంట
సరకు తక్కువైన సరసము లెక్కువ ॥విశ్వ॥ 1418

ఎండతోఁ బ్రవఁ జనిన నేల దప్పికకాదు
ఖలునిమైత్రి నేల కలఁతరాదు
దొడ్డినున్న పోట్ల గొడ్డూర కుండునా ॥విశ్వ॥ 1419

సద్గుణంబుఁ జూచి సంప్రదాయముఁ జూచి
పిల్లనిల్లె యనుమ బిల్లవాఁడు
పొడిచూచి గాదె బట్టను గొనుచుంట ॥విశ్వ॥ 1420

కండపుష్టి యున్న కాలంబు వృథసేసి
లేమి ముదిమిదరివిన కామియగుట
దప్పిగలుగ బావి త్రవ్విన చందము ॥విశ్వ॥ 1421

జన్మమాది హీన చర్యల నొనరించు
వానిబుద్ధి మార్ప వశముగాదు
గవ్వనెవ్వఁ డేని రవ్వగ మార్చునా ॥విశ్వ॥ 1422

అండ దండలున్న నాత్మ బలంబున్న
వైరితోడఁ బోర వచ్చు నరుఁడు
బలములేని వేళఁ బంతంబు చెల్లదు ॥విశ్వ॥ 1423

ధనముమీది యాశ దాయాది కీడును
గోరుఁగాని మేలు కోరుటరుదు
బావమఱఁది కంటె బంధువు లేఁడురా ॥విశ్వ॥ 1424

తనకుఁగాని దానిఁ దలమీఁది కెక్కించు
కొనుటకూడ దెట్టి మనుజునకును
బోడిముండ కేల బొండుమల్లెల గోల ॥విశ్వ॥ 1425

తెలిసిచేసిన మఱి తెలియక చేసిన
తప్పుచేసి యెవ్వఁ డొప్పుకొనఁడు
నేరఁబోతు పల్కు నేతిబీరయె గదా ॥విశ్వ॥ 1426

ఎంతవాని కైన నే వయస్సున నైన
శ్వాసయుండు వఱకు నాసయుండు
నాసవీడి నట్టి యతఁడె మోక్షార్థుండు ॥విశ్వ॥ 1427

రాతియుగము మొదలు రాకెట్టు యుగముదా
కెంత తెలివి హెచ్చె నీ జగానఁ
దెలివిహెచ్చెఁ గాని దిగజాఱె ధర్మంబు ॥విశ్వ॥ 1428

మాటలంద కాని మఱికృత్యములఁ గాని
చేతగాని తనము చేటుదెచ్చు
నస్త్రవిద్య తెలియ కనికేగి నట్టులు ॥విశ్వ॥ 1429

కులట పెక్కుపల్కుఁ గొత్తడి సుద్దులు
విశ్వసింతు రొక్కొ విశ్వవిదులు
దొంగ యొఱుఁగనట్టు దొరవోలె నాడుపుట ॥విశ్వ॥ 1430

చెప్పఁదగిన యట్టి సేవకుఁ బోషణ
మునకు మంచిబిడ్డ పనికివచ్చు
నెంతొమేలు ఛత్ర మెండకు వానకు ॥విశ్వ॥ 1431

కాళ్ళు కానరావు కడుశీఘ్రముముగ నేగుఁ
బాము పాదములను బామె యెఱుఁగు
దొంగమర్మ మెల్ల దొంగకే తెలియును ॥విశ్వ॥ 1432

అన్యజనుల కెప్పు డ పకృతి సేఁతలోఁ
బిన్న పెద్దభేద మెన్ననేల
చిట్టిదోమ యైనఁ గుట్టిన బాధయే ॥విశ్వ॥ 1433

దాస్యబంధ యుక్త దైన్య దేశమునకు
వరయఁగా స్వరాజ్య మబ్బుటన్న
నాకురాలు నడవి కాచని వచ్చుట ॥విశ్వ॥ 1434

పుణ్యమనెడి గొప్ప పురముఁ జేరెడిదారి
యెక్కడున్న దన్న నెవఁడు దెలుపు
బుద్ధియఁదె యుండెఁ బుణ్యము పాపము ॥విశ్వ॥ 1435

కష్టసుఖము లందుఁ గలిమిలేముల యందు
మనసు చెదర నీని మనుజుఁ డొకఁడె
ముక్తిపథము నందు ముందంజ వేయురా ॥విశ్వ॥ 1436

హద్దులేక స్వేచ్ఛ యౌవనంబునఁ దీర్గ
దేహదార్ఢ్యము వెసఁ దీఱిపోవు
నుప్పుగాలి కిన్ము తుప్పుపట్టిన రీతి ॥విశ్వ॥ 1437

పండ్లుతినుట కెంతొ వాటమౌ ముక్కును
జిలుక కిచ్చినట్టి సృష్టికర్త
క్రూరమృగముల కిడెఁ గోరలు హింసకు ॥విశ్వ॥ 1438

ఇతర దేశములకు నీ దేశమునకును
భేదములు దలంపఁ బెక్కు గలవు
ఏది మంచిదన్న నెవరు సెప్పఁగలారు ॥విశ్వ॥ 1439

ఇలను వేఁటకాఁడు నింకొకదెసఁ బక్షి
చంపఁదలఁచి పిట్టఁ జచ్చెఁ గడకు
నాయువున్న నెవరు హానిసేయఁ గలారు ॥విశ్వ॥ 1440

కూడుగుడ్డ కింత కొఱత లేకుంటయు
భాగ్యమంచుఁ దలఁపఁ బరగు శాంతి
యఖిల భోగ వితతి యందఱ కందునా ॥విశ్వ॥ 1441

రాజి రాజి మందు రణరంగ మొకవేళ
యుద్ధమాఁగ శాంతి యుండదు వెస
వానయాఁగ నింకఁ బడునీటి బొట్టులు ॥విశ్వ॥ 1442

నాల్క నదుపు నందు నరుఁడు పెట్టఁడయేని
తానెచెడును గప్ప ఉఱచి యఱచి
యున్నతావుఁ దెలుప నురగము రావొకో ॥విశ్వ॥ 1443

వసుధ సంచరించు పాఁపడి వచ్చెడి రాక
జాడఁదెలుప ముందు నీడవచ్చు
గంట సద్దు ముందు గజమది వెన్కరా ॥విశ్వ॥ 1444

లోభి తానుదినఁడు లోకాని కీయఁడు
వాని యాస్తి వలన ఫలములేదు
కుక్కనోట నున్న కొబ్బరి కాయరా ॥విశ్వ॥ 1445

నీదు కష్టములను నీవె తీర్చుకొనుము
పరులు తీర్తురనుట పాడిగాదు
నీదు వ్యాధిపోవ నీవె యత్నింపుము ॥విశ్వ॥ 1446

ఒరుల కింతకీడు నొనరింప నెప్పుడొ
దాని ఫలిత మంచుఁ దలఁపఁ బోకు
రేపు నీవుసేయ మాపె యనుభవింతు ॥విశ్వ॥ 1447

కష్టపడెడు వాఁడు క్రమముగ మేలొందు
నాదరించుఁ బరుల నవసరమునఁ
బాటుపడని వాని బ్రతుకు వ్యర్థముగదా ॥విశ్వ॥ 1448

భాగ్యమున్న నాళ్ళ పలువురు చనుదెంచి
యెంతొ గౌరవించి యేగుచుందు
బ్రతికి చెడిన వాని ప్రక్కఁజేరఁ డెవండు ॥విశ్వ॥ 1449

చేయవలసి నన్ని చెడ్డపనుల్ చేసి
యేమి యెఱుఁగ నన్న నెట్లుమాయు
వాతమున్న నాల్క పూతవేయుము గదా ॥విశ్వ॥ 1450

ఈ జగంబు సర్వ మీరీతి జరుగుట
యెవరియాజ్ఞ నంచు నెంచనేల
యీశ్వరాజ్ఞ గాక యితరుల యాజ్ఞయా ॥విశ్వ॥ 1451

కూడ వచ్చుచుండి కూఁత వేసెడివాని
నమ్మఁదేని కీడు సుమ్ము సతము
కనుచు వినుచు నుండి కాటు వేయును పాము ॥విశ్వ॥ 1452

అస్త్ర శస్త్ర నిచయ మగ్నిఁ జిమ్మెడి రణ
పృధ్వి కరుగఁ గలఁడె పిఱికి కనఁగ
నినుము కరఁగు చోటి కేఁగకుఁ బనియేమి ॥విశ్వ॥ 1453

చేతితోడఁ గాదు చెప్పుతోఁ గొట్టిన
సిగ్గులేని చవట చేరు మరల
చింతలేని కుక్క ఛీయనఁ బోవు గా ॥విశ్వ॥ 1454

గర్భమందు నిప్పు కణమున్నచో వామి
కుమిలి కుమిలి గాని కూలిపోదు
ఖలుని జీవితంబుఁ గననట్టులే యుండు ॥విశ్వ॥ 1455

కొన్నివేళ లందు ఘోర కృత్యములకు
ఫలము క్షణములోన కలుగు చుండు
చంపఁబోయి కృష్ణుఁ జచ్చెఁగా పూతన ॥విశ్వ॥ 1456

హీనబలు నడంప నెద్ది ప్రయోగింపఁ
దగునొ తెలిసి చేఁత తగు ఘనునకు
పసుల కాపరి పయిఁ బాణ వతంబేల ॥విశ్వ॥ 1457

తనదు జాతిఁజేరఁ దారుచు నుండును
పక్షిగాని లేక పశుపుగాని
యెట్టివాఁడు కోరు నట్టివాని చెలిమి ॥విశ్వ॥ 1458

కఠిన చిత్తుఁడైన ఖలుఁజేరఁ గారాదు
న్యాయ హీనుకొలువు సేయరాదు
గురువుతోడ నెపుడు గ్రుద్దులాడఁగ రాదు ॥విశ్వ॥ 1459

ఖలుఁడు మిడిసి పడినఁ గడకుఁ గన్నీర్గారు
నెండ మిడిసి పడిన నుండువాన
జలధి మిడిసి పడిన బ్రళయము గల్గురా ॥విశ్వ॥ 1460

తనువు నిచ్చినట్టి తల్లిదండ్రుల మాట
విననివాఁడు జయము కననివాఁడు
సత్యమరయ వారె ప్రత్యక్ష దేవతల్ ॥విశ్వ॥ 1461

ఖలునితోడ మైత్రి గావింప సుమతికి
శ్రేయ మొదవ దెపుడు చేటుగలుగు
పాముతోడఁ జెలిమి ప్రాణ హానియెగదా ॥విశ్వ॥ 1462

అందమైన నడక హంసకు నిచ్చెను
గొంతు చక్కఁదనము కోయిలకిడె
గుణములన్ని యొకటి కూడి యుండుట కల్ల ॥విశ్వ॥ 1463

బ్రతికియున్న యపుడు మెతుకులు పెట్టక
చావనొలకి మీఁద గోవునిడిన
నెఱిఁగినట్టి జ్ఞాని హేళన సేయఁడా ॥విశ్వ॥ 1464

పిండిజాతి బొమ్మ యుండదు నునుపుగా
నల్లజాతి బొమ్మఁ జెల్లు నునుపు
మెత్తగాఁ గనఁబడి బొత్తిగా వినఁడొండు ॥విశ్వ॥ 1465

చెట్టుచుట్టునహులు చేరి తిరుగుచు నున్నఁ
చందనంబు విషముఁ బొంద దెపుడు
దుష్టుమైత్రి సహజ శిష్టుఁడు మాఱఁడు ॥విశ్వ॥ 1466

విపుల మెచ్చఁదగిన యుపకార చర్యలు
ఘనుని జీవితమునఁ గానిపించు
మేఘ జలముతోడ మెఱయు మెఱపులట్లు ॥విశ్వ॥ 1467

పరమహంస హృదయ పద్మంబు నిరతంబు
కేవలంబు దయకుఁ దావళంబు
నిండు చంద్రునందు నుండుఁ జల్లఁదనమె ॥విశ్వ॥ 1468

అమృత కలశమైన యాత్మజ్ఞు మనసులోఁ
జెడ్డతలఁపులెట్లు చేరఁగలవు
చెఱకురసమునందుఁ జేదెట్టు లుండును ॥విశ్వ॥ 1469

చిన్నతనము నుండి చేసిన పుణ్యంబు
ముసలితనము నందు ముదముఁ గూర్చు
మంచివాని కెపుడు మరణమే సాక్షిరా ॥విశ్వ॥ 1470

దివ్యె చిన్నదైన దేవతార్చనకడఁ
బూజనీయ మగుచుఁ బొలుచునట్లు
యున్నతాధికార మున్నఁ బిన్నయుఁ బెద్ద ॥విశ్వ॥ 1471

కుమతి కడుపునఁ గడు సుమతి జనించును
సారవంతమైన ధారుణి విడి
మఱ్ఱిజువ్వి మొలచుఁ దొఱ్ఱిగోడల మీఁద ॥విశ్వ॥ 1472

చెప్పుచున్న కొలఁది చెడ్డచేష్టలు చేసి
మడ్డిమనసు తోడ మహిని మనెడి
గ్రుడ్డి లోకమునకు గుణమెట్లు కుదురురా ॥విశ్వ॥ 1473

ఘనుని యశము తనకుఁ గలుగమి ఖలుఁ డెంత
వ్యసన పడిన నంత ఫలము నున్న
త్రెళ్ళిపడునె యుట్టి పిల్లి శాపములకు ॥విశ్వ॥ 1474

సత్య ధర్మములను జక్కఁ బోధింపని
కళలు కళలుగావు కలలుగాని
దివ్యకాంతినీని దీపిక లేలరా ॥విశ్వ॥ 1475

దీన రక్షకుండు దివ్యుల దీవనల్
పొందఁగలఁడు యశము నొందఁగలఁడు
శిబిగడించు కొనఁడె స్థిరతర కీర్తిని ॥విశ్వ॥ 1476

పంజరమునఁ జిక్కఁ బలుకు కమ్మదనానఁ
జిలుకయేమి కీడు చేసెఁ బ్రజకుఁ
దెలివి వలనఁ జెట్ట కలుగు నొక్కొకయెడ ॥విశ్వ॥ 1477

దివ్వెగాలిఁ బెట్టి దేవుఁడా నీదయ
యన్నసద్ది యెట్టు లాఅకుండు
దేవుడిచ్చి నట్టి తెలివి యేమయ్యెరా ॥విశ్వ॥ 1478

ఏక గర్భ జనితు లేమండ రొకటిగా
నమృత మెచటఁ బుట్టె నట్టివార్ధి
నతిభయంకర మగు హాలాహలము పుట్టె ॥విశ్వ॥ 1479

అంతరాత్మ శక్తి నధికముగాఁ జేసి
కొన్నవాఁడె మేలు కొన్నవాఁడు
సరిగఁ గూడునద్ది సాధన సంపత్తి ॥విశ్వ॥ 1480

సూర్యకాంతి తాను చూడఁజాలక గూబ
చెట్టు తొఱ్ఱలోన చేరినట్టు
ఘనమునీంద్రు వాక్కు విన సహింపఁడు మూర్ఖు ॥విశ్వ॥ 1481

క్రూరు నమ్మి మేలు గూర్చినఁ దఱివేచి
మేలుచేసిన నరుఁ గూలఁద్రోయుఁ
బెంచుమన్న వానిఁ బ్రేమించునా పులి ॥విశ్వ॥ 1482

నిశిత దృష్టిఁజూడ నిర్జరుల్ రాక్షసుల్
ప్రజలలోనె కానఁ బడుచు నుంద్రు
శిష్టవరుఁడ మరుఁడు దుష్టుఁడె దైత్యుండు ॥విశ్వ॥ 1483

తన్నుఁదాను గనెడి దారిఁగానఁగ లేక
దేవుఁజాడఁ దెలియఁ దిరుగుటరయ
బిడ్డ చంకనుండ విశ్వాన వెదకుట ॥విశ్వ॥ 1484

తిండి యున్నదనుచు మెండుగాఁ దిన్నచోఁ
గడున జీర్ణమపుడ కలఁతపెట్టు
హద్దు దాఁటెనేని యెద్దియు నట్టులే ॥విశ్వ॥ 1485

ఎప్పుడెద్ది వలుకఁ జొప్పడునో శాంతి
యప్పుడద్ది యాడ నందు ఫలము
దప్పిగొన్న యపుడు తగదాజ్య మీయంగ ॥విశ్వ॥ 1486

వేద శాస్త్రములను వేమాఱు చదివిన
హీనగుణుఁడు ముక్తి నెనయలేఁడు
తమ్మితేనె కప్ప తాగఁగాఁ జాలునా ॥విశ్వ॥ 1487

అనువుగాని దాని కాలోచనలు లేక
యాశపడుట చాల హానికొఱకె
కాంచి యెఱ్ఱఁజేప గాలము మ్రింగుట ॥విశ్వ॥ 1488

భార్య వచ్చినంత బహు సంపదలురావు
తనయుఁ డుద్భవింప దశయురాదు
మబ్బు పట్టినంత మాత్రి వర్షమురాదు ॥విశ్వ॥ 1489

కోట్లు దక్కియున్నఁ గోరికల్ పెంచెడి
పరమలోభి ముదము పడయలేఁడు
ముదము తృప్తివలన నొదవెడు ఫలితము ॥విశ్వ॥ 1490

సూర్యకిరణ వితతి సూటిగాఁ బడువేళఁ
దాళఁ జాలనంత తైక్ష్ణ్యముండు
జవ్వనమున నరుని శక్తియు నంతియు ॥విశ్వ॥ 1491

మంచివానికి జని యించిన మాత్రిన
మంచివాఁడ టంచు నెంచఁ దగునె
యబ్ధిఁబుట్టిన బడ బాగ్ని కాల్పక యున్నె ॥విశ్వ॥ 1492

ఎంత వరదనేని యెదురీదునే గాని
యెఱిఁగి వాలుచేప తిరుగఁబోదు
సహజబుద్ధి మాన్ప బ్రష్టకేని వశంబ ॥విశ్వ॥ 1493

తావి గలుగుపూవు తరుణంబుననె గాదు
నలిగినైనఁ దావి కలుగఁజేయు
లేమినున్న దాత లేశమైన నొసంగు ॥విశ్వ॥ 1494

నువ్వులందు నరయ నూనెయున్నది కాని
గానుగాడ కున్నఁ గలుగునె యది
పురుష యత్నమునను పొసఁగును లాభంబు ॥విశ్వ॥ 1495

వనితనంబుఁ జూవ వర్ధకి నగిషీని
తేఁకుమీఁద దిద్ది తీర్చినట్లు
హితము గుణికిఁ దెలుప జతనంబు ఫలియించు ॥విశ్వ॥ 1496

ప్రకృతియందు నున్న వరమశక్తి యదేమొ
జరుగఁబోవు దాని సరిగఁ దెలుపు
వాన సూచకముగఁ దూనీఁగ లాడవా ॥విశ్వ॥ 1497

సత్య ధర్మ నిష్ఠ సాగించు పుణ్యుండు
శ్రేష్ఠుఁడెట్టు మనును దుష్ట వితతిఁ
బెక్కు కాకులందు నొక్క కోయిల రీతి ॥విశ్వ॥ 1498

మైత్రినున్నఁ గాని శత్రుత్వమునఁ గాని
చెడ్డవాఁడు కీడు చేయుచుండు
కాలునిప్పు బొగ్గు గాఁ జేయినలుపగు ॥విశ్వ॥ 1499

మడ్డి మానవుఁడైన దుడ్డు దొడ్డగ నున్న
వింతగాదు నరులు చెంతఁజేరఁ
గొండమీఁద నున్న కోఁతైన నిగివచ్చు ॥విశ్వ॥ 1500

తానుదినక పరుల కేనియుఁ బెట్టక
విత్తమొకటె కూర్చు పిసినిగొట్టు
కనఁగ లచ్చియింటి కావలి బంటురా ॥విశ్వ॥ 1501

తలఁచినట్టి పనులు తారు మారైనను
గడకుఁ దిండికేని కష్టపడిన
నష్టపడిన నెపుడు భ్రష్టుఁడు కారాదు ॥విశ్వ॥ 1502

రొక్కమున్న యప్డు చిక్కక చేతికి
అద్దిపోయి నంత యడలుటన్న
నక్క పోయినంత బొక్కఁ గొట్టిన యట్టు ॥విశ్వ॥ 1503

నిర్మలునకుఁ జేయు నీతిబోధ ఫలించు
నీచునందు నద్ది నిలువఁబోదు
పిండి రాతిబొమ్మ యుండునా నునుపుగా ॥విశ్వ॥ 1504

తప్పుకొలఁది శిక్ష ధర్మాన నస్థుఁడు
చెప్పి లోకరక్ష చేయునట్లు
పనినిఋట్టి శిల్పి పనిముట్లు మార్చును ॥విశ్వ॥ 1505

చెడ్డ నెరునుపేక్ష చేసిన విడువక
జనుల కతఁడు కీడు నలుపుచుండు
నూరఁబాము చేర నూరకుండుట మేలె ॥విశ్వ॥ 1506

చెడ్డవాని మైత్రి చేసిన సుజనుఁడు
నిల్పుకొనఁగ లేఁడు నిజసుబుద్ధి
ఋఋ మాపములకు నతఁడితఁడగు నందుౘ ॥విశ్వ॥ 1507

క్షుత్తులేక యున్న క్షుద్రజంతువుఁ జూచి
పులి వధింపకుండఁ బోనియట్లు
క్రూర చిత్తుఁడెపుడు ఘోరకృత్యమెసల్పు ॥విశ్వ॥ 1508

సుజనులాడు మాటఁ గు జనులొల్లరు వినఁ
గుజనులాడు మాట సుజనులట్లె
కలుప వలయు నన్నఁ గలియు నాధ్రువములు॥విశ్వ॥1509

దాత లోభిగాఁడు తాఁబేదయయ్యును
పిఱికిపంద గాఁడు వీరవరుఁడు
సింహమెట్లు గ్రామ సింహముగా మాఱు ॥విశ్వ॥ 1510

చేతగాని పనులు చేయరాదెన్నఁడు
చేసెదేని యవియ చేటుగూర్చు
ఈఁతరాని మనుజుఁ డీదునా నదిలోన ॥విశ్వ॥ 1511

పరులసొమ్ము మీఁద భ్రాంతి గల్గినవాఁడు
ధర్మ సూత్రములను దలఁపఁ డొరుల
పచ్చిగడ్డిఁ జూచి పశువూర కుండునా ॥విశ్వ॥ 1512

గారడీఁడు చూపు గడుచిత్రి దృశ్యముల్
వేశ్యచూపు నక్క వినయములను
మోసగాఁడు చూపు వేసముల్ పెక్కురా ॥విశ్వ॥ 1513

సృష్టిధర్మ మెల్ల శృంగారమున నున్న
క్షాత్రి ధర్మముననె శాంతి యున్న
కరుణరసము నందె కైవల్య మున్నది ॥విశ్వ॥ 1514

గాఢమైన వ్యర్థ మూఢ విశ్వాసాన
మంచి నెంచలేని మనుజుఁ డెన్న
గంతగట్టి నట్టి గానుగెద్దే గదా ॥విశ్వ॥ 1515

చంద్రుఁడున్న రాత్రి సౌందర్యముఁ దోఁచు
లేనిరేయి సొగసు లేకయుండు
కలిమి లేములందుఁ గనఁబడు గృహమిట్లె ॥విశ్వ॥ 1516

చిన్నచీమ నడచి చేరుపెక్కు మడల్
కదలఁడేని చనఁడు గరుడుఁ డైన
జతన మింతలేక సాధించునా పని ॥విశ్వ॥ 1517

ప్రజ పరీక్షకుఁ బతి పాలు పోయుండన
నేను నీరుపోయ నేమికొఱఁత
యనుచుఁ బోసిరంద ఱటులోక మిట్టిది ॥విశ్వ॥ 1518

ఏటినడుమ నోడ యెదుటి యొడ్డును జేర
నెంతభ్రాంతి పడునో యంతభ్రాంతిఁ
బరితపించు యోగి పరమాత్ముఁ జేరఁగా ॥విశ్వ॥ 1519

పుట్టుకతోడ వచ్చు బుద్ధిని మార్పంగ
శక్యమగునె యెంత జాణకైన
కుక్కతోఁక నెవఁడు చక్కజేయఁగలాఁడు ॥విశ్వ॥ 1520

రాము నంతవాఁడు రావణ కృతచర్య
సీతకొఱకు చాల చిక్కులుపడె
నెంత వారికైనఁ జింతలు తప్పవు ॥విశ్వ॥ 1521

చిన్నతనము నందె చెడు స్నేహములు చేయు
వానిగుణము చక్కఁ బడదు వసుధ
చవిటినేలఁ బాఱు జలము చప్పఁగ నుండు ॥విశ్వ॥ 1522

అబ్బుఁడొసఁగు హాయి యలకల్వ యెఱుఁగును
వల్లజాతి కెట్లు తెల్లమగును
మంచివాని మహిమ మంచివాఁడె యెఱుంగు ॥విశ్వ॥ 1523

అరయ సంఘమందు నైకమత్యము చెడ
కొంటెకూఁత యొకఁడు కూయుటన్న
గొప్ప కుప్పలోన నిప్పుపెట్టిన రీతి ॥విశ్వ॥ 1524

పాపులెపుడు నాల్గు పాదాల నడతురో
పుణ్యులెపుడు సుఖము పొందు చుందురో
కృతయుగంబు నాఁడె యేర్పడి నట్లురా ॥విశ్వ॥ 1525

ఓటికుండ నీటి సాటియాయువు నాక
శాశ్వతముగఁ బ్రదుకఁ జాలునట్టు
లాశ పెంచుకొనుచు నల్లాడు చుందురు ॥విశ్వ॥ 1526

కథను విన్నమాత్ర కైవల్యమది రాదు
దానినీతి నడతఁ దనరఁ జేయ
నిహపరంబు లందు నెంతొ మేలును బొందు ॥విశ్వ॥ 1527

ఎల్ల ధర్మములకు నిల్లైన సత్య వా
జ్నిష్ఠ నిచ్చనెవఁడు నిలిచియుండు
నతనికెల్ల జగము లంజలి ఘటియించు ॥విశ్వ॥ 1528

పన్నుగట్టఁడే ది వాణమునకు దొంగ
పదము కానివాఁడు బడికి దొంగ
సుకృతి కానివాఁడు సురపురికిం దొంగ ॥విశ్వ॥ 1529

మేలి లక్షణముల మెఱసెడి కన్నియ
దొఱకుటెంతొ కష్ట తరము ధరణి
నటనీట లభియింప నంగడి వస్తువా ॥విశ్వ॥ 1530

మొగలిపూవు చుట్టు ముండ్ల తెక్కలె యుండు
తేనెటీఁగ లుండు తేనెచుట్టు
రాజరాజు చుట్టు రక్షకు లుందురు ॥విశ్వ॥ 1531

కోళ్ళు గెలికినట్టు కొంపలో నుండిన
శుచిని గోరువాఁడు చొఱఁ గలఁడె
బురదనీట గేదె పొర్ల గోఁటఁబోదు ॥విశ్వ॥ 1532

ఫలము గొప్పదనుచుఁ దులసిని బూజింత్రు
దురద గొండి కెవఁడు దోసిలొగ్గు
గుణము మంచిదైన జను లాదరింతురు ॥విశ్వ॥ 1533

తనకుఁ దోఁపకున్నఁ దగిన పెద్దలు సెప్ప
వినినవాఁడె మేలు కొనినవాఁడు
రెండు లేనివాఁడు మొండికి మొనగాఁడు ॥విశ్వ॥ 1534

అగ్గిమీఁద సరిగ హస్తంబు పెట్టిన
నెట్లు కాలకుండు నేరికైన
దుష్టుతోడఁ జెలిమి దుఃఖంబు గూర్పదా ॥విశ్వ॥ 1535

పాలు త్రాగుచుండి పసిబిడ్డ కొఱకును
గాళ్ళతోడఁ దన్నుఁ గసరికొట్టు
ధరణియోర్పు కన్నఁ దల్లియోరుపు మిన్న ॥విశ్వ॥ 1536

నారికేళమునకు నాటేఁడు నీర్పోయ
వంద వత్సరములు ఫలములిచ్చు
సుమతి కుపకరింప నమిత ఫలంబిచ్చు ॥విశ్వ॥ 1537

మంచివాని వోలె మనకుఁ గాన్పించినఁ
జెంతఁబేరి హాని సేయు ఖలుఁడు
మెత్తగఁ గనఁబడిన మిత్తి వంటిది పాము ॥విశ్వ॥ 1538

పండితుండె గాని పామరుఁడే గాని
ధర్మ వర్తనమున ధన్యుఁడగును
నడత సరిగలేక నాకంబు చేరఁడు ॥విశ్వ॥ 1539

చెలిమి చెడ్డదైనఁ జేటొనఁగూడును
ఆదియందె దాని నడఁపవలెన్న
ఆకుముడుత తెగులు నణచని చేనురా ॥విశ్వ॥ 1540

పాదరక్షణ కయి పాదరక్షలు కొన
పాదశిక్షణమున బాధపెట్టు
కాని కాలమందు కర్మ మిట్లుండురా ॥విశ్వ॥ 1541

పిన్నవాఁడె కాని పెద్దవాఁడే కాని
గొప్పకీర్తి నందు కొనని యెడల
పుట్టలోని చెదలు పుట్టిచచ్చిన రీతి ॥విశ్వ॥ 1542

వరము నిచ్చుదనుక వరతపం బొనరించి
యింక నాకుసాటి యెవ్వఁడనుచు
భవుని జంపఁదలఁచి భస్మాసురుఁడు చచ్చె ॥విశ్వ॥ 1543

నరుఁడు మిడిసిపడిన నరకంబు ప్రాప్తించు
నెండ మిడిసిపడిన నుండుపాన
జలధి మిడిసిపడినఁ బ్రళయంబు గలుగురా ॥విశ్వ॥ 1544

కులట వీధికెక్కి కులసతిం దూఱిన
నామెమదికి సుంత నంటఁ బోదు
చలువజాతి కెట్లు చిక్కిలిగిలి యుండు ॥విశ్వ॥ 1545

ఎడమచేతఁ బెట్ట నేవస్తువైన
మఱపువచ్చు నెట్టి మనుజునకును
ప్రకృతి గర్భ మహిమ పరికింప శక్యమా ॥విశ్వ॥ 1546

ముఱికిగుంట మీఁద మూగెడి యీఁగలే
చెఱకురసము పైకి చేరుచుండు
చెడ్డవారు గూడ దొడ్డవారగు చుండ్రు ॥విశ్వ॥ 1547

శిరమునందు గంగ చెలగిన నభిషేక
జలము నిచ్చగోరు శంభుఁడుర్వి
నెంతయున్న వాఁడి కెంతేని కోరును ॥విశ్వ॥ 1548

పాపమనఁగ వేఱె పరదేశమున లేదు
తనదు నడతయందె తగిలి యుండు
దాని ఫలిత మెవఁడు తప్పించు కొనలేఁడు ॥విశ్వ॥ 1549

పేడికేల సమర వీరుని దుస్తులు
జడున కేల పదవి శాసనసభ
దృష్టిబొమ్మ కేల దివ్య స్వరూపంబు ॥విశ్వ॥ 1550

సతము భక్తితోడ సర్వేశుఁగొల్చెడి
వరమసాధ్విఁ బరుఁడు పట్టఁగలఁడె
నిప్పు నెవ్వఁడేని గుప్పెటఁ బట్టునా ॥విశ్వ॥ 1551

పరుల మోనగించి బ్రతికెడి క్రూరుండు
భోగ భాగ్యములను బొందుఁగాక
జముని సన్నిధాన పమ్మెట పోటులే ॥విశ్వ॥ 1552

దొంగ తిరుగుచుండు దొరవలె ఠీవిగా
నెవరు తనదు చేష్ట నెఱుఁగరనుచు
నరుఁడు చూడకున్న హరుఁడేల చూడఁడు ॥విశ్వ॥ 1553

సత్య ధర్మములను సరిగఁ గాపాడఁగాఁ
దగినరీతిఁ జెప్పి తగదు నాక
గురువుతోడ నైన గుద్దులాడఁగ వచ్చు ॥విశ్వ॥ 1554

వెనుక ముందర యని విప్లవ సంఘంబు
బయలుదేర నాఁప బ్రహ్మతరమ
వరద వచ్చువేళ వారింప వశమౌనె ॥విశ్వ॥ 1555

బురదఁ బుట్టెఁ గప్ప బురదఁ బుట్టె జలజ
మైన భేదమెన్న నలవియగునె
కలదు భేదమెంతొ ఖలునకు ఘనునకు ॥విశ్వ॥ 1556

నాచు నడుమనున్న నాళీక మట్టులు
కాకిమూక నడుమ కోకిలవలె
ఖలుల గుంపు నడుమ ఘనుఁడట్లు వెల్గురా ॥విశ్వ॥ 1557

సాధు జంతువులను జంపు వ్యాఘ్రాదులు
పిన్నచేప మ్రింగుఁ బెద్దచేప
బడుగు జోలికేగు బలవంతుఁ డెవ్వాడు ॥విశ్వ॥ 1558

పేదసంస్థ కొఱకు ప్రేమ నీఁ జూచినఁ
గోరినంత ధనము కూడఁగలదె
పొట్టునెంత చెఱుగఁ బ్రోగౌనె గింజలు ॥విశ్వ॥ 1559

కాలు పెట్టఁ గలఁడె కమలాకరము నందు
మొసలి యుంట నెఱిఁగి మూర్ఖుఁడైన
తెలిసి యెవఁడు మైత్రి ఖలునితో నొనరించు ॥విశ్వ॥ 1560

చేయరాని పనులు చేయుచు లోలోనఁ
బైకి నెంతొ మంచి వాడివోలె
గోచరించు వారు గోముఖ వ్యాఘ్రముల్ ॥విశ్వ॥ 1561

తనకు మిత్రుఁడైనఁ దప్పుల నెంచరు
శత్రువైనఁ దప్పుఁ జాటుచుంద్రు
మంచివానినైన మన్నింపఁ జూతురా ॥విశ్వ॥ 1562

కూడు కూర్పలేని కోర్కెలు వృథయొందు
కూర్పునదియు మేలు కొండయంత
గొప్పతెలివి కంటె గోరంత దశమేలు ॥విశ్వ॥ 1563

మూర్ఖుఁ డెన్నఁడేని మునివల్లెఁ జేరఁడు
సాధ్వి మైత్రికొఱకు చనదు కులట
సూర్యుఁడున్న దెసకుఁ జొచ్చునా చీఁకటి ॥విశ్వ॥ 1564

ఒకఁడు మనసుచేత నొకఁడు కాయముచేత
శ్రమయొనర్చుఁ బనులు జరుగుటకయి
కనఁగఁ గష్టజీవి కానివాఁడెవ్వఁడు ॥విశ్వ॥ 1565

కలిమిచే వెలుంగు ఘనునీర్ష్యతోఁ జూచు
మెతుకు లేనివాని మేలమాడు
లోకమునకు నీతి లోటెంత కలదురా ॥విశ్వ॥ 1566

గిల్లి జగడమాడు కిర్గాడులకు శాస్తి
జరుగ వారి నడత వరిగసాగు
నంకుశంబు గుచ్చ హస్తి చక్కంబోవు ॥విశ్వ॥ 1567

సాధుహింస జరుగు సమయాన శక్తి గ
లారలూర కొనుట ఘోరదోష
మందువలన దేశ మాపద పాలౌను ॥విశ్వ॥ 1568

కర్మఫలము దాఁటఁ గాఁజాలఁడెవ్వఁడు
భోగియైనఁ బరమ యోగియైన
దానిదాఁటు నతఁడు దైవ సమానుఁడే ॥విశ్వ॥ 1569

అక్కఱున్న మనుజు మక్కువఁ గనకుండ
ధిక్కరింపఁ జాల చిక్కులొదవు
చెఱువుమీఁద నల్గఁ జే టెవ్వరికిఁ గల్గు ॥విశ్వ॥ 1570

అన్నిపనుల యందు ననురాగ మహిమతో
నాలుమగల మనసు లతికెనేని
అంతకంటె స్వర్గ మవనిపై లేదురా ॥విశ్వ॥ 1571

కఠిన శిలవసించు కప్ప కఱవదేరి
నీటనుండు మొసలి నిగిడి కఱచు
స్థానగుణము కాదు వాని గుణములవి ॥విశ్వ॥ 1572

ముదిమి ముక్తిఁగోరు మునివర్యుఁ డెదురైన
గేలిసేయు నట్టి కాలమిదియె
ధర్మమిప్పు డెచటఁ దలదాచు కొన్నదో ॥విశ్వ॥ 1573

వేఁటకాఁడు మృగము వెంటనేగెడు భంగి
నింద్రియముల వెంట నేగుమనసు
మనసుఁ జిక్కఁబట్టి మరలించు ముక్తికి ॥విశ్వ॥ 1574

మంచిగుణము లున్న మనుజుని బూజింప
వాదమేల మనకు భేదమేల
మల్లె వొల్ల మనెడి మానవులుందురా ॥విశ్వ॥ 1575

ఎన్నియున్నఁ జివఱ కెత్తుకొని చనఁడు
బ్రతుక మెతుకు ముందు వలయుఁ గావఁ
బాడి పంటలున్న బహుభాగ్య మున్నట్లు ॥విశ్వ॥ 1576

ముక్తికాంత సెవఁడు ముదముతో నీయఁడు
నీదు నడతచేత నీవెపొందు
మోగమనె దాని భోగము గల్గురా ॥విశ్వ॥ 1567

ఒరులు నిన్నుఁజూచి యోర్వలే కేదేదొ
మాటలాడ నీవు మౌనమూను
నిజము తెలిసి కడకు నిన్నె మెచ్చుజగము ॥విశ్వ॥ 1578

గానమహిమ చేతఁ గైవల్య మందిన
వారుగలరు చెడిన వారుగలరు
దానిఁ ద్రిప్పుకొన్న దారులు వేఱురా ॥విశ్వ॥ 1579

ధనముఁ గొల్తువేని దారిద్ర్యములు వాయు
వేల్పుఁ గొల్తువేని వెతలు వాయు
భవుని గొల్తువేని భవబంధములు వాయు ॥విశ్వ॥ 1580

మేలు చేసినట్టి మిత్రుని మఱచిన
వాఁడు నరుఁడుగాఁడు వానరుండు
ధీరుఁడెఱుఁగు నీతి తిర్యక్కు లెఱుఁగునా ॥విశ్వ॥ 1581

పరమహంస సాటి పాపాత్ముఁ డెటులౌను
సింహమునకు గ్రామ సింహ మెనయె
కులసతి తులయౌనె కులటి యెన్నటికైన ॥విశ్వ॥ 1582

నీటిచుక్క వార్ధి నిలువ భాగము గల్గు
నెగిరినేలఁ బడ్డ నిగురునట్లు
పరగుచుండు సతము పరమాత్మ జీవాత్మ ॥విశ్వ॥ 1583

పెద్దవారి మాటఁ బెడచెవిఁ బెట్టి దు
ర్యోధనుండు కీడు నొందలేదె
బుధుల బోధవినక పోవుట వెతలకే ॥విశ్వ॥ 1584

కఠిన కావ్యరసము గ్రహియింప రందఱు
శైలి సులభమైనఁ జదువఁ గలరు
సన్న కాలువనుండి జలము చేలకుఁజేరు ॥విశ్వ॥ 1585

ఇంద్రియముల గెల్చి యీశ్వరుఁ గొల్చుచో
కర్మబంధ చయము కాలిపోవు
ముక్తికాంత నిన్ను మోహించి వచ్చురా ॥విశ్వ॥ 1586

దంతి పాదముద్రఁ దక్కిన మృగముల
పాదముద్రలిముడు భంగినొక్క
సత్యమందె యుండె సర్వ ధర్మంబులు ॥విశ్వ॥ 1587

కుటిల చిత్తమందె క్రూర కర్ములుండు
ముఱికి గుంటయందె పురుగులుండు
అపరిశుభ్రమందె యన్ని రోగములుండు ॥విశ్వ॥ 1588

మగఁడు గడుసరైన మగువ మెత్తనిదగు
జంట యేకరీతి నుంట యరుదు
జలజ హితుఁడు వేడి చంద్రుఁడు చల్లన ॥విశ్వ॥ 1589

అప్పు చేయువేళ నాత్మలో దుఃఖించి
తీర్చి సంతసించు ధీరవరుఁడు
ఖలుఁడు తీర్పకుండ కాల్త్రివ్వఁ గలనికి ॥విశ్వ॥ 1590

శ్రద్ధలేక యెట్లు చదువులు సమకూరు
జలములేక యెట్లు పొలము పండు
భక్తిలేక యెట్లు ముక్తిఫలము దక్కు ॥విశ్వ॥ 1591

పాలు పెక్కునాకు పైమరుగే నీకు
అన్న రీతిఁ గొంద ఱాచరింత్రు
జాలిలేని నరులు మేలెంచఁ జాలరు ॥విశ్వ॥ 1592

సత్య ధర్మములను జక్క బోధించెడి
వాఁడు పరుషవాక్కు పలుకనేమి
బాగుసేయఁ గోరి భాషించు నట్టులు ॥విశ్వ॥ 1593

ఖలుఁడు తప్పుచేసి ఘనుల దూషణపడి
మిగుల సంతసమున మిట్టిపడును
ఎండగాయ తుమ్మ యేపుగాఁ బెరుఁగదా ॥విశ్వ॥ 1594

గూటి పక్షియున్న గూడందముగ నుండుఁ
బక్షి యెగిరిపోవఁ బాయు కళను
జీవుఁడున్న వఱకె జీవికి కళయుండు ॥విశ్వ॥ 1595

ఎల్ల వేళలందు నేదేశమందైన
ఖలులు సుజనులుందురి గాన బుధుల
నీతులన్ని యొక్క రీతిగా నుండును ॥విశ్వ॥ 1596

చక్కఁదనమె గాక సద్గుణ ముండినఁ
గనకమునకుఁదావి కలిగినట్లు
లబ్ధి యఖిల జనుల కందని సొమ్మురా ॥విశ్వ॥ 1597

చెడని ప్రేమ కలిమిఁ జిల్క గోర్వంకల
యట్టు పతియుఁ బతియు నలరిరేని
అంతకంటె స్వర్గ మదియెట నున్నది ॥విశ్వ॥ 1598

నీచుఁగోరి చేరి నీవెంత నిక్కినా
లెక్క సేయుఁబోరు పెక్కుజనులు
బురదఁజేరు నీరు పుణ్యజలంబౌన ॥విశ్వ॥ 1599

పరుగులెత్తు వానిఁ దరిమికొట్టఁగ నెంతు
తిరిగికొట్టు వాని దరికిఁ జనరు
కన్నుఁదగులు పుల్లఁ గనిపెట్టి తిరుగరా ॥విశ్వ॥ 1600

పాలు నీరువోలె నాలుమగల యాత్మ
లైక్యమైన నదియ యమిత సుఖద
మడ్డిలేకయున్న రద్దికూడే గదా ॥విశ్వ॥ 1601

బలము కలిమి హింస సలుపువాని నడంపఁ
గడఁగవలయు, నిండ్లు కాల్చువేళ
నందఱూరకొన్న నగ్ని చల్లారునా? ॥విశ్వ॥ 1602

ఎదురు లేకయున్న నింతవాఁడే నెంతొ
యెగిరిపడుట నిజమ దెట్టులన్న
గాలిలేమి దోమ కాటు హెచ్చునుగదా ॥విశ్వ॥ 1603

సాము దినము క్రొత్త చదువింక నెలక్రొత్త
పూటపూట సుదతి పొందుక్రొత్త
కొసరి కొసరి పుట్టు కోరికలే క్రొత్త ॥విశ్వ॥ 1604

లక్ష్మికొలఁది తనరు లలిత భోగంబులు
భక్తికొలఁది కలుగు ముక్తిఫలము
మేపుకొలఁది పశువు చేపని చెప్పరా ॥విశ్వ॥ 1605

కలుగుచుండు నెపుడు కల్లగాదీమాట
ధర్మబలము చేత దైవబలము
దైవబలము చేతఁ దగినంత విజయంబు ॥విశ్వ॥ 1606

పోలునంచు నొకఁడు వోలదంచు నొకండు
పలుకుచుండ నిజము తెలియలేఁడు
ఆత్మ లేనివాని కనుమానములు పెక్కు ॥విశ్వ॥ 1607

ఐహికముజ కంటె నాముష్మికము మిన్న
కలిమికన్న మంచి చెలిమి మిన్న
బలిమికన్న నాత్మ బలమెంతొ మిన్నరా ॥విశ్వ॥ 1608

తెడ్డు కూరలోన దినమెల్ల నున్నను
దెలియఁ గలదె రుచిని ధీరుగుణము
లెంత కలసియున్న హీనుఁడే మెఱుఁగును॥విశ్వ॥ 1609

నారికేళమునకు నాటేండ్లు నీర్వోయ
వంద వత్సరములు ఫలములిచ్చు
సజ్జనునకుఁ జేయు సహకార మట్టిది ॥విశ్వ॥ 1610

మనము పెట్టుకొన్న మతభేదములె కాని
దేవుఁడొక్కఁ డనుచుఁ దెలియఁ దగును
కుండ లెన్నియున్న నుండు మట్టియొకటె ॥విశ్వ॥ 1611

మనసు మంచిదైన మర్యాద చేకూరుఁ
దరుగులేక పెరుగు దాతకెపుడు
చెత్తఁదోలఁ జేను చెప్పకుండనె పండు ॥విశ్వ॥ 1612

ఏన్గు పల్లెటూరి కేగుదెంచిన యంత
వెంటఁబడుచు మందుఱి పిల్లలెల్లఁ
గ్రొత్తవింత పొఱిఁత రోతని యందుఱిగా ॥విశ్వ॥ 1613

నరుఁడు గూర్పలేఁడు గురుఁడు గూర్పఁగలేడు
వక్త కూర్పలేఁడు ముక్తికాంత
మతము మోక్షమీదు మనసె మోక్షంబిచ్చు ॥విశ్వ॥ 1614

జ్ఞానసూన్య మనసు గాఢాంధ కారంబు
క్రూర చోరుమనసు కొఱుచిచ్చు
పుణ్యపురుషు మనసు పున్నమ వెన్నెల ॥విశ్వ॥ 1615

మజ్జనమున లేదు మహిమలలో లేదు
యుక్తి యందు లేదు ముక్తిపథము
మతమునందు లేదు మతిలోనె యున్నది ॥విశ్వ॥ 1616

కుఱిళ్ళినట్టి కాయ కొదమ వానింగూడఁ
గుళ్ళఁజేయు నట్టె కుమతి సఖుల
చిత్తశుద్ధి గూడఁ జెడఁగొట్టు చుండురా ॥విశ్వ॥ 1617

తప్పు చేయకుండఁ దలవంచి తిరుగును
సర్వవేళలందు సజ్జనుండు
తప్పుచేసి ఖలుఁడు తలయెత్తి తిరుగును ॥విశ్వ॥ 1618

షండువలన నెట్లు సంతతి కలుగును
భాష్యమెట్లు మూఁగ పలుకఁ గలఁడు
ఖరము ఘనమువలనఁ గఱువెట్లు తీరురా ॥విశ్వ॥ 1619

నిక్కమైనయోగ నిష్ఠ నిల్చినవాఁడు
స్త్రీనిజూచి భ్రాంతి చెందఁగలఁడె
యుప్పులోనఁజెట్టు నుద్భవించును బుద్ధి ॥విశ్వ॥ 1620

తాతలెటకుఁ జనిరి తండ్రులెటేగిరి
తనువు శాశ్వతమని తలఁపబోకు
నీటిమీఁద బుడగ నిలుచునా స్థిరముగ ॥విశ్వ॥ 1621

వండుకొన్న వాని కుండును నొక కూర
బిచ్చగానికుండు పెక్కు తలఁప
పతికి నొక్క భర్త సానికిఁ బలువురు ॥విశ్వ॥ 1622

దేవగురుని చెంత దివ్య బోధలు విన్న
బుద్ధిలేక ముక్తి పొందఁబోఁడు
గుణము చెడ్డదైన గురువేమి చేయురా ॥విశ్వ॥ 1623

మెట్టమీఁది గాలి మిట్టిపడును వేడి
జలముమీఁది గాలి చల్లనగును
పరిసరమును బట్టి ప్రజమాఱుచుండును ॥విశ్వ॥ 1624

ఉన్నదానిలోన యొక కొంత పరులకు
నిచ్చు దాత కిచ్చు నీశుఁడెపుడు
తీసిన జలమూరుఁ దీయనిదూరునా ॥విశ్వ॥ 1625

పండుటాకుపైని భ్రాంతి తక్కువ కాని
చిగురుటాకుమీద చిత్తముండు
ముసలివానికంటె పసివానిపై మోజు ॥విశ్వ॥ 1626

మోసగానిమాట ముదముతో వినుచుందురి
సత్యవాదిమాట సఱకు గొనరు
గొల్లవాని నెపుడు గొఱ్ఱె నమ్మదుగదా ॥విశ్వ॥ 1627

కావిగుడ్డలెన్నొ కట్టిన మాత్రాన
ముక్తి పొందగలడె? మునివరువలె
రాజు వేషధారి రాజౌనె నిజముగా ॥విశ్వ॥ 1528

ఆలిమీది ప్రేమ అమ్మపై నది కల్ల
అత్తఁజూడరట్టె అమ్మవోలె
తనయుమీది మమత తండ్రిపై యుండునా? ॥విశ్వ॥ 1629

గౌరవించి యొరుల గౌరవమందుము
సేవచేసి నీవు సేవలందు
పూజచేసి గురుల బూజ్యుడవగుమయా ॥విశ్వ॥ 1630

కొడుకు మీది ప్రేమ కోడలిపై నున్న
లోపమెన్నఁ గలదె? లోకమెపుడు
కన్నుమనదెయన్నఁ గాలును మనదెగా ॥విశ్వ॥ 1631

అధికు నెదుట నధముఁ డలరఁడెన్నఁడును
పగలు రేయి మింటఁ బరగుచున్న
సూర్యకాంతిలోనఁ జుక్కలు వెలుఁగునా? ॥విశ్వ॥ 1632

వింత వేషములను వేయుచుఁ దిరుగుచు
గుట్టు తెలిసికొనెడి గూఢచారి
నిగురు గప్పినట్టి నిప్పునఁ జెల్లదా? ॥విశ్వ॥ 1633

ఈశుమహిమ యేమొ సృష్టికిఁ బ్రతిసృష్టి
అన్నయట్లు కొన్ని యున్నవన్న
వేమువోలె నేల వేమదియుండదా? ॥విశ్వ॥ 1634

పెట్టి చావకుండ కట్టి విఱుగకుండ
తీర్పు చెప్పుటేమి తెలివి యద్ది
పిల్లి తీర్పుగాని పెద్దల తీర్పౌకొ ॥విశ్వ॥ 1635

ఉట్టిమీద బెల్లమున్నదియని పెద్ద
చెట్టుమీది చీమ కెట్టుతెలిసె?
ఈశుమహిమ గాక యితరుల మహిమొకొ? ॥విశ్వ॥ 1636

భర్త భార్యతోడ భార్యయు భర్తతోఁ
గష్టసుఖము లందుఁ గలసి యుండు
వడ్లతోడ నెండ వలదె తట్టయుఁగూడ ॥విశ్వ॥ 1637

కలిమి లేములందుఁ గష్టసుఖము లందు
మనసు నొక్కరీతి మసలఁజేయు
నతఁడె జ్ఞానియండు రాత్మతత్త్వజ్ఞులు ॥విశ్వ॥ 1638

కాకి కూయఁగలదె? కోకిలచందాన
అంచవోలెఁ గొంగ యడుగులిడునె?
పరమహంస వోలెఁ బామరుఁ డాడునే? ॥విశ్వ॥ 1639

చిత్తసీమ నిల్పి శివకేశవులఁ గొల్వ
నిహము పరమునిచ్చ యేలఁగలరు
పరులఁగొల్వఁ బరమ పదమీయఁ గలరొకో ॥విశ్వ॥ 1640

ధనము లేక యొక్క క్షణమైన జరుగదు
ధనము పోటియేది? దానిఁ జూపఁ
గొండమీద నున్న కోతియు దిగివచ్చు ॥విశ్వ॥ 1641

మున్ను చేసినట్టి పుణ్యము పాపము
నీదువెంట వచ్చు నీడవోలె
దానివదలి తరలఁ దరముగా దెరికి ॥విశ్వ॥ 1642

కన్నతండ్రి మాట కడుపు నిండగఁజేయు
మిత్రివర్యు మాట మేలుగూర్చు
పరమగురుని మాట వజ్రాల మూటరా? ॥విశ్వ॥ 1643

కఁడ కావరమునఁ గనులు గానఁగలేక
ధర్మమన్న మాట తలపుఁడెప్పు
డన్నియుడిగి నంత హరిహరులఁ దలచు ॥విశ్వ॥ 1644

భర్త కోపగింపఁ బసిబిడ్డఁ గొట్టుట
యేమితెలివి భార్యకేమి గొప్ప
అత్తమీది కినుక దుత్తపైఁ జూపుట ॥విశ్వ॥ 1645

ప్రేమజూపు నదియె ప్రియురాల నందగు
కూడు బెట్టువాఁడె కొడుకనఁదగు
కాంక్షలిచ్చు నదియె కల్పవృక్షము గదా ॥విశ్వ॥ 1646

గిల్లి జగడమాడు కిగ్గాని చెంతకుఁ
జేరవలదు వాని చెలిమి వలదు
క్రూరజంతు వెపుడు కోరునా? మేల్పేయ ॥విశ్వ॥ 1647

ధనములేక యొక్క క్షణమైన జరుగదు
ధనము సాటియేది? వానిఁజూపఁ
గొండమీద నున్న కోతియు దిగివచ్చు ॥విశ్వ॥ 1641

మున్న చేసినట్టి పుణ్యము పాపము
నీదువెంట వచ్చు నీడవోలె
దానివదలి తరలఁ దరముగా దెరికి ॥విశ్వ॥ 1642

కన్నతండ్రి మాట కడుపు నిండగఁజేయు
మిత్రివర్య మాట మేలుగూర్చు
పరమగురుని మాట వజ్రాల మూటరా? ॥విశ్వ॥ 1643

కఁడ కావరమునఁ గనులు గానఁగలేక
ధర్మమన్న మాట తలపుఁడెప్పు
డన్నియుడిగి నంత హరిహరులఁ దలచు ॥విశ్వ॥ 1644

భర్త కోపగింపఁ బసిబిడ్డఁ గొట్టుట
యేమితెలివి భార్యకేమి గొప్ప
అత్తమీది కినుక దుత్తపైఁ జూపుట ॥విశ్వ॥ 1645

ప్రేమజూపు నదియె ప్రియురాల నందగు
కూడు బెట్టువాఁడె కొడుకనఁదగు
కాంక్షలిచ్చు నదియె కల్పవృక్షము గదా ॥విశ్వ॥ 1646

గిల్లి జగడమాడు కిగ్గాని చెంతకుఁ
జేరవలదు వాని చెలిమి వలదు
క్రూరజంతు వెపుడు కోరునా? మేల్పయ ॥విశ్వ॥ 1647

తల్లిమాట యన్నఁ దాఁచుపాపై లేచు
నాలిమాట యన్న నాదరించు
కాలలీలఁ దెలియఁగా శక్యమగునొకో ॥విశ్వ॥ 1655

పెద్దలయెడ భక్తి పిన్నలయెడఁ బ్రేమ
కలిగియున్న నీకుఁ గలుగు కీర్తి
అపుడె నీకు నంద అనుకూలు రై యుంద్రు ॥విశ్వ॥ 1656

ఎంచజ్ఞాన దృష్టి సృష్ట్యాది నుండియు
మంచిచెడులు రెండు మనకుఁ దోఁచుఁ
గాలలీల గాదు కర్మలీలయె గాని ॥విశ్వ॥ 1657

లోభినెంతొ వేడి లోకువగుటె గాని
ఆశతీర దించు కంతయైన
ఆకులగ్ని కాల్ప నగునొకో బొగ్గులు ॥విశ్వ॥ 1658

జీవి సృష్టికెల్ల జీవము ప్రేమయే
యద్దిలేమి సృష్టి యాగిపోవు
అద్ది జ్ఞానులందు నలరు దయాదృష్టి ॥విశ్వ॥ 1659

ఆలుమగల కున్న యనుబంధమును బాప
తరమె యేరికైన ధాతచేతి
వ్రాతమహిమ యొకటి పాప సమర్థంబు ॥విశ్వ॥ 1660

తోలు బొమ్మలాట బోలు నీ జగమెల్ల
పాత్రధారు లెన్నఁ బ్రాణి చయము
సూత్రధారి మనము చూడఁగాఁ జాలము ॥విశ్వ॥ 1661

మార్గమెఱిఁగె నేని మానవ మాయను
దాటవచ్చు గోట మీటవచ్చు
దైవమహిమ దాట దారియే లేదురా ॥విశ్వ॥ 1662

శత్రువర్గమునకు జయమెట్లు కలుగును
కాంస్య దుర్గమయిన గఱఁగిపోవు
దైవకరుణ యున్నఁ దనకె జయమ్మగు ॥విశ్వ॥ 1663

వందలిచ్చి మంచి పాడిబఱ్ఱెను గొని
పళ్ళుకాడ యేఱ పారిలుమాలు
ఇల్లుగట్టి తలుపు నెవడు పెట్టకయుండు ॥విశ్వ॥ 1664

ఓర్పు నేర్పులేక యొనగూడునా పనుల్
ఘనులకైన దీన జనులకైన
కోతిగంతు లిడిన గోర్కెలు తీరునా? ॥విశ్వ॥ 1665

ఆది సర్వఋషుల కడ్డబొట్టే గాని
నిలువు బొట్టులేదు నిశ్చయముగ
మొదట శైవమతమె పుట్టిన దనవచ్చు ॥విశ్వ॥ 1666

పాలు నీరు వేఱు పఱచ హంసకెచెలు
వాయసంబు వేఱు పఱచఁ గలదె
అలవిగాని దాని అమరేశు డెటుచేయు ॥విశ్వ॥ 1667

మోటువానితోడ మాటాడఁ గూడదు
తగని మాటలాడి తగవుదెచ్చు
నూఱకున్న వాడె ఉత్తమ యోగిరా ॥విశ్వ॥ 1668

కామధేను వైన కల్పవృక్షం బైన
పారిజాత మైన బాహ్యసుఖము
నిచ్చుగాని మోక్షమీయగాఁ జాలదు ॥విశ్వ॥ 1669

కాలగర్భ మందుఁ గల లీలలన్నియుఁ
దెలియఁ గలఁడె యెంత ధీరుఁడైన
జెలగు లీలలన్ని శివలీలలే గదా! ॥విశ్వ॥ 1670

దుష్టజనుల మైత్రి దుర్గతికిం ద్రోవ
దొరలతోడి మైత్రి దొరకు ధనము
సాధుజనుల సేవ సద్గతికింద్రోవ ॥విశ్వ॥ 1671

పొట్టకూటి కొఱకు బట్టల మార్చెడి
వేషధారి మాట వినఁదగదు
పైకి బత్తి లోన బదునైన కత్తిరా ॥విశ్వ॥ 1672

అఖిల భారతమున ఆదిగా వెలిఁగెడి
సంగ రహితుఁడైన లింగమూర్తి
మూర్తి కొంచమైన కీర్తి గొప్పదగదా! ॥విశ్వ॥ 1673

దానవాళి శివుని దయగోరు భక్తులే
తగవు దప్పఁ ద్రిపుర దానవాళిఁ
దనదు భక్తులంచు దయఁజూపఁ గల్గెనా? ॥విశ్వ॥ 1674

మాయ తొలఁగునట్టి మార్గము చూపక
ఎన్నొ మాటలాడ నేమి ఫలము?
ముడ్డిమీదఁ దన్న మూతిపండ్లెటు రాలు? ॥విశ్వ॥ 1675

ఎన్ని చదువులున్న నెంత తెలివియున్న
సహజ గుణము మారఁజాల దెపుడు
చదువు వేఱు సహజ సద్గుణంబులు వేఱు ॥విశ్వ॥ 1676

మోటు మానవులకు బాటేదో తెలియక
ఏదొ పలుకు చుందు రెఱుకలేక
దున్నయీనినదన దూడఁ గట్టన్నట్లు ॥విశ్వ॥ 1677

దుష్ట శిక్షణమును శిష్ట రక్షణమును
పెక్కుసార్లు జరిపి పేరుగాంచి
రమరు లెందఱున్న హరిహరులే మిన్న ॥విశ్వ॥ 1678

తన్నుదాను తఱచి తనలోన నున్నట్టి
యాశుకళను జ్ఞాని యెఱుఁగఁ గలఁడు
పాలలోని వెన్న పరమాత్ముఁడో యన్న ॥విశ్వ॥ 1679

మాయగురువుఁ జేర మాయ మాయముగాదు
పరమహంసఁ జేర బరగు ముక్తి
ఉప్పునీటితోడఁ బప్పెట్లు లుడుకును ॥విశ్వ॥ 1680

కలఁతఁ జెంది రాత్రి కలఁగాంచు వస్తువు
లెట్లుగాంచు లోక దృశ్యమందు
ఎండ మావులందు నెట్లుండును నీరు ॥విశ్వ॥ 1681

మంచిశాసన మెద మనకిడె దేవుడు
దైవ శాసనంబు దప్పెదేని
శాసనంబు నీకు శాపమై తగులురా ॥విశ్వ॥ 1682

ఎన్ని శాస్త్రములను నేరీతిఁ జూచిన
మంచినడత కంటె మించిలేదు
మంచినడత మోక్షమార్గముఁ జూపురా ॥విశ్వ॥ 1683

వండుమన్న వనిత వాపిరి గొట్టుడి
తరిసెనేని వాఁడు తిండిపోతు
పెట్టుచేయు వారె బిట్టు ఫలము నొందు ॥విశ్వ॥ 1684

కూడుగూడు లేక కుమిలెడి పేదల
నాదరించు వాడె అనఘుఁ డరయ
అతడె స్వర్గఫలము ననుభవింపఁ గలాఁడు ॥విశ్వ॥ 1685

సంఘజీవి నరుఁడు శాంత శమదమాది
గుణములు గలవాఁడె జనుల మెప్పు
వడయుఁగలఁడు కడకుఁ బరమేశుఁ బడయురా ॥విశ్వ॥ 1686

అన్న! నీదువాక్కు లమృతమ్ము కురియుట
నాదుమదికి నెంతొ నచ్చియుండె
గాన నీదు కీర్తి కలకాలముండును ॥విశ్వ॥ 1687

మార్గదర్శి వగుట మదిలోన నిత్యము
నిన్నుఁ దలఁతు భక్తి సన్నుతింతు
వ్యర్థ రహితమైన వాక్కులిచ్చెద వంచు ॥విశ్వ॥ 1688

అనుభవించి తీరు నతడెంత వాడైన
భోగియైన పరమ యోగియైన
ధాతవ్రాతదాట దరమె యేరికినైన ॥విశ్వ॥ 1689

మూర్ఖునకును జ్ఞాని ముదముతో బోధింప
సతత మదికి నద్ది యతుక దెపుడు
నీరు చిల్లికుండ నిలుచుట కల్లరా ॥విశ్వ॥ 1690

గురువుమీద గాని పరమేశుపైఁ గాని
భక్తి యున్న వారిఁ బడయుఁ గలఁడు
భక్తిలేక ముక్తిఁ బడయు గాఁజాలఁడు ॥విశ్వ॥ 1691

శాస్త్రీయశబ్ద యుక్త సంగీతమును బాడ
రాయినైనఁ గరఁగు రాగమునకు
మనసు కరఁగు టెంత మానవజాతికి ॥విశ్వ॥ 1692

గొఱ్ఱెపిల్ల కంటె జెఱ్ఱిపోతె పిఱికి
పిల్లికంటెఁ జెవులపిల్లి పిఱికి
ఆడుదానికంటెఁ బేడిమొ పిఱికిరా ॥విశ్వ॥ 1693

పండితుండె గాని పామరుఁడే గాని
నిండుమనసు తోడ నిలువ వలయు
నిలువకున్నఁ బనులు నెఱవేరఁ జాలవు ॥విశ్వ॥ 1694

ఇతరుఁడెంత యనుచు నీసడింపఁగ రాదు
రాజునకును జిన్న రైతునకును
పరుల సాయమున్నఁ బనులన్ని నెఱవేరు ॥విశ్వ॥ 1695

కొండలెల్ల వెదకి కోరిన రాతిపై
శిల్పి చెక్కుచుండు శిల్పములను
మంచిశిష్యుని చెవి మంత్రరాజముఁ జెప్పు ॥విశ్వ॥ 1696

అడవిఁబుట్టు నాతఁ డడవిలోఁ బెరుగును
ఉదధి దరిజనించి యుండు నచటె
నాభిఁ బుట్టుపురుగు నాభినే పెరుగదా ॥విశ్వ॥ 1697

పిటికివాని కేల భీకర యుద్ధంబు
షండునకును నేల సానిపొత్తు
నాస్తికునకు నేల ఆస్తికుతో మైత్రి ॥విశ్వ॥ 1698

మంత్రివర్యు మాట మదిలోన యోచించి
మఁచినెంచి యాచరించె నేని
రాజుచెడఁడు వాని రాజ్యంబు చెడదురా ॥విశ్వ॥ 1699

నమ్మినట్టి వాని నట్టేట ముంచెడి
పాపిపడయ లేఁడు పరమ సుఖము
మూయఁగలఁడె వాఁడు ముక్కంటి కన్నులు ॥విశ్వ॥ 1700

ధర్మశాస్త్ర చయముఁ దఱచిన ఘనునకే
తీర్పు చెప్పఁదగిన నేర్పులుండు
తగుదు రట్టివారె ధర్మాసనము నెక్క ॥విశ్వ॥ 1701

పెద్దవారలెల్ల గద్దెలపై నుండఁ
బాడిమెఱిఁగి యాడ బాలుఁడైన
కర్ణుకంటె సభవి కర్ణుని మెచ్చరా ॥విశ్వ॥ 1702

అన్నియుడుగ మాట లడుగులు తడఁబడు
ఆదరించు వారి యండనుండు
ముసలితనము నెన్నఁ బసితనమే గదా ॥విశ్వ॥ 1703

ప్రేమ నాదరించు పెద్దల దీవన
మహిమ నొసగ దించు మదికిదలంప
పిన్నవారి కెపుడు పెట్టని కోటరా ॥విశ్వ॥ 1704

పడ్డచోట వెదుక ఫలితంబు దక్కనిం
కెచటొ వెదుక ఫలిత మెట్లుదక్కు
ప్రాప్తమున్న వాఁడె పడయు జ్ఞాపకశుద్ధి ॥విశ్వ॥ 1705

నక్కజిత్తులన్ని చక్కఁగాఁ దోచును
కపట మిత్రు చర్యగాంచు చుండ
తెలివిలేని వాఁడు తెలిసికోఁ జాలఁడు ॥విశ్వ॥ 1706

జ్ఞాన యుక్తమైన మానవ జన్మమే
మంచిదగిరి గాన మంచిచేసి
ముక్తిపొందు దారి ముందుగాఁ జూచుకో ॥విశ్వ॥ 1707

గుణములందు గొప్పగుణము శాంతమువిన
వినయ ధనము సాటి వేఱులేదు
రెండు నున్నవాఁడు దండికీర్తి గడించు ॥విశ్వ॥ 1708

పుణ్యతీర్థములకుఁ బోవుట మంచిది
దానఁ బొందఁగలవు జ్ఞానఫలము
భక్తి హెచ్చి కడకు ముక్తిని జూపురా ॥విశ్వ॥ 1709

శివునియందె నీదు చిత్తంబు నిలిచిన
బాహ్యదృష్టి ఘనుని బడయుకున్న
స్వప్నమందు నీకు సాక్షాత్కరించురా ॥విశ్వ॥ 1710

ధరణి జీవులందు దైవాంశ యుండును
కాని మాయచేతఁ గప్పఁబడును
లోకమర్మ మెఱిఁగి లోకేశుఁ గొల్వరా ॥విశ్వ॥ 1711

పంజరమున జిలుక పాఱిపోయిన యట్లు
జీవుఁ డెగిరిపోవుఁ జెప్పకుండ
ముందె శివునిగొల్చి ముక్తిని బొందరా ॥విశ్వ॥ 1712

ఆత్మఁదఱచి చూడ హరిహరు లొక్కటే
వాదమేల మనకు భేదమేల
వారిఁగొల్చి పరమ పదమును జేరరా ॥విశ్వ॥ 1713

అని తన పలుకుంబడులను
దన కష్టంజెప్పె నన్ను దయమాన విలో
కనములఁ గనుఁగొని నవ్వెన్
మునిచంద్రుం డతని కర్థిమ్రొక్కితి నంతన్ 1714

"భవబంధము లూడు నికన్
కవి శుభమస్తు" నుడు సెలవుఁ గైకొని మోద
మ్మొప్పరొత్తఁ బయన మైతిని
కవిరాజుల రాజకవులఁ గనుఁగొను వేడ్కన్. 1715

పరమశివుని కరుణఁ బదునేడు వందల
పద్యములకుఁ బైగ వ్రాసితెలమి
హరున కాత్మభక్తి నంకిత మిచ్చితి
విశ్వ వినుతచర్య వేమనార్య 1716

